# శ్రీ శివాజీ చరిత్రము

గ్రంథకర్త

శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు, M A

ఆదర్శప్రచురణ
ఐదవ ముద్రణ
డిశంబరు, 1966

SREE SIVAJI CHARITRAMU
by
Komarraju
Venkata Laxmana Rao, M A

వెల: రు. 4

Printed at
SRI PRINTERS

Published by
Adarsa Grandhamandali,
Vijayawada-2

# మొదటికూర్పు పీఠిక

ఆంధ్రభాషయందు చరిత్రగ్రంథంబు లత్యల్పంబుగ నున్నవి కాన, చేతనైనంతవరకు మాతృభాషాసేవ చేయవలయు ననిన యిచ్ఛతో నీ చరిత్రగ్రంథంబు వ్రాసినాడ. శక్తివంచనలేక యికముందు నిటులనే భాషాసేవ చేయవలయునని యిచ్ఛగలవాడను.

ఈ చరిత్రకు ముఖ్యాధారములు మహారాష్ట్ర చరిత్ర గ్రంథములైనందున నిందు విశ్వాసపాత్ర మగు సంగతులే వర్ణింపబడినవి. పరదేశస్థులచే వ్రాయబడిన యింగ్లీషుగ్రంథాదులలో పక్షపాతాదులుండవచ్చును. చరిత్రభాగములు కొన్ని చిన్నగా దెలియనందున చరిత్రలో గొరత యుండవచ్చును. కాని, మూల మహారాష్ట్రగ్రంథముల ననుసరించి యీ చరిత్ర వ్రాయబడినది.

(1) చిట్నీసు కృతమైన బఖరు,
(2) శివ దిగ్విజయము.
(3) మహారాష్ట్రాచా ఇతిహాస్

అను మూడు మహారాష్ట్ర చరిత్రగ్రంథములు నాకు ముఖ్యాధారములై యుండె.

దేశాంతర ప్రయాణమువలనను, దేహానారోగ్యతవలనను నీ చరిత్రంబు నేను బూర్తిచేయవలయునని నంత శీఘ్రముగా బూర్తిచేయ లేకపోయితినని యెంతయు జింతిల్లెద. ఇట్టి యాలస్యమును కోర్చియు, నన్ను గ్రంథము పూరించుటకు పురికొల్పుచు నీ గ్రంథమును సంపూర్ణముగా నచ్చొత్తించినందులకు "సరస్వతి" పత్రికాధిపతులకు గృతజ్ఞతా పూర్వకముగ వందనము నర్పించుచున్నవాడను

ఇట్లు
ఆంధ్రభాషా సేవకుడు
గ్రంథకర్త

# మూడవకూర్పు పీఠిక

శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు శ్రీ శివాజీ చరిత్రను ఇప్పటికి రమారమి ముప్పదియైదేండ్ల క్రిందట రచయించిరి అప్పటికి తెలుగులోనే గాక ఇంగ్లీషులోకూడా శివాజీని గూర్చిన యిట్టి యుద్గ్రంథము వెలువడియుండలేదు.

భారతీయులు బ్రిటిష్ రాజ్యతంత్రమున జిక్కి పారతంత్ర్యమున బడియుండినందువలన చాలాకాలమువఱకు బ్రిటీషు ప్రభుభక్తి పాఠములు బోధించు పక్షపాతపు చరిత్రలే రచియింపబడుచుండెను గాని, స్వదేశ స్వధర్మములపై నభిమానము బురికొల్పగల జాతీయచరిత్రలుగాని, మహాపురుషుల జీవితచరిత్రలు గాని వెలువడకుండెను

క్రీ॥ శ॥ 1905 సం॥ ప్రాంతమున మహారాష్ట్ర వంగ దేశములందు ప్రజలలో విజ్ఞాన వికాసమును, జాతీయ చైతన్యమును కలిగెను. అక్కడ దేశాభిమాన పూరితములైన జాతీయ వాఙ్మయము బయలు దేరెను దీనిజూచి శ్రీ లక్ష్మణరావు గారాంధ్రభాషలో కూడ అట్టి వాఙ్మయ రచనను ప్రోత్సహింపదలచి, విజ్ఞాన చంద్రికా మండలిని స్థాపించి అనేక గ్రంథములు ప్రకటించి గొప్ప భాషాసేవచేసినారు

శ్రీ లక్ష్మణరావుగారనేక శాస్త్ర గ్రంథములు, చరిత్రగ్రంథములను ఇతరులచేత రచియింపించుటయేగాక, తానుకూడ బహుగ్రంథావలోకనము గావించి చరిత్ర పరిశోధనముచేసి అనేకవ్యాసములను, గ్రంథములను రచించినారు వారు రచించిన హిందూదేశ కథాసంగ్రహమును భారత జాతీయ చరిత్రలోని హిందూ మహమ్మదీయ మహాయుగములు ఇప్పటికిని తెలుగులో సుప్రసిద్ధ జాతీయచరిత్రలుగా నున్నవి. వారు

మహారాష్ట్ర యుగమునకూడ రచింపదలచి ముందుగా నీ శివాజీ చరిత్రను రచియించిరి

ఐకమత్యములేక పిండారులతో పోరాడుకొను వివిధ మహారాష్ట్ర తెగలను ఏకజాతిగాచేసి బలవంతమైన మొగలాయి సామ్రాజ్యము యొక్క విగంపు శక్తిప్రాభవమును ధిక్కరించి, స్వధర్మము నుద్ధరించి స్వరాజ్యమును స్థాపించిన మహానుభావుడైన శివాజీయొక్క ఉజ్జ్వలచరిత్ర పారతంత్ర్యమున పాశ్చాత్యవ్యామోహమున బడియున్న భారతీయులను మేల్కొలిపి, వారికి స్వధర్మ స్వదేశాభిమానములను గలిగించి స్వరాజ్య కాంక్షను కలిగింపగల జాతీయ ఇతిహాసము భారతీయగౌరవమున్న గిట్టని ఆంగ్ల చరిత్రకారులు శివాజీని గూర్చి తెలిసి తెలియక వ్రాతలు వ్రాసి ఆయన గుణశీలములను నిందించుచుండిరి కాని మహారాష్ట్రదేశమునందా పురుషుని జీవితవిశేషములను గూర్చియు, గుణశీలములను గూర్చియు కవులు గాయకులు చరిత్రకారులు బహుచక్కగా వర్ణించి దేశీయులలో శివాజీ భక్తిని కలిగించిరి. దీని ఫలితముగా మహారాష్ట్రులలో జాతీయ చైతన్యమును, స్వరాజ్యకాంక్షయు కలిగెను

శ్రీ లక్ష్మణరావు పంతులుగారు సంస్కృతాంధ్రములందు మాత్రమే గాక, మహారాష్ట్రమునందుగూడ అసమాన పాండిత్యము గలవారగుటచే వారాభాషలోని గ్రంథములనెల్ల పరిశీలించి శివాజీచరిత్రను రచియించిరి శివాజీయొక్క గుణశీలములనుగూర్చి యాంగ్ల చరిత్రకారులు చేయు విమర్శనములెల్ల ఖండించి అతడు స్వధర్మరక్షణముచేసి, స్వరాజ్యము స్థాపించి, దేశము నుద్ధరించిన మహానుభావుడను విషయమును చక్కగా నిరూపించిరి. శ్రీ లక్ష్మణరావుగారు సమగ్రమైన మహారాష్ట్ర దేశచరిత్రముగూడ రచింపదలచిరి గాని మన దురదృష్టవశమున ఏబది యేండ్లయిన నిండక పూర్వమే 1923 లో స్వర్గస్థులైరి

శ్రీ లక్ష్మణరావుగారు చనిపోయినపిదప మహారాష్ట్ర దేశమున జరిగిన చరిత్ర పరిశోధనలను పరిశీలించి, తెలుగున మరల నట్టి యుద్గ్రం

ధమును రచించినవారు లేకపోయిరి తెలుగులోనే కాదు—ఇంగ్లీషులో సైతము మొన్న మొన్నటివరకు నట్టిగ్రంథము వెలువడలేదనియే చెప్పవచ్చును. ఇటీవల గోవిందరావు సఖారాం సర్దేశాయి గారట్టి చరిత్ర నొకదాని నింగ్లీషులో రచించినారు కేవలము మహారాష్ట్రభాషలోనేగాక- పారసీ, పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచిభాషలలో గూడా మహారాష్ట్రచరిత్రకు సరిపోవచ్చు విషయము లున్నవని వాని నెల్ల తెరచి యొక సమగ్ర గ్రంథము వెలువడవలసి యున్నది ఇటీవల ప్రకటింపబడిన చరిత్రలలో శివాజీ జీవితమునుగూర్చి కొన్ని విశేషములును, నూతనాంశములును కనబడుచున్నను శ్రీ లక్ష్మణరావుగారు శివాజీ జీవితమును వ్రాసిన ప్రధానాంశము లందుగాని, శివాజీ గుణ శీలములను గూర్చి చేసిన చర్చలయందు గాని, వారు గావించిన సిద్ధాంతములందుగాని, ఎట్టి మార్పులను చేయవలసిన అగత్యము కలుగుటలేదు అందువల్ల లక్ష్మణరావుపంతులు గారి చరిత్ర నిప్పటికిని ప్రమాణగ్రంథముగానే ఎంచవలసియున్నది.

శివాజీ తన జీవితమెల్ల స్వధర్మ స్వదేశముల నుద్ధరించుటకే ధారపోసెను అతడెన్ని దిగ్విజయములను చేసెను అవి కేవలము పరరాజ్యముల నాక్రమించి సామ్రాజ్యమును స్థాపించుటకుగాక, స్వదేశమును మ్లేచ్ఛులనుండి విడిపించి స్వధర్మమును స్థాపించుటకే అట్లు చేసెనని తెలియగలదు. అతడు దాదాజీ నరసప్రభువునకు 1645 లో వ్రాసిన లేఖలందు "హైందవీ స్వరాజ్య" మను పదమును పలుమరు వాడుచుండుట వలన దానిని స్థాపించుటయె అతని యుద్దేశమను సంగతి వెల్లడి యగుచున్నది శివాజి యందాధ్యాత్మిక చింత మెండుగా నుండెను. అత డే దిగ్విజయమున కేగినను ఆయా ప్రాంతములందలి దివ్యస్థలములనెల్ల దర్శించి, అచ్చటి దైవముల నారాధించు చుండును. శ్రీశైలమునందతడు కొంతకాలముండి మల్లికార్జును నర్చించెను అప్పుడతడు ధ్యాన నిష్ఠయందు మునిగియుండగా నా సమాధినుండి యాతనిని మేలుకొలుపుటయె దుష్కరమయ్యెను. శివాజి రామదాసస్వామికి శిష్యుడై తన రాజ్యమునెల్ల

ఆయనకు ధారపోసినాడు. ఆయన యాజ్ఞనెల్ల శిరసావహించి హిందూమత ధర్మములను రక్షింప నాగెను హిందూ యితి ధర్మములకు ముసల్మానుల వలన నెట్టి ఇక్కట్టులు కలుగుటకును శివాజీ సహింపకుండెను అయితే మహమ్మదీయులు తమ తమ ధర్మముల ప్రకారము జీవించుట కతడెట్టి యాటంకములను కలిగింపలేదు. మహమ్మదీయ మతమునుగాని, మహ మ్మదీయులనుగాని అతడు ద్వేషించి యెరుగడు శివాజికి హిందూ మహ మ్మదీయ మహాత్ములయందును, దివ్యస్థలములందును సమానగౌరవముం డెను రాయగడమున నతడు జగదీశ్వరాలయమును నిర్మించుటయెగాక, ముసల్మానుల కొఱకొక మశీదునుగూడ నిర్మించెను కెల్సి శాపురస్తు డైన బావాయాకత్ అను ముసల్మాను మహాత్మని దివ్యస్థలమునకు శివాజి యిచ్చిన జాగీరు లిప్పటికిని ఉన్నవి శివాజి రాజ్యమునందు చాలమంది మహమ్మదీయుల కతడుద్యోగము లిచ్చెను వారును అతనియందు భక్తి విశ్వాసములు కలిగియుండిరి అతని యాంతరంగిక కార్యదర్శి (మున్షీ) యైన ముల్లాహైదరు అతనికెంతో విశ్వాసపాత్రుడుగ నుండెను ఇట్లే అతని యాంతరంగిక భృత్యుడైన మదారీ మెహతర్ అను మహమ్మ దీయుడు శివాజి ఆగ్రా కోటనుంచి తప్పించుకొని వచ్చుటలో సహాయము చేసెను శివాజి కొలువునందు దౌలత్‌ఖాను సిద్దీలను మహమ్మదీయులు నావికాదళాధిపతులుగా నుండిరి.

శివాజి స్థాపించిన ప్రభుత్వవిధానము అష్టప్రధానుల ప్రభుత్వమని చరిత్ర ప్రసిద్ధమైనది అతడు రాజ్యవ్యవహారములనెల్ల ఎనిమిది శాఖలుగా చేసి, ప్రతిశాఖను నిర్వహించుటలో తనకు సహాయముచేయుట కొక్కొక మంత్రి నేర్పరచెను. న్యాయాధీశుడు తప్ప, తక్కిన మంత్రులందరును యుద్ధసమయములందు సేనాధిపతులుగాకూడ నుండిరి ఈ మంత్రులలో ముఖ్యునికి పేష్వా యనిపేరు. శివాజి కాలములో భయభక్తులతో మెలగు చుండిరిగాని, ఆయన అనంతరము పేష్వా బలవంతుడై తానే దేశపరి పాలకుడయ్యెను. తరువాత చాలకాలమువరకు మహారాష్ట్రరాజ్యములం దెల్ల ఈ అష్టప్రధానుల పద్ధతి ప్రకారమే ప్రభుత్వ వ్యవహారములు జరుగుచుండెను.

తుంగభద్రానదీతీరమున విజయనగరమును రాజధానిగా దక్షిణ హిందూదేశమునెల్ల ఏకచ్ఛత్రముగా పరిపాలించిన ఆంధ్ర చక్రవర్తులు స్థాపించిన ప్రభుత్వవిధానమునే శివాజి గ్రహించి, దానిని కొన్ని మార్పులతో అష్టప్రధానుల ప్రభుత్వపద్ధతిగా జేసెనని శ్రీ లోకమాన్య బాలగంగాధరతిలకు మహాశయుడు 31-3-1918 వ తేదిన చెన్నపట్టణమున గోఖలే హాలులో నుపన్యసించుచు స్పష్టముగా చెప్పియున్నాడు

విజయనగర చక్రవర్తుల ప్రభుత్వ పద్ధతులు వారు క్రొత్తగా నిర్మించినట్టివికావు అవి చాలవఱకు పూర్వకాలమునాటి హిందూరాజనీతి శాస్త్రములందు నివరింపబడిన రాజధర్మముల ననుసరించి నిర్మింపబడినవే. ఈ ప్రభుత్వపద్ధతి శ్రీకృష్ణదేవరాయలవారు తమ ఆముక్తమాల్యదలో వర్ణించియున్నారు. ఈ పరిపాలనావిధానమునందు విజయనగర చక్రవర్తులకుగూడ ఐదుగురు మంత్రులుండిరి అందులో ముఖ్యుని సర్వశిరఃప్రధాని యనుచుండిరి ప్రభుత్వము వివిధశాఖలుగా విభజింపబడి చక్కగా నిర్వహింపబడుచుండెను అయితే ఇందులో కొన్ని లోపములుండెను. విజయనగర సామ్రాజ్యమునందలి యుద్యోగులకు గొప్ప గొప్ప మాన్యములు జాగీరులిచ్చుచుండిరి వారు వివిధ రాజ్యభాగములకు ప్రభువులై కోటలు గట్టుకొని బలవంతులై తుదకు చక్రవర్తి యధికారమునే ధిక్కరించి స్వతంత్రులైరి. శివాజి తన యుద్యోగులకు రొక్కపు జీతమునే ఇచ్చుచుండెనుగాని జాగీరులు రాజ్యములు నివ్వలేదు మొగలాయి రాజ్యమునందువలె భూములను గుత్తకిచ్చు పద్ధతి, పన్నులు ఇజారాకిచ్చు పద్ధతి అవలంబింపక ప్రభుత్వాదాయమును వసూలుచేయు జమీందారులను అదుపు ఆజ్ఞలలో నుంచెను.

శివాజి కాలమున ఉద్యోగములు వంశపారంపర్యంగా గాక, వారి శక్తిసామర్థ్యములనుబట్టి యొసగబడుచుండెను దేశములో శాంతిభద్రతలను గాపాడు కార్యమును, న్యాయపరిపాలనా వ్యవహారములను, గ్రామపంచాయతుల వశము చేయబడెను దేశరక్షణము కొఱకు స్థలదుర్గములును జలదుర్గములును నిర్మింపబడెను. అందుకొఱకు గొప్ప కట్టుబాటులకు

తో నిర్మితమైన గొప్ప సైనికదళమును, నౌకాదళమును గూడ నిర్మింప బడెను. సముద్రవ్యాపారమునకు వీలు కలిగింపబడెను.

శివాజీకి ధర్మశాస్త్రములందు, మత ధర్మములందు గౌరవమున్నను పూర్వాచారములు గాని, మత విశ్వాసములుగాని, రాజ్య పరిపాలనకుగాని, దేశక్షేమమునకుగాని అడ్డువచ్చుట కిష్టపడక అవసరమైనప్పుడు వానిని నిర్భయముగా తృణీకరించి సంస్కరించుచుండెను. దేశ రక్షణమునకు, వాణిజ్యమునకు నౌకాదళ మావశ్యమైనందువలన సముద్రయానము చేయ గూడదని పూర్వాచారపరాయణులు చేయు నిషేధము నతడు తృణీకరిం చెను. దేశము మ్లేచ్ఛాక్రాంతమైన స్థితిలో బలవంతముగా నితర మతము లందు గలుపుకొనబడిన హిందువులు వర్ణభ్రష్టులుగ పరిగణింపబడుట యన్యాయమని యెంచి, శివాజీ వారికి ప్రాయశ్చిత్తములు చేయించి, మరల హిందూధర్మమునందు గలుపుకొనునట్లు చేసెను.

మొగలాయి సామ్రాజ్యమునందు పారసీభాష రాజభాషగా నున్నందు వలన, హిందువులాభాషనభ్యసించి స్వదేశవేష భాషలం దభిమానమును విడనాడి మొగలాయి నాగరికతకు దాసులగుచున్నారని శివాజీ గ్రహించి, తనరాజ్యమునందు పారసీభాషకు బదులుగా దేశభాషయైన మహారాష్ట్రి భాషను రాజభాషగా జేసెను. అంతేగాక — దేశభాషలకెల్ల జననియైన సంస్కృతమునకు విశేషగౌరవము నిచ్చి రాజ్యవ్యవహారమునం దుపయో గించు పరిభాషనెల్ల సంస్కృత పదములతోనే నిర్మించి, అట్టి పారిభాషిక పదములుగల రాజవ్యవహారకోశమను నొక సంస్కృత నిఘంటువును నిర్మించెను.

శివాజీయొక్క సైనికవ్యవస్థయు, యుద్ధపద్ధతియు చాలకట్టుదిట్ట ములకు లోబడినవై భారతదేశ చరిత్రలో ప్రసిద్ధి కెక్కినవి. శివాజీసైనికు లెల్లరు క్రమశిక్షణలనంది గొప్ప సేనాధిపతులచే నడపబడు చుండిరి. వారి శక్తిసామర్థ్యములనుబట్టి వారికి ప్రోత్సాహ మొసగబడుచుండెను. ప్రతి సంవత్సరము నవరాత్రి యుత్సవములందు రాజసభలో వారివారి యోగ్యతలనుబట్టి సన్మానములు జరుగుచుండును. శివాజీ సైనికులను

సేనాధిపతులును యుద్ధమునందు శౌర్యధైర్యములను జూపుటయేగాక, నీతి మత ధర్మములందు విరతిని కలిగి ప్రవర్తింపవలసి యుండిరి. యుద్ధము లందుగాని, దండయాత్రలందుగాని, స్త్రీలకు, పిల్లలకు, బ్రాహ్మణులకు, గోవులకును, వ్యవసాయకులకును ఎట్టి హానియు చేయరాదని శివాజీ శాసించెను

శివాజి కాలమున యుద్ధానంతరము జయింపబడిన శత్రుసైన్యముల వస్తువాహనములను విజేతలు తీసికొను నాచారముండుటయేగాక, శత్రు దుర్గములపైన, నగరములపైన దండయాత్రలుచేసి, కొల్లగొను నాచారము కూడ ఉండెను ఈ విషయమున శివాజిని నిందించిన ఆంగ్లేయ చరిత్ర కారులు తమ జాతీయులు చేసిన దండయాత్రల సంగతిని, దోపిళ్ళ సంగ తిని, పక్షపాత బుద్ధితో కప్పిపుచ్చినారు. టిప్పుసుల్తాను యుద్ధమున మర ణింపగా ఇంగ్లీషువారి చేతబడిన శ్రీరంగపట్టణము నాంగ్ల సైనికులు కొన్నాళ్ళపాటు విచ్చలవిడిగా దోచుకొనిరి. దానివలన నా నగర వాసుల కపారమైన నష్టము కలిగెను దోపిడి సొమ్ములో నాంగ్లేయ సేనాధిపతుల వంతునకు కొన్ని లక్షల రూపాయలు వచ్చెను. శివాజి చేసిన దండ యాత్రలయం దాతని సైనికులిట్టి అన్యాయములు చేయవీలులేకుండ వివిధ ములైన కట్టుబాట్లు చేయబడెను. యుద్ధానంతరముగాని, దండయాత్రల యందుగాని శివాజి ముందుగా నగరములోని ధనికులైన వర్తకులను బిలిచి కొంతసొమ్ము నష్టపరిహారముగా నివ్వవలసిందని కోరును. అట్లు చేయ నిరాకరించినప్పుడే ఆతడు నగరములను కొల్లగొనును. అప్పుడు కూడ రైతుల యిండ్లు వాకిండ్లుగాని, పంటలుగాని నష్టపరచుట కతడిష్ట పడడు యుద్ధములందును, దండయాత్రల యందును కొల్లగొనినప్పుడు సైనికు లెవరిచేతికి దొరికినది వారు దోచుకుని హరించుటకు వీలులేదు. వారికి దొరికినదెల్ల పై యధికారులకు వశపరుపవలసి యుండిరి. దండ యాత్రలకుబోవు ప్రతిసైనికునికిని అతని స్వంత వస్తువులపట్టిక యొకటి ఇవ్వబడుచుండును యుద్ధానంతరముగాని, అతని దగ్గరనున్న తక్కువ వస్తువులెల్ల నతడు సర్కారునకు వశపరుప వలసినదే. అట్లు చేయక మోసగించినవారు శిక్షింపబడుచుండిరి.

శివాజీ తన సైనికులను తన బిడ్డలవలె జూచుకొనుచు వారి కష్టసుఖములను కనిపెట్టి వారిని కాపాడుచుండెను. యుద్ధములందు మరణించిన వారి కుటుంబముల కుపకార వేతనములిచ్చి పోషించుచుండెను. గాయపడి పట్టుబడిన శత్రు సైనికులపట్లకూడ అతడు దయగలిగి వారికి చికిత్స చేయించి తరువాత విడిచిపుచ్చెను.

శివాజీ ఏ యుద్ధము చేసినను, ఏ కార్య మొనరించినను అతని ప్రధాన లక్ష్యము స్వధర్మ, స్వరాజ్య సంస్థాపనమే. అతడందుకొరకు దీక్ష వహించి, స్వార్థమును త్యజించి కష్టసుఖములను లెక్కచేయక అహోరాత్రములు పాటుపడుచుండెను. ఆహార విహారములం దతడు పాటించు కఠిన నియమములను జూచి విదేశీయులాశ్చర్యపడుచుండిరేగాని, అవియెల్ల ఆయన కార్యదీక్షలోని భాగమని గుర్తింపరైరి. ఇట్లే శివాజీ జీవితమును, చర్యలను విమర్శించిన ఆంగ్లేయ చరిత్రకారులును, ఆయా కార్యములను కేవలము తన స్వార్థముకొరకు గాక తాను పరమార్థమని ఎంచిన లక్ష్యములను సాధించుట కొరకే అతడాయా కార్యములను చేసియుండెనను విషయమును గమనింపలేదు

ఆంగ్లేయ చరిత్రకారులవలెను, వారి ఈ యభిప్రాయములను అనుకరించు ఇతర చరిత్రకారులవలెగాక, శ్రీ లక్ష్మణరావు పంతులుగారు శివాజీ జీవితమును స్వభావమును శీలమును పైన చెప్పినదృష్టితో పరిశీలించి వాని మంచి చెడులను నిష్పక్షపాతముగా చర్చించియున్నారు.

బెజవాడ
11-9-47

ఇట్లు,
దిగవల్లి వేంకటశివరావు

# నాల్గవ ముద్రణము

## పీఠిక

ఈ గ్రంథము మూడవసారి అచ్చుపడి ఇప్పటి కారేండ్లయినది. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులును, సహృదయులునైన డాక్టరు నేలటూరి వెంకట రమణయ్య పంతులుగారు శివాజీ చరిత్ర మూడవ కూర్పును గూర్చి (1948 సం॥ జనవరి) సర్వజిత్తునామ సం॥ మార్గశీర్షమాసపు భారతిలో నిట్లు వ్రాసియున్నారు.

"ఆంధ్రదేశమునందు ప్రఖ్యాతినందిన చరిత్రకారులలో కీ॥ శే॥ శ్రీ కె. వి. లక్ష్మణరావు పంతులుగా రగ్రగణ్యులు. ఇరువదియవ శతాబ్దపు ప్రారంభం దశయందు తమ రచనలచే జాతీయోద్బోధము కలిగించిన మహనీయులలో వీరొకరు

"వీరు మహారాష్ట్ర చరిత్ర పరిశీలనా సాంప్రదాయమున తరిఫీదు నంది రానడే, రాజవాడే, మొదలయిన మహారాష్ట్ర చరిత్ర పరిశోధకుల రచనల నాదర్శముగ నుంచుకొని చరిత్ర రచనకు గడగిరి

"అప్పటికి లభించిన చరిత్రాంశముల నన్నిటిని సమకూర్చి పరిశోధించి లక్ష్మణరావుగారీ గ్రంథమును వ్రాసిరి నాటికిని, నేటికిని ఆంధ్రమునగల శివాజీ చరిత్ర ఇది యొక్కటియే. లక్ష్మణరావుగారి గ్రంథముయొక్క యుత్కృష్టతను దెల్పుటకిది యొక్కటిచాలును. కాని లక్ష్మణరావుగారి శివాజీ చరిత్ర ప్రకటింపబడిన పిమ్మట చాల చరిత్ర పరిశోధన జరిగినది. పెక్కు నూతన విషయములు బయల్పడినవి వీని వలన లక్ష్మణరావుగారి గ్రంధమున కొన్ని నెరసులు బయల్పడినవి." అని ఈ క్రిందివాని నుదాహరణముగ చూపినారు

శివాజీ చరిత్ర ౪.౫ పుటలలోని అధోజ్ఞాపికలో నుదహరింప బడిన రామరాజీయములోని పద్యమున పేర్కొనబడిన శ్రీ రంగరాయలు అళియ రామరాజు తండ్రి శ్రీ రంగరాయలు కాదు అతడు 15.1 మొదలు 1586 వరకు విజయనగర సామ్రాజ్యము నేలిన శ్రీరంగరాయలు-తిరుమల రాయల పుత్రుడు

"శివాజీ చరిత్ర ౨౨ పుటలో శహాజీ విజయరాఘవుని గెలిచి తంజావూరును రాజధానిగ జేసికొనెనని వ్రాయబడినది. శహాజీ కుమారు డైన ఏకోజీ మధురనాయకుని గెలిచి తంజావూరు స్వాధీనపరచికొనినవాడు

"ఇట్టి లోపములు పాలలోని నలుసులవంటివి. గ్రంథముయొక్క గుణాతిశయము వీనివలన దరుగజాలదు"-అని శ్రీ వెంకటరమణయ్య గారే సెలవిచ్చినారు

ఇటీవల జరిగిన చరిత్రపరిశోధనల ఫలితముగా శ్రీ లక్ష్మణరావు గారు వ్రాసిన కొన్ని చరిత్రాంశములు, వాదమున కెడము లేనట్లుగ స్థిర పడినవి. ఉదాహరణమునకు శివాజీ అఫ్జల్‌ఖానుని మోసగించి వధించె నని కొందరు ఆంగ్లేయ చరిత్రకారులు వ్రాసిరి. అఫ్జల్‌ఖానుడే శివాజీని ఏమరపాటున చంప ప్రయత్నింపగా శివాజీ యతనిని వధించెనని మహా రాష్ట్ర గ్రంథములందు వ్రాయబడిన సంగతిని శ్రీ లక్ష్మణరావుగారు గ్రహించినారు. ఇటీవల జరిగిన చరిత్ర పరిశోధనలవలన మహారాష్ట్ర గ్రంథములలో నుదాహరింపబడిన సంగతులే నిజములని స్థిరపడినవి ఇట్లే శివాజీ గుణశీలములను విమర్శించుపట్లగూడ పరిశోధనల ఫలిత ముగ పాశ్చాత్య చరిత్రకారుల యభిప్రాయములలో కొంతమార్పు కలుగు చున్నది, లక్ష్మణరావుగారి యభిప్రాయములే సమంజసములని ధృవపడు టకు అవకాశము కలిగినది.

శ్రీ లక్ష్మణరావు పంతులుగారి గ్రంథమును గ్రాంథికశైలిలో వ్రాసినారు. అయితే దానిని నూతనపాఠ సూత్రములననుసరించి అప్పు చిత్తు

అను నా దిద్దువారి లోపమువలన కొన్నికొన్ని చోటులలో భాషాదోషములు దొరలినవని శ్రీ నిడిగూర్పి వెంకట రమణయ్యగారు తమ విమర్శలో పేర్కొని యున్నారు ఈ నాటకమును కూర్పు అతిత్వరితముగా ముద్రింపవలసివచ్చుట వలన గ్రంథ ప్రకాశకుడు నేను ముద్రణమందుకూడ ఈ లోపము సవరింప లేకపోయితిని. గుణగ్రహణ పారీణులగు పాఠకులు ఈ పొరపాటును మన్నించి గ్రంథము నాదరింతురనుటకు సందేహములేదు

బెజవాడ
3-12-1952

డి. వేం. శి.

# విషయసూచిక

శ్రీరస్తు

# శ్రీ శివాజీ చరిత్రము



## మొదటి ప్రకరణము

---

### దేశస్థితియు, శివాజిపూర్వుల వృత్తాంతమును

శివాజి యనఁ బదునేడవ శతాబ్దంబున నుదయించి తన మాతృభూమియైన మరాటదేశంబునకు నదివఱకుఁ దురుష్కులచేఁ గలుగుచుండిన తాపంబు నివారించి మహారాష్ట్రులకు స్వాతంత్ర్యం బొసంగి స్వరాజ్య సంస్థాపకుం డనుబిరుదు వహించిన మహానుభావుండు. ఆంధ్రులచేఁ గర్ణాటదేశంబున స్థాపింపఁబడి, మహావైభవశిఖరమునకు నెక్కి బుక్కరాయకృష్ణరాయలను ప్రచండకిరణంబులచేఁ గొంతకాలము వఱకు యవనపారసీకులను గ్రుడ్డిగూబలఁ జేసిన విజయనగర రాజ్యమార్తాండుఁడు, సృష్టినియమంబు ననుసరించి తాలికోటలో క్రీ. శ. 1564 వ సంవత్సరమున నస్తమింప యవనరాజ్య మను చిమ్మచీఁకటిలో మునిఁగియున్న దాక్షిణాత్యులకుఁ దిరిగి స్వరాజ్యకిరణంబులఁ జూపిన బాలార్కుండితండె. ఉత్తరదేశమునుండి దక్షిణదేశమంతయు ముసుంగునటుల వఱదలుగా వచ్చెడి మొగలుల ప్రవాహమునకు నడ్డము తగిలి దానిని వెనుకకు మరలించిన దీర్ఘోన్నతపర్వతం బితండు. ఆంధ్రమరాటకర్ణాటదేశంబులందుండి హిందూమతంబు అను రమ్యోద్యానంబులఁ జొరఁబడి సుందరంబులయిన పుష్పఫలవృక్షములఁ బాడుచేయుచుండిన బహామనీ తురుష్కరాజ రూపంబు లగు మదపుటేనుంగుల తీఁట యడంచిన

మగసింగం బీతండఃఇట్లు హిందువుల యొక్క హిందూత్వము పోకుండఁ గాపాడిన మహాపురుషుని చరిత్రం బందఱకును ననుకరణీయంబు గాక పోయినను, నాదరణీయంబును, నాహ్లాదకరంబును నగు నని తలంచి తచ్చరిత్రరత్నం బాంధ్రంబున వ్రాయఁ బూను చున్నాఁడను

శివాజి జీవిత మంతయుఁ దురుష్కరాజులతోఁ బోరాడుట యందే కడచినందున నాతని జన్మసమయమునను గొంతికాలము తత్పూర్వము నను నే యె తురుష్కరాజ్యము లెక్క డెక్కడనుండెనో తురకరాజులకు నొండొరులమొడ పెట్టిభావ ముండెనో స్పష్టముగాఁ దెలిసినఁగాని శివాజి చరిత్రము చదువరులకుఁ దిన్నగా బోధపడదని యెంచి యప్పటి రాజకీయస్థితి సంగ్రహముగా నిచ్చుటఁ జూపెద

శివాజిజన్మమున కెన్నియోదినములు పూర్వమే, దక్షిణములోని బహమని యను యవనరాజ్యం బంతరించి, యందు నుండి యైదు స్వతంత్రరాజ్యంబులు పుట్టెను వానిలో రెండంతరించి మన చరిత్ర నాయకుని కాలమువఱకు మూఁడు రాజ్యంబులు మాత్రము శేషించి యుండెను. అవి యేవి యన —

1 అహమదునగరరాజ్యము—దీనికి నిజామశాహి యని పేరు క్రీ శ 1618 వ సంవత్సరమున మొగలులచే నీ పట్టణము జయింపఁబడి యచటిరాజు చెఱపట్టఁబడెను కాని మాలికాంబరను వాఁడు రాజవంశములోని యొక కుఱ్ఱవానిని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి, మరల రాజ్యమును స్థాపించి కొన్ని సంవత్సరములవఱకు మొగలుల ధిక్కరించు చుండెను శివాజి పెద్దవాఁడై స్వరాజ్యము స్థాపింప యత్నముచేయువఱకు నీ రాజ్యము పూర్ణముగా మొగలులచేతబడి నాశనమొందినది కాన మన కీ చరిత్రంబులో నీ రాజ్యంబుతో సంతగాఁబనిలేదు అయినను శివాజీతండ్రి యగు శహాజీ తన జీవితకాలములోఁ జాలభాగ మీరాజుల సేవలోనే కడపినందునను శహాజి చరితము తిన్నఁగా బోధపడినఁగాని శివాజిచర్యలు చక్కఁగా బోధపడనేరవు గనుకను నీ సంస్థానంబు ప్రస్తుత చరిత్రంబులోని సంస్మరణీయ రాజ్యంబులలో నొక్కటి యనందగు.

గోలకొండరాజ్యము—దీనిని కుతుబ్‌శాహీ యనియెదరు రామదాసు కీర్తనలచే నాంధ్రదేశంబున నజరామరంబు లయిన 'తానీష' 'గోలకొండ కోట' 'చెఱసాల' మొదలయిన నామంబులు తెలుగువారికిఁ గ్రొత్తలుగాక చిదీర్ఘకాల పరిచితంబులే ఈ రాజ్య మాంధ్రదేశంబునం దుండినందున సిది శివాజి త్రోవలోనికి నంతగా వచ్చినదికాదు కాని యీ రాజులకును శివాజీకిని నొకటిరెండు పర్యాయంబులు పోరాట కల్గఁగా అక్కన్న మాదన్న లను పింగలివంశస్థు లయిన మంత్రిపుంగవుల చాతుర్యప్రభావంబున 'తానీషా' యనఁబడు అబూ హుసేనునకును శివాజి కిని స్నేహంబే కలిగెను

3 బీజాపూరురాజ్యము—దినికి ఆదిల్‌శాహీ యను నామాంతరము కలదు మన చరిత్రనాయకుఁడు ముఖ్యముగాఁ బోరాడినదియుఁ గొన్ని సమయములయందు మైత్రి చేసినదియు నీ సంస్థానంబుతోడనే ఈ యాదిల్‌శాహీ రాజులు మిక్కిలి మహాసమర్థులై యెల్లప్పుడును నైజామ శాహివారితోను విజయనగర సంస్థానముతోను నిరర్థకముగాఁ బోరాడు చుండిరి అహమదునగరము రాజ్యముఁ బాడుచేయుటలో నీరాజులే మొగలులకు ముఖ్యముగా సాయముచేసి, తుదకుఁ దాము మొగలులను వగ్నికి నాహుతు లైరి

ఇట్లు దక్షిణములోఁ బదునేడవ శతాబ్దమధ్యమున మూఁడు తురక రాజ్యము లుండెను † ఈ మువ్వురు రాజులును బరస్పర ద్వేషము గల వారలయి యెప్పుడును యుద్ధములుజరుపుచుఁ బ్రజలకును దమకును నమితములయిన బాధలు కలుగ జేసికొనుచుండిరి వీరిలో వీరికిఁ గల వైరము లటుండ వీ రందఱకు సామాన్యశత్రుం డొకఁ డుత్తరదేశము నుండి వచ్చుచుండెను ఆతం డెవ్వఁ డన —

† ఈ మూఁడు తురుష్కరాజ్యములను మనయాంధ్రరాజులు గెలిచి యుండిరి కృష్ణదేవరాయ లీ రాజ్యము లన్నింటిని గెలిచినమాట జగత్ప్రసిద్ధంబె తాలికోటలోఁ గాలవశంబునఁ బడిన రామరాజు తండ్రి యగు రంగరాజు కూడ రాజ్యత్రయంబుగెల్చె ననుటకు

డిల్లీబాదుషహా,—అక్బరుబాదుషహా కాలమునుండియు దక్షిణదేశములోని పైఁజెప్పిన తురుష్కరాజ్యములను గెల్చుటకు డిల్లీశ్వరులు యత్నించుచుండిరి బిజాపూరు మొదలైన రాజ్యములకుఁ గూటస్థుండైన మొదటిబహమనీరాజు డిల్లీశ్వరుని దండనాయకుఁడు ఆతఁడు దక్షిణమున స్వతంత్రుండై, డిల్లీశ్వరునిఁ బాటింపక యుండెను గాన నట్టి రాజద్రోహుల గెలిచి సేతుపర్యంతము డిల్లీప్రభుత్వముఁ జేయవలయునని యక్బరు,జహాంగీరు, తత్పుత్రుఁడైన షహాజహాను,వాని కుమారుఁడగు అవరంగజేబు దాక్షిణాత్యతురుష్కులతో ఘోరముగాఁ బోరుచుండిరి శివాజి జన్మసమయమున షహాజహాను డిల్లీపీఠము నలంకరించి యుండెను ఔరంగజేబు రారాజుగా నున్నప్పుడు శివాజి ప్రబలెను

ఇట్లు మహమ్మదీయరాజులకుఁ బరస్పరకలహములు సంభవించి దేశ మంతయు నల్లకల్లోలముగా నున్న సమయమందు అహమద్‌నగరమురాజునొద్ద సిద్దులు మహారాష్ట్రవీరులు గొప్ప యుద్యోగముల పై

---

నాధారం బున్నది ఈయనను గుఱించి రామరాజీయములో నిట్లు వ్రాసియున్నది —

సీ కదువిజాపురవర కామినీగర్భముల్ భేదించు నెవ్వని భేరిరవము
దామిడీఁబోయి నిజాముపట్టణముల ధూళిగాఁజేయు నే దొరబలంబు
గోలకొండవజీర్ల కోటులకాయముల్ చించునేరాజేంద్రు చేతికత్తి
సకలభూపాలక స్థానసన్నుతిఁగాంచి వెలయు నేభూరుని విజయలక్ష్మి
యతఁడు కేవలనృపతియే యఘు,దూర, చర్యుఁ డాశ్రితరక్ష
విచక్షణుండు
జిష్ణుకర్ణాటక,రాపుసార్వభౌముఁడు, రమ్యగుణశాలి శ్రీరంగరాయమౌళి

ఆంధ్రకవుల యీ వ్రాఁతలన్నియు నసత్యములని కొందఱాధునికనాగరకులు చెప్పెదరు కాని తురుష్కులు వ్రాసిన గ్రంథములను మాత్రమునమ్మి యాంగ్లేయులు వ్రాసిన గ్రంథములను నమ్మకపోవుటకు స్వదేశాభిమానశూన్యత తప్ప వేఱు కారణము లేదు.

నుండిరి. ఒకఁడు శివాజి తల్లితండ్రి యైన లకజీజాధవుఁడు, రెండవ వాఁడు శివాజి తండ్రితండ్రి యైన మాలోజి. వీరిద్దఱును మరాఠాజాతివారు. ఈమరాఠాజాతివారందఱును దాము రాజపుత్రస్థానములోని క్షత్రియుల మని చెప్పుకొనియెదరు గాని యీ జాతివారిఁగా రాజపుత్రులకును మహారాష్ట్ర దేశములోని కాఁపువాండ్రకును గలిగిన సంతతులయని సామాన్యవదంతి కలదు. మరాఠావారితల్లు లెవరయినను దండ్రులు రాజపుత్రస్థానములోని క్షత్రియులే యనుటకు సందేహము లేదు. శౌర్యధైర్యసాహసములను రాజపుత్రగుణములను, పాటుపడుట, కష్టమును సహించుట, దంభరాహిత్యము, కుయుక్తిచేతనైన శత్రువును బరిమార్చుటయును మహారాష్ట్రదేశీయ గుణములను నీ మరాఠాజాతియందు గలవు కనుక నిది మిశ్రమజాతి యనియే తోఁచుచున్నది. ఇట్టి మరాఠజాతి వీరులనేకులు నిజామాది తురకరాజులయొద్ద నుద్యోగములతో నుండిరి. వారియందరలోఁ బైఁ బేర్కొనిన యిద్దఱువీరులు ప్రముఖులనుటకు సందేహము లేదు.

లకజీజాధవుఁడు దేవగిరి (యిప్పటి దౌలతాబాదు) యాదవరాజుల వంశజుఁడు. అప్పటి మరాఠ† వీరులలో నెంచ బలాఢ్యుఁడును, అధికార సంపన్నుఁడును మఱియెవఁడు లేఁడయ్యె. ఇతఁడు విదర్భదేశము (Berars) లోని సిందఖేడుపరగణాకు దేశముఖు (దేశముఖ్య)గా నుండఁ బదివేలగుఱ్ఱపురౌతులకు నధికారియై యుండెను. క్రీ. శ. 1629 సంవత్సరమున నితఁడు మొలిశాంబరునకు సహాయుఁడై మొగలులను నర్మదానది యవతలి తీరమునకుఁ బాఱఁ దోలెను.

లకజీతరువాత లకి యంతవాఁడు మాలోజీ ఇతివి యింటిపేరు

---

† మహారాష్ట్రులు 'మరాఠ' యనియు, నాంధ్రులు 'మరాట' యనియు వ్రాసెదరు గావ నేనుభయరూపంబుల నుపయోగించెద

‡ భోఁసలా మాలోజి స్వపరాక్రమముచే కొలఁది స్థితినుండి గొప్ప దశకు వచ్చెను. ఇతనితండ్రి యగు బాబాజి కొన్ని గ్రామములకుఁ బటేలుగా నుండెను పటే లనఁగాఁ బ్రస్తుతపు గ్రామమునసబువంటి యొక చిన్నయధికారము. ప్రథమమున మాలోజి, లుకజీయొద్దనే యుద్యోగము సేయుచుండెను ఆతని తెలివి తేటలఁజూచి లుకజీజాధవుఁడు సంతసించి, అహమదునగరమురా జయిన మొదటి మూర్తిజానిజాముశహా యొద్దకు నతనిని దిసికొనిపోయి, క్రీ. శ 1577 వ సంవత్సరమున నతనికి 'శిలేదారు' యను నొకయధికార మిప్పించెను శిలేదారుఁ డన నశ్వసైనికులలోని యొక చిన్న యధికారి. మాలోజి తిన్న తిన్నఁగాఁ దనయశ్వసైనిక లసంఖ్య హెచ్చించి ఘన మైన రాజకార్యముల నిర్వహించుచుఁ దన గౌరవమును వృద్ధిపఱుచుకొను చుండెను ఇంతలో వెంకోజి నింబాళకరుఁడను బీజాపురరాజ్యములోని సంస్థానకుఁ డొకఁడు దీపాబాయి యను తన చెలియలి నిచ్చి మాలోజికి వివాహము చేసెను. ఈ దంపతుల కనేకదినములవఱకు సంతతియే కలుగకుండెను పుత్రసంతానార్థ మీదంపతు లహమదునగరములోని శాహాషరీఫను పీరునకు మ్రొక్కుకొనిరి అందుపైఁ క్రీ శ 1594 వ సంవత్సరములో వారికి నొక కుమారుఁడు గలిగెను శహాశరీఫను తురకపీరు కృపచే నీపుత్రుఁడు గలిగె నని యెంచి యాపిల్లవానికి "శహాజీ" యని పేరు పెట్టిరి. మాలోజికి క్రీ శ 1595 వ సంవత్సరమున నింకొక కుమారుఁడు గలిగెను వానికి 'శరఫజీ' యని నామకరణము చేసిరి

మాలోజి జ్యేష్ఠపుత్రుఁ డగు శహాజి చిన్ననాఁటి నుండియు స్వరూపమందుఁ జక్కనివాఁడుగను, స్వభావమునందు, బుద్ధిమంతుఁడుగను, ప్రజ్ఞాతిశయములు గలవాఁడు గను నుండెను అందుచే లుకజీజాధవుఁడు గూడ నీ కుఱ్ఱవానిని మిక్కిలి ప్రేమించు చుండెను. క్రీ శ

‡ ఇంగ్లీషు పుస్తకములఁ జూచి మనవాం డ్రీశబ్దమును భోన్సలా యని యుచ్చరించెదరు కాని యది తప్పు ఇందలి ద్రుతంబు పూర్తిగా నుచ్చరింపక మిక్కిలి నణఁగ ననునాసికము నుచ్చరిం పవలయును

[illegible] లో నవఁగా శహాజి యైదు సంవత్సరములవాఁ డయిన నప్పు డతనిని వెంటఁబెట్టుకొని మాలోజి † 'రంగపంచమి' యను పండుగ రోజున, లుకజీజాధవుని యింటికి వెళ్లెను. అక్కడి కప్పుడు లుకజి యొక్క బంధువులును, ఇతర సరదారులును వచ్చి యుండిరి. లుకజి శహాజిని తనయొద్దకుఁ బిలిచి, ముద్దుపెట్టుకొని, తన తొడమీఁదఁగూర్చుండిన జిజాయను తన కూఁతునొద్దఁగూర్చుండ బెట్టుకొనెను. లుకజీ కుమార్తె యగు జిజియు మిక్కిలి చక్కనిది. ఆ యిద్దఱు పిల్లల చక్కఁదనమును, సమవయస్కతయుఁ జూచి మనంబున సంతసించి 'వీ రిరువురు దంపతులగుటకుఁ దగుదురు. జిజా! నీ కీమగఁడు కావలయునా?' యని నవ్వుల కనెను. ఇంతలో నాపిల్ల లిద్దఱును గులాలు బుక్కాయాడఁ జొచ్చిరి. ఈ బాలక్రీడలకు సభాసదు లందఱు మిగుల సంతసించిరి. ఇంతలో మాలోజి యచ్చటివారి నందఱను జూచి "చూచితిరి మీయందఱముందటనే లుకజీ నేఁటినుండి మా వియ్యంకుఁ డయ్యెను. ఈమాట తప్పరాదు సుండీ' యని యొత్తి పలికెను. తరువాత నెవరియింటికి వారు వెళ్ళిరి.

రెండవనాఁడు మాలోజిని జాధవరావు (లుకజి) భోజనమునకుఁ బిలువఁగా నిన్నటిమాట మీరు నిశ్చయపఱిచిన ట్లయిన నేను భోజనమునకు వచ్చెద నని యతఁడు చెప్పి పంపెను. లుకజీ జాధవున కంతగా నసమ్మతంబు గాక పోయినను నీ సంబంధం బెంతమాత్రమును నతని భార్యకు సమ్మతంబుగా దయ్యె. జాధవరావు శ్రీమంతుఁడు, మనసబదారుఁడు, దేశముఖుఁడు. మాలోజియో, యీ యధికారము లేమియు లేని చిన్న శిలేదారుఁడు. అంత గొప్పవంశములోని తన కూఁతును నింతకొలఁది వంశములోని శహాజి కిచ్చుటకు జాధవునిభార్య యిష్టపడ దయ్యెఁ గాని యీ సంబంధమువలననే జాధవునివెంట యసంఖ్యదేశముఖులకు యజమానుఁడై డిల్లీశ్వరుం డగు రారాజును గూడ దిద్దిమ్మని నాట్యమాడించు

† ఈ పండుగ ఫాల్గుణ బ. పంచమి నాఁడు వచ్చును

మహాప్రతాపశాలి యైన శకకర్త యుద్భవింపఁగలఁ డని యాయమ్మ కప్పుడేమి యెఱుక?

జాధవునితో సమానమైన స్థితి మనకు లేనందున నతఁడు మనకుఁ బిల్ల నియ్య సంశయించుచున్నాఁ డని యెఱిఁగి, యతనితో సమముగాఁ దూఁగునంతటి యైశ్వర్యమును నధికారమును సంపాదించి యతనికూఁతునే నా కుమారునకుఁ జేసికొనియెదనని మాలోజి పట్టు పట్టెను. తనమఱఁది యగు వెంకోజినింబాళకరుని సహాయముపొందను, తనబుద్ధివిశేషముచేతను త్వరలోనే మాలోజి యహమదునగరపు రాజునొద్ద నైదువేల గుఱ్ఱపు రౌతులకు నాధిపత్యమును, 'రాజా' యను పదవియు, శివనేరుచాకణు లను రెండుదుర్గముల యాధిపత్యమును, ఆ దుర్గములకు సమీపము నందున్న ప్రాంతమునకు దేశముఖియు పూనా సుపా యను పరగణాల జవాగీరును సంపాదించెను ఇదియుఁ గాక యిల్లు కట్టుటకుఁ బునాది త్రవ్వుచుండఁగనో లేక మఱి యేహేతువుచేతనో భూమి త్రవ్వుచుండఁగా నతనికి నమితమైన ధనము దొరకెను అప్పటి నమ్మకమును బట్టి వారా ధనము తమకు భవానిదేవియే యొసఁగె నని నమ్మిరి, ఆ నమ్మికయే ప్రకటించిరి. ఇట్టిస్థితి యిట్లుండఁగా గ్రాంటుడఫ్ దొరవారు తమ "మరాఠాల యితిహాసము" లో (History of Mahrathas) మాలోజి కుయుక్తులచే ధనము సంపాదించె నని వ్రాసిరి ఈ మాట నిరాధార మైనది

ఇట్లు మాలోజి లఖూజితో సమానముగా మనసబుదారుఁడును దేశముఖుఁడును ధనవంతుఁడును నైనందున శహాజికి జిజా నిచ్చుటకు లఖూజి యొప్పెను ఇదియుఁగాక అహమదనగరము నవాబు లఖూజితో శహాజిని నల్లునిఁ జేసికొను మని, బోధించెను క్రీ. శ. [illegible]౦ వ సంవత్సరమునఁ శహాజీకిని జిజాబాయికిని, అమితమహోత్సవముతో వివాహము జరగెను ఆ వివాహమునకు స్వయముగా నహమదునగరపు సులతాను వచ్చి యుండెను. ఈ దంపతులే మన చరిత్రనాయకుని తల్లియుఁ దండ్రియు.

కొన్నిరోజులకు మాలోజి స్వర్గస్థుఁడు కాఁగా సర్వాధికారంబు శహాజికిఁ బ్రాప్తమయ్యెను జాధవుఁడును శహాజియు నహమద నగరము రాజులకు ముఖ్యాధారులుగా నుండిరి క్రీ శ 1620 వ సంవత్సరమున మొగలులు అహమదునగర రాజ్యముపై దండెత్తి వచ్చిరి అప్పుడా రాజ్యమునకు మాలికంబరను వాఁడు మంత్రిగా నుండెను వాఁడు లుకజీ శివాజీల సహాయముచే మొగలులను బూర్తిముగా నోడించెను మాలికాంబరుఁడు క్రీ శ 1625 లో గతించెను ఇతని మరణానంతర మహమదు నగరరాజ్య మంతయు నరాజక మై, రాజునకును మంత్రులకును, మంత్రులలో మంత్రులకును గలహములు గలిగి, యంతఃకలహములకు నా పట్టణము పుట్టినిల్లయి యుండెను ఈ కలహముల నన్నిటిని అడఁచి యా రాజ్యమును మొగలుల చేతినుండి రక్షించుటకు శహాజీరాజు వాల ప్రయాసపడెను లుకజీజాధవుఁడు తనరాజును వదలి మొగలులలోఁ గలిసి నప్పటికిని శహాజి యహమదునగరపురాజునే పట్టుకొని యుండెను క్రీ శ 1629 లో నిఁక మొగలులతోఁ బోరాడుట యసాధ్యమని తలంచి శహాజి ఢిల్లీశ్వరునితో సంధి చేసికొనెను. అప్పుడు ఢిల్లీపాదుషహా యగు షహజహాను శహాజికి నాలుగువేల మనసబును, నైదువేల గుఱ్ఱపు రౌతులపై నధికారమును నొసంగెను ఇట్లు ఢిల్లీశ్వరునితో నిరు[illegible] నపుడు సంధిచేసికొనినను, శహాజిలక్ష్యమంతయు నైజాముశాహి నిలుపుటయందే యుండెను క్రీ శ 1634 లో శహాజి, యిది మంచిసమయము గదా యని తలంచి యహమదు నగరరాజ్యముమీఁద నొకపిల్లవానిని గూర్చుండఁబెట్టి నిజాముశాహికి జీవము పోయ యత్నించెను ఈ కాలముల నెతఁడు ఢిల్లీశ్వరుని మొగలు సైన్యముల నెన్నియో పర్యాయములోడించెను బ్రాహ్మణాధికారులఁ గొందఱను నియమించి, కొంత రాజ్యము జయించి, బాలరాజు పేరటఁ దాను రాజ్యము సేయ నారంభించెను. మీరు మేము గూడి మొగలుల గెలిచెద మని చెప్పి [illegible] వారలను గలుపుకొని మొగలులతో సంధి చేసికొనినందున క్రీ శ. 1637 వ

సంవత్సరమున అహమదు నగరిరాజ్యము పూర్తిగా వినాశ మొందెను తరువాత శహాజిరాజు బిజాపురరాజునొద్ద నుద్యోగమున కుండెను

బిజాపురమురాజగు మహమ్మదు ఆదిల్‌శహా శహాజిని నాదరించి, యతని నైజాముశాహిలోని జాగీరు లన్నియు నతని కిచ్చి, యతనిని భీమా, నీరా యను నదులనడుమ నున్న ప్రాంతమునకు నధికారిగా నేర్పఱిచెను అతఁ డావలిలోఁ గీర్తి చెందిన పిదప నతనిని రెండవ దండనాయకునిఁగాను రణదుల్లాఖా నను వానిని మొదటి దండనాయకునిఁగాను నేర్పఱిచి, వారిని నవాబు కర్ణాటవిజయయాత్రకుఁ బంపెను ఈ దండయాత్రలో విజయశ్రీ గైకొని వచ్చినందునకు మెచ్చి, నవాబు శహాజికిఁ గర్ణాటకములోని కోలారు, బంగలూరు, బారాకోట, బాలాపూరు, శిరకట మను ప్రాంతములు జాగీరుగా నిచ్చెను అటుపిమ్మట శహాజి జన్మమంతయు నీరాజుల కొలువులోనే యుండెను.

ఇట్లిరువది సంవత్సరంబులవఱకును రారాజులైన ఢిల్లీశ్వరులతో ఘోరముగాఁ బోరాడి నైజాముశాహి పడకుండ నిలుపుటకై యమితప్రయత్నము చేసి, బీజాపురరాజులచే నప్రతిమ గౌరవము చెందిన శూరాగ్రేసరుండు చరిత్రనాయకుండగు శివాజికి జనకుండు అలగాప్యం దరుయొక్క విశ్వవిఖ్యాతయైన కీర్తికి సతవితంద్రి యైన పిలిపరాజు యొక్క పూర్వప్రయత్నంబు లెట్లు సోపానప్రాయంబు లయ్యెనో యటులనే శివాజియొక్క స్వరాజ్యస్థాపనంబునకు శహాజియొక్క శౌర్యంబును నతఁడు సంపాదించిన జాగీరులును మూలాధారంబు లయ్యెను

# రెండవ ప్రకరణము

## శివాజిజన్మమును, బాల్యదశయు

శహాజీమహారాజుయొక్క యుద్యోగసంబంధమైన రమ్యచరిత్ర క్రిందటిప్రకరణములో వర్ణింపఁబడినది కాని శహాజియొక్క కుటుంబ సంబంధమైన చరిత్ర యంత రమ్యమైనది కాదు. క్రీ శ 1614 వ సంవత్సరములో శహాజీ జిజాబాయిలకు బహుడంబముతో వివాహము జరిగెనని వెనుక వ్రాసియుంటిమి, కాని యీ వివాహబంధనము వధూవరు లిరువురకును సౌఖ్యప్రదంబుగా దయ్యె. దంపతులకు స్నేహంబు గలుగుటకు మాఱుగా వైరంబు గలిగె ఈ వైరమునకుఁ గారణ మేమో చరిత్రకారులు స్పష్టముగా వ్రాయలేదు ఐన నిందులకు జిజాబాయి యొక్క స్వాభిమాన (Self–Respect) ప్రధానం బయిన స్వభావంబే కారణంబయి యుండు నని కొందఱు చరిత్రకారులు వ్రాసియున్నారు గొప్పవంశంబునఁ బుట్టినదియై నందునఁ దన్ను నొకరనుమాటలామె సహింప దయ్యె శహాజి తురుష్కులయొద్ద నుద్యోగము చేయుచు వారిని భూషించుచుండెను జిజాబాయియో తురుష్కులను సదా ద్వేషించుచుండెను. ఇట్లీదంపతులకుఁ బరస్పరవిరుద్ధము లయిన స్వభావములు గలిగియుండి నందున వారి యంతఃకరణములు కలియవయ్యె ఇట్లువారి మనస్తాపంబు దినదినంబు వృద్ధియైనందున క్రీ శ 1630 వ సంవత్సరమున శహాజీ తుకాబాయి యను రెండవస్త్రీని వివాహమాడెను, శహాజీ చేసికొనిన యీ పునర్వివాహమువలన జిజాబాయి మరింత యలిగి తన పుట్టినింటి బంధువులయొద్దకుఁ బోయెను ఇట్లీసతీపతులకు వియోగము సంభవించుటకుఁ బూర్వమే వారి కిరువురు పుత్రులు గలిగిరి పెద్దకుమారునిపేరు శంబాజి తండ్రికి నీ పుత్రునియం దత్యంతప్రేమ యున్నందున నతఁ డెప్పుడును దండ్రియొద్దనే యుండెను.

శహాజిమహారాజుయొక్క రెండవకుమారుఁడు మహారాష్ట్రరాజ్య సంస్థాపకుండును, మనకథానాయకుండును, నగు శ్రీ శివాజిమహారాజు. ఈ మహాపురుషుని జన్మంబు శివనేరీ యను పర్వతదుర్గమునందు క్రీ. శ. 1627 వ సంవత్సరమున నయ్యెను ఈ సంవత్సరరాజంబు హిందూదేశ చరిత్రమునందు సువర్ణాక్షరంబులతో వ్రాసి యుంచునంత యోగ్యతగలది యని చెప్పుటకు సందేహముగలదా? శివాజిమహారాజు ముందు చూపిన యపరిమిత పరాక్రమముయొక్క శుభసూచన లేమియు నతని జన్మ కాలమున దృగ్గోచరము కావు. ఇందులకు విరుద్ధముగా నతనిజన్మ కాలమందేమి శైశవదశయందేమి యతనిని నిరుత్సాహకరంబు లగు నిబ్బందులే చుట్టుకొని యుండెను తల్లిదండ్రులకు సానుకూల్యము లేక పోవుటయె మొదటి యిబ్బంది. ఇదియుఁగాక యప్పుడు శహాజిమహారాజు మొగలులతో యుద్ధము చేయుచుండెను శివాజీకిమాతామహుం డగు జాధవరావు మొగలులవైపున నున్నందున నతనికిని, శహాజీకిని, ఘోర మైన వైరంబుసంభవించె. ఇట్లు మాతామహునికిని దండ్రికిని వైరంబు గలుగుట రెండవయిబ్బంది తండ్రిమొగలులతో యుద్ధముచేయునపుడు పిబాలుఁడును, నతనితల్లియు ననేకపర్యాయములు శత్రువులచేతఁ జిక్కువారైరి కాని యాసమయములయందు, వీరపత్నియు వీరమాతయు నగు జిజాబాయియొక్క బుద్ధిప్రభావంబుచే నాబాలుఁడు సంరక్షింపఁబడియె. నేఁడు కొండాణాదుర్గములో నుండిన రేపు శివనేరుకోటలో నెల్లుండి కొంకణదేశములోని మహోలికిల్లాలోను నుండి యల్పకాలములో స్థలాం తరంబులు చేయుచు, మగఁడొల్లయాసాధ్వి ముందు శకకర్త గానున్న తనకుమారుని సంరక్షించెను ఇట్లు మహాదక్షతతో సంరక్షించు చున్నను, క్రీ. శ 1633 వ సంవత్సరమున జిజాబాయి తనయాతేండ్ల కుమారునితో వైజాపురంబున నుండ నక్కడి దుర్గాధిపతికి లంచమిచ్చి, మోసముచేసి మొగలులు జిజాబాయిని ముందు మొగలులగండఁడు గానున్న బాల శివాజిని జెఱఁబట్టిరి కాని మొగలులసైన్యములో నున్న కొందఱు మరాఠాసరదారులు మధ్యస్థులయి, "శహాజి రెండవపెండ్లి చేసికొని జిజాబాయిని వదలివేసినందున నీమెను నీమెపుత్రునిఁ జెఱఁ

బట్టుట న్యాయమా కా" దని చెప్పి యా మెను విడిపించిరి. ఇట్లు కుటుంబకలహములవలనను, శహాజికిని మొగలులకును యుద్ధము జరగు చున్నందువలనను బదిసంవత్సరముల వయసుగలవాఁ డగువఱకు శివాజి తన తండ్రిని జూడఁ గలుగఁ బోయెను విజాపూరునవాబును మొగలులతో సంధి చేసికొనినపిదప క్రీ శ 1 63 వ సంవత్సరమునందు శహాజి విజాపురమునకు నుద్యోగార్థము వచ్చినప్పుడు నాతఁడు తన పెద్ద భార్యయగు జిజాబాయిని గుమారుఁ డగు శివాజిని దనయొద్దకుఁ బిలిపించుకొనెను శహాజి క్రీ. శ 163 వ సంవత్సరమున సయీబాయీ యనిన పిల్లను దెచ్చి శివాజికి వివాహము చేసెను

ప్రప్రథమమందు శివాజికిఁ దురకలయందు ద్వేషము గలుగుటకుఁ గారణము, మొగలుల యుదముచలన నాతనికి, నాతనితల్లికిఁ గలిగిన యపరిమితకష్టమే ఇట్లతనిమనంబునఁ జిన్నతనములోనే యవనద్వేష మంకురింప దానిని వృద్ధిపఱిచినది యతని తల్లి యగు జిజాబాయి చిన్నప్పటినుండియుఁ దల్లియొద్దనే యున్నందున శివాజికిఁ దల్లిచన వధికముగా నుండెను. ఆమె యతనికిఁ దమపూర్వులపరాక్రమచరిత్రంబులును, వైభవ కథలను జెప్పి ధైర్యోత్సాహంబులు గలుగఁజేయుచుండెను. "యవనులు మనదేశ మంతయు నాక్రమించి యున్నారు. ధర్మమును బాడుచేసినారు. దేవాలయములఁ బడఁగొట్టుచున్నారు. గోబ్రాహ్మణసంహారము విధివిరుగడ లేకుండఁ జేయుచున్నారు ఇట్టి దుష్టులభీతిచేతనే కదా మన మీ కష్టముల ననుభవించుచున్నాము వీరి నోడించు శకకర్త మనకులంబున నుద్భవింపనున్నాఁ డని యనేకదృష్టాంతము లదివఱ కయియున్నవి ఆ మహాపురుషుఁ డెప్పుడు జన్మించునో! మన మెప్పుడు సుఖముగ నుందుమో †" ఇట్లనేకపర్యాయములు దనకుమారునకు బోధించి యామె, శౌర్యము, ధైర్యము, యవనద్వేషము, స్వదేశస్వమతాభిమానంబు లను గుణంబు లాతనికి నుగ్గుపాలతోఁ గఱపెను శివాజిబాలుఁడగా నున్నప్పుడును, విజాపురరాజులతోఁ బోరాడునప్పుడును, ఢిల్లీశ్వరునియొద్దకుఁ

† చిపళూనుకరకృత మైనమహారాష్ట్రుల చరిత్రము—అభ్యుదయము

బోవునప్పుడు, నావీరమాత యావీరున కిట్టియుపదేశమే చేసెను. "భర్త యనుమతి లేక యుండినను జిజాబాయి తనకొమారుం డగు శివాజీ యొక్క తెలివితేటలకు కానందించుచు, నతనికి స్వదేశస్వమతములయందలి యభిమానమును వృద్ధిజేయు చుండెను. ఆమె భర్త తురుష్కప్రభువుల యొద్ద సరదారుగా నుండినను నామె కా మ్లేచ్ఛప్రభుత్వమునం దధికద్వే షము కలిగియుండెను. ఆమె సద్బోధవలననే శివాజి మిగుల శూరుండయి తమదేశమునందలి తురకప్రభుత్వమును రూపుమాపి మరాఠీరాజ్యమును స్థాపించెను. ఆయన చేసిన పరాక్రమమున కంతకును జిజాబాయియే మూల మనుటకు సందియము లేదని న్యాయమూర్తులగు మహాదేవ గోవింద రానడేగారు వ్రాసి యున్నారు. శివాజి తా సేవనని జేసినను దల్లి యనుజ్ఞ వడయక చేసెడివాఁడు కాఁడు. మ్లేచ్ఛులతో వైరముచేయుట యతని తండ్రి కెంతమాత్రమును సమ్మతిలేదు. కని తల్లిసహాయమువలన నతఁడు మిగుల విఖ్యాతిఁగాంచెను. జిజాబాయి తానేమిమహాకార్యము చేయఁ జాలకున్నను దనకుంగల స్వదేశస్వమతాభిమానములను గొడుకునకు బోధించి తనకుఁగల యుద్దేశముల నన్నియు నెఱవేఱఁజేసెను †" ఇట్లు తల్లి పవిత్రోపదేశంబువలనఁ గుమారుఁడు రాజ్యసంస్థాపకుం డయి ఘన తను వహించిన యుదాహరణ మిది యొకటి తప్ప వేఱొకటి మఱి యేదేశ చరిత్రమునందును గానిపించుట దుర్లభం బని నాయభిప్రాయము. తల్లుల గుణావగుణముల ననుసరించి పిల్లల గుణావగుణము లుండును గాన మనసంఘమునందలి స్త్రీల దుస్థితిఁ సంస్కరింపవలయు నని ప్రతిపాదిం చెడి నవనాగరకవీరులకు నీశివాజి జిజాబాయుల చరిత యొకయత్యంతోప యోగకరం బగుశస్త్రంబే యని చెప్పవలయును.

శివాజికిఁ జిన్ననాఁటినుండియు శౌర్యోత్సాహంబులు వృద్ధియగు టకు రెండవకారణము పురాణశ్రవణము. అయిదాఱు సంవత్సరముల

---

† అస్మజ్జ్యేష్ఠసహోదరి యగు సౌ॥ భండారు అచ్చమాంబగారిచే రచి యింపఁబడిన "అబలాసచ్చరిత్రరత్నమాల — ప్రథమభాగము

వయసువాఁ డయినప్పటికిని మరియు భారతరామాయణములలోని కథల నాతఁడు మిక్కిలి శ్రద్ధతో వినుచుండెను ఋషులను బాధపెట్టు రాక్షసులను రాముఁడు వధించినకథయు, భీమార్జునాదు లచ్యుతపరాక్రమముఁ జూపి కర్ణ దుర్యోధన దుశ్శాసనాదుల వధించినప్రకారంబును వినునప్పుడు బాల శివాజి శరీర ముప్పొంగి, గోబ్రాహ్మణనాశ మొనరించు యవనులఁ బాఱు వటులనే సంహరింపవలయు ననెడు సూచన లాతని మనస్సునం దుద్భవింపఁ దొడఁగెను శివాజి యిచ్చట గ్రంథములు కేవలము భారతరామాయణములలోని యుద్ధప్రకరణములను వినుటయందే కుతుకముండె నఁట

ఇట్లు క్రీ. శ. 16 వ సంవత్సరమున శివాజి, తండ్రి యొద్దకు వచ్చినప్పు డాతనిచిత్తం బంతయు యవనద్వేషముచే నిండియుండెను అతనితండ్రి యగు శహాజి చిన్ననాఁటనుండియు యవనుల సేవలోనే యుండి గొప్పయుద్యోగములు చేసి జహాగీరు సంపాదించినవాఁ డగుటం దున నాతఁడు తనకుమారుని రాజద్వేషమున కెంతయుఁ జింతిల్లుచుండె ఒకనాఁడు తనకుమారునిఁ బిలిచి యతఁడు "నాయనా! నీవు పదపండ్రెండు సంవత్సరములవాఁడ వయితివి ఇఁక దినదినము నావెంట నవాబుపేరోలగమునకు (దరబారునకు) వచ్చి నవాబునకు సలాము చేసి తిన్నతిన్నఁగా నతనియనుగ్రహము సంపాదించిన నీకు మేలు కలుగఁగల"దని యుపదేశించెను అందునకు శివాజి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను — "యవను లత్యంతనీచులు, వారి నాశ్రయించుటకును వారికి సలాముచేయుటకును నాకెంతమాత్ర మిష్టము లేదు రాజవీధులలో జరుగుచున్న గోవులవధఁ జూచి వధచేయుయవనులను వెంటనే చంపవలయు ననిన యిచ్చ నాకుఁ గలుగును గాని యటులఁ జేసిన మీ రేమందురో యనినభీతిచేతఁ గోపము నచటనే యడఁచుచున్నాఁడను గొప్పగొప్ప తురకయధికారులయింటికిఁ బోయి వారి నాశ్రయింప నే నొల్ల ఒకనొకప్పుడు యవనస్పర్శ సంభవించెనేని నే నావస్త్రములఁ బరిత్యజించెదను."

ఈవచనంబులు విని శహాజి మిగుల నచ్చెరువొంది పుత్రునితో నిట్లనియె.— "నీవు చెప్పినమాట లన్నియు సత్యంబులే. కాని ప్రస్తుతము పృథివికంతటికి యవనులు రాజు లయియున్నారు వారసేవ చేసి, మనము మనమతము రక్షించుకొనుచు నుండుటయే యీశ్వరసంకల్ప మని తోఁచుచున్నది అటులఁ గానియెడ మన స్వరాజ్య మేల పోయి యుండును? నేను మీకొఱ కత్యంతశ్రమచేసి వైభవమును సంపాదించినాఁడను నేను సంపాదించిన దానిని రక్షించుకొనుచు మీరు నవాబుదయకుఁ బాత్రు లగుటయే మీకు ధర్మము" అందుపై శివాజి యుత్సాహము లేనిముఖముతో నిట్లనియె, "మీ యాజ్ఞ శిరమున వహించుటకు సందేహములేదు. కాని గోబ్రాహ్మణపీడకు లగుయవనులను జూచుటకంటెఁ బ్రాణంబులఁ బరిత్యజించుట మేలని నాయభిప్రాయము "†

ఇట్లు తండ్రి కొడుకులకు నప్పు డప్పుడు సంభాషణ జరగుచుండ నొకనాఁడు బలవంతముగా శహాజి, శివాజిని నవాబు పేరోలగమునకుఁ బంపెను అంతకంటెఁ బూర్వము నవాబు మంత్రియగు మురారరావు, నవాబుతో శివాజియొక్క శౌర్యాదిసుగుణసంపదను గొనియాడియుండెను. కాని శివాజి రాజసభకుఁ బోయి నవాబునకు సలాముచేయకయే దూరముగాఁ గూరుచుండెను అందుపై నవా బీతఁడేనా శహాజిరాజుకొమారుఁ డని యడుగఁగా మురారరా వితనిది చిన్నవయసు, ఇదివర కెన్నఁడును రాజసభ చూచినవాఁడు కాఁడు" అని చెప్పి యా నవాబు నెటులనో సమాధాన పఱిచెను ఇంటికిఁ బోవునప్పుడు బాలశివాజికి నవాబు వస్త్రాద్యలంకారము లిప్పించి పంపెను కాని యింటికిఁ బోయినతోడనే యావస్త్రములు తీసివేసి శివాజి సచేలస్నానము చేసెను

శివాజియొక్క యీ ప్రవర్తనయంతయుఁ జూచి మురారరావును, శహాజియు, శివాజి రాజధానియైన బిజాపురములో నుంచుట మంచిది కాదని తలఁచిరి ఇంతలో శహాజి మహారాజునకు, నవాబుయొక్క ఆజ్ఞ వలనఁ గర్ణాటకద్రవిడదేశములపై దండువెడలవలసి వచ్చెను కాన

---

† చిటనీసుకృతమైనబఖరు

నాతఁడు జిజాబాయిని, శివాజిని, శివాజిభార్యయగు సయీబాయిని దనజహాగీరులో నున్న పూనా † పట్టణమునకుఁ బంపెను. పూనా మొదలయిన జాగీరులపని చూచుటకును భార్యాపుత్రాదులను గాపాడుటకును శివాజి వెంట శహాజి దాదోజికొండదేవుఁ డనుబ్రాహ్మణుఁడగు గుమాస్తానొకని బంపెను. తనవెంటఁ బెద్దకొమారుఁడగు సంభాజిని చిన్నభార్యయగు తుకాబాయినిఁదీసికొని శహాజి క్రీ. శ ౧౬౩౭ వ సంవత్సరములోఁ గర్ణాటకమునకుఁబోయెను. అక్కడఁ బరాక్రమముచేఁ బ్రసిద్ధి చెంది యందున నవాబతనికి నచ్చుటనే కొన్ని జాగీరు లిచ్చెనని వెనుకటిప్రకరణములో వ్రాసియుంటిని. ఈ జహగీరును జక్కఁబఱచుచుఁ, జిన్నచిన్న సంస్థానముల జయించుచు శహాజి మరలిరాక ద్రవిడకర్ణాటక దేశములలోనే యుండ నిశ్చయించెను. తంజావూరు (Tanjore) సంస్థానాధిపుఁ డగు విజయరాఘవుని గెలిచి శహాజి యాగ్రామమే తనకు రాజధానిగా నేర్పరుచుకొనెను. ఇంతలో నతనికి ద్వితీయభార్య యగు తుకాబాయివలన వెంకోజీ యనుపుత్రుఁడు గలిగెను. ఆపుత్రునియందు విశేష మమత గలవాఁడయి, యతనికిఁ దంజావూరురాజ్య మీయఁదలఁచి శహాజి మహారాష్ట్రమునకుఁ దిరిగి వచ్చుట మాని పూనాజాగీరు పని దాదోజికొండదేవుఁడు చూచునట్లును, వచ్చిన పైకముతో జిజాబాయి శివాజి మొదలయినవారిఖర్చు జరుపునట్లును, మిగిలినపైకము తనకుఁ బంపునట్లును నేర్పాటు చేసెను.

ఇట్లు తండ్రిచేఁ బూర్ణముగా విడువఁబడిన శివాజిని దాదోజికొండదేవుఁడు తండ్రికంటె నధికప్రేమతోఁ బెంచెను. జిజాబాయి యుపదేశమువలన యవనుల జయించు నిచ్ఛ శివాజికిఁ గలిగినటుల నతనికి యవనుల

---

† ఇంగ్లీషువారు "పూనా" యనియు, నాంధ్రులు "పునహా" యనియు వాడుకొనుపట్టణముయొక్క నిజమయిన మహారాష్ట్రనామము "పుణే." ఇప్పటికి మరాటీవారిచే నీపేరే వాడఁబడును.

జయించు సామర్థ్య మీ దాదోజికొండ దేవుని యొక్క సుశిక్షవలననే కలిగిన దనుటకు సందేహము లేదు ఈయన యనేక సంవత్సరముల నుండి శహాజియొద్ద రాజకీయోద్యోగములో నున్న బ్రాహ్మణశూరుఁడు. ముత్సద్దీపనిలో నితనితో సమాను లాకాలమున నెవ్వరును లేకుండి రనుటకు సందేహము లేదు పూనా జాగీ రీతనిచేతికి వచ్చువఱకు బహుదుర్దశలో నుండెను దొంగలవలనను తోఁడేళ్ళవలనను లోకులు బహుబాధితులయి జాగీరు వదలి పాఱిపోయిరి దాదోజి లోకులకు బహుమానము లిచ్చి తోఁడేళ్ళ నన్నిటిని జంపించి యుగ్రశాసనమున దొంగల రూపుమాపి కొంచెపాటిశిస్తులకుఁ బొలములు రయితుల కిచ్చి జాగీ రంతయు శీఘ్రకాలములోనే పొందుపఱిచెను ఇట్లు రాజ్యకార్యనిపుణుఁడగు దాదోజి కొండదేవుఁడు పదిసంవత్సరములలోఁ జాలధనము మిగిలిచి, యనేకభటులను దనసేవకులుగా నేర్పరించి, పడిపోయిన కోట లెన్నియో మరలఁ గట్టించి, శత్రుభీతి లేకుండ జాగీరును రక్షించు చుండెను బ్రాహ్మణక్షత్రియ కార్యములందుఁ బ్రవీణుఁ డగునీబ్రాహ్మణుఁడు శివాజికి నావశ్యకములయిన సకలవిద్యలు నేర్పెను శివాజికి నక్షరజ్ఞానము లేకుండెననియు, నతఁడు దస్కతుఁగూడఁ జేయలేకుండెననియుఁ గొందరింగ్లీషు చరిత్రకారులు వ్రాసియున్నారు। ఇందుకు విరుద్ధముగ మహారాష్ట్ర గ్రంథకారులు కొందఱు శివాజి సకలశాస్త్రములందును సకలకళలయందును బ్రవీణుఁడని వ్రాసిరి। ఈ రెండు సంగతులను నతిశయోక్తులని నా యభిప్రాయము. శివాజి దాదోజివంటి ముత్సద్దీయొద్ద నున్నందునను నతఁడు దనతమ్ముఁడును దంజావూరురాజును నగు వెంకోజికి వ్రాసిన యుత్తరమువలనను నతనికి మాతృభాష వ్రాసి చదువునంతజ్ఞాన ముండెననుటకు సందేహములేదు ఆకాలమున మరాటావారి పిల్లవాండ్ర కింతకంటె నధికవిద్యతోఁ బనియు లేక యుండెను యుద్ధముచేయుట వారి పనిగాని గుమస్తాలవలె జాబితాలు వ్రాయుట వారిపని కాదు. అందుచే నితరవిద్యలకంటె ధనుర్విద్యయందే వారి కత్యాదర ముండెను కాన దాదోజి కొండదేవుఁడు శివాజికి ముఖ్యముగా గుఱ్ఱముపై నెక్కి సవారు

చేయుట, ఖడ్గముతో సాముచేయుట, గుఱ్ఱముపై నుండి బల్లెముతోఁ బోరాడుట, మొదలయిన యుద్ధవిద్యలన్నియు నేర్పెను తరువాత జమాబంది చేయుపద్ధతి న్యాయవిచారణ చేయు పని, తమకుఁ బ్రతికూలముగా నుండుసంగతుల సన్నివేశ యుక్తిచేఁ దమకు ననుకూలము లగునట్లు మార్చుకొను నుపాయము, మొదలయిన లౌకిక వ్యవహారము లన్నియు నేర్పెను ఇట్లు క్రొత్తరాజ్యమును సంపాదించుట కావశ్యక మైనవిద్యలును, రాజ్యము సంపాదించిన తరువాత దానిని స్థిరపఱచుట కావశ్యకమైన విద్యలును నారాచకొమరుఁడు సంపాదించెను

దాదోజికొండదేవుఁ డీవిద్య లన్నియు శివాజికి నేర్పునప్పుడాతఁడు తురకలతోఁ బోరాడవలయు నని నేర్పినవాఁడు కాఁడు మరాఠావారి పిల్లల కీవిద్య లావశ్యకము లనియు, శివాజి పెద్దవాఁడయి శహాజీవలెనే తురకరాజుల మెప్పించి జాగీరులు పొందవలయు ననియే నేర్పెను శివాజి పెద్దవాఁ డయిన కొలఁది దాదోజి యతనిని జాగీరుపనిలోనికిఁ జొరఁబెట్టఁ దొడఁగె జమాబందీపద్ధతి బాగుగ తెలియవలయునని యతనిని వెంటఁబెట్టుకొని ప్రతిగ్రామమునకుఁ బోవుచుండెను కాని చిన్న జాగీరు రక్షించుకొనుచుఁ గూర్చుండుటకంటె గొప్పదియగు స్వరాజ్య సంస్థాపనం బను వేరొక మహాకార్యంబు చేయవలయు నని నిశ్చయించిన వాఁడగుటచే శివాజి జాగీరుపనియం దంత లక్ష్యముంచక యుద్దిష్టమహాకార్య మెట్లు నెఱవేఱునా యని యోచించుచుండెను దాదోజి చేతిక్రిందఁ బని చేయుచున్న కొందఱు ముత్సద్దీలకుఁ దనయాలోచన తెలిపి వారిని దన కనుకూలముగాఁ జేసికొనెను వారును నవయౌవనములో నున్నందున శివాజియొక్క సాహసకార్యము వారికి సమ్మతింబయ్యెను

ఇట్లు శివాజి తురకలతోఁ బోరాడి స్వరాజ్యము స్థాపింపఁబ్రయత్నము చేయుచున్నందుల కెంతయో చింతిల్లి దాదోజి యొకనాఁడు శివాజిని దనయొద్దకుఁ బిలిచి యిట్లు బోధించెను — "మీరు స్వరాజ్యము స్థాపించుటకుఁ జేయుచున్న యత్న మత్యంతస్తుత్య మనుటకు సందేహములేదు కాని ప్రస్తుతకాల మిందుల కనుకూలముగాలేదు పృథ్వి యంతయు యవ

మేలు జయించినారు. కోటలు సైన్యములు మొదలయిన నన్నియు వారికి స్వాధీనములై యున్నవి. హిందూరాజులుగూడ వారికే సహాయులుగా నున్నారు మీరారంభించినపనికి హిందూరాజులందఱు సహాయముగా నుండి, హిందూ సైన్యము అంతటను వ్యాపించియుండవలయును ఈశ్వరానుకూలతయు సిద్ధుల యాశీర్వాదములును గావలయును కాని ప్రస్తుతము కాలదేశవర్తమానములును అననుకూలముగా నున్నందున మీరారంభించిన పని నాకు సమ్మతముకాదు. దీనిపర్యవసానము శుభప్రదము కాఁజాలదు మీతండ్రిగారు మహాపరిశ్రమచేసి ధనమును కీర్తియు సంపాదించినారు దానిని బోఁగొట్టి లోకనింద పడయవలదని నాయభిప్రాయము "

ఇట్లుపదేశించినందువలన నతనితో "మీ యనుజ్ఞప్రకారమే వర్తించెదను" అని చెప్పి శివాజి యతనికిఁ దెలియకుండఁ దన కార్యసిద్ధి కొఱకు సాధనంబులు సేకరించుచుండెను

# మూఁడవ ప్రకరణము



## యుద్ధసన్నాహము—ప్రథమపరాక్రమము

తురుష్కరాజుల నోడించి స్వతంత్రరాజ్యము స్థాపింపవలయునని నిశ్చయించి, శివాజి యందులకుఁ దగిన యత్నంబును జేయఁదొడఁగె నని రెండవప్రకరణమునందు వ్రాసియుంటిమి. తనమహోద్దేశము సాధించుటకై యతఁడు చేసిన మొదటిపని కొండలలో స్వయముగాఁ దిరిగి యాపర్వత ప్రదేశము లన్నిటిని బూర్ణముగా నెఱుఁగుట వీలయినప్పుడు శత్రువులపై నొక్కసారి పడి వారిని జెల్లాచెదరుచేయుటకును, వీలు లేనప్పు డెవరికిఁ దెలియకుండ దాఁగి యుండి స్వరక్షణము చేసికొని సురక్షితముగా నుండుటకును, క్షణములో శత్రువులకు నెదుటఁ బ్రత్యక్షమై, మెఱుపువలె క్షణములో నదృశ్యమగుటకును బర్వతప్రదేశంబు లత్యంతసాహాయ్యకరంబు లని తనచిన్ననాఁటియనుభవమువలన నెఱింగినవాఁడు గాన, శివాజి కొంకణము, మావళా, యనుప్రదేశములలోని భయంకరమైన కొండలలో నెల్లప్పుడుఁ దిరుగుచు, నచ్చటిగుట్టలు, గుహలు, గుప్తమార్గములు, జలాశయములు దుర్గనిర్మాణయోగ్యస్థలంబులు మొదలయిన వాని కన్నింటికిని దృఢపరిచితుఁ డయ్యెను

స్వకార్యసిద్ధికొఱ కయి శివాజి యవలంబించిన రెండవ మార్గము కొండతావులలోనున్న లోకులతో స్నేహముచేయుట. మావళా యను ప్రాంతము శివాజియొక్క జాగిరులోనిది అది పర్వతప్రదేశము అచ్చటి మావళే యనఁబడు జనులు కడుబీదలు దినమంతయుఁ బాటుపడినఁగాని వారికిఁ దినుటకు నొక జొన్నరొట్టె దొరకక యుండెను. వారి మేనికొక గోఁచి తప్ప మఱియేమియు వస్త్రముండదు ఇట్లు వారు చూచుటకు కడు బీదలుగను మూర్ఖులుగను నుండినను దీర్ఘకాయులుగను, ఆజానుబాహులు

గను, అమితబలవంతులుగను నుండిరి. ఇంతియకాదు. అనుపమ స్వామిభక్తి యను సద్గుణరత్నంబుచే నాజాతియంతయు విభూషితంబై యుండె తమకుఁ గట్టుకొనుటకయి యొకకౌపీనమును నోటఁబెట్టుకొనుట కొకరొట్టెయను ఇచ్చిన ఎవికొఱకు వారు ప్రాణముల నైన నిత్తురు. చూచుటకుఁ బిచ్చువారివలె నుండినను నెన్నికష్టములకైన నోర్చి భగీరథ ప్రయత్నము చేసి స్వామికార్యము నెట్టులైన సాధించునట్టి యద్భుతప్రజ్ఞ యీ మావళే యనఁబడు అరచెంచుల కుండెను వీరు కొండలలో నుండువా రగుటచే నచ్చటిత్రోవ లన్నియు వారికిఁ గరతలామలకము లయియుండెను అరణ్యప్రదేశములలో నుండువా రగుటచే హింస్రపశువులవలనఁ దమకు హాని కలుగకుండ వారు పవిధప్రకారంబు లయినధనుర్విద్య లభ్యసించి యుండిరి. ఏవంగుణవిశిష్టు లయినమావళేవాండ్రు తనకు సమకూలు రయినఁ దనకార్యంబు సులభంబుగా సిద్ధించునని యెఱింగినవాఁ డయి శివాజి యాపర్వతవాసులతో మైత్రి చేసెను. వారి యొద్దనుండి రావలసిన పన్నులు వదలివేసియు, వాండ్రకు నన్నవస్త్రంబు లిచ్చి సంరక్షించియుఁ గొందఅను జాగీరులోని యుద్యోగములలో నియమించియుఁ దాను నెల్లప్పుడును వారిలోఁ గలసి మెలసి యుండియు వివిధోపాయములచే శివాజి మావళేవారి యంతఃకరణములను వశపఱుచుకొనెను వారికి శస్త్రాస్త్రంబు నొసఁగి వ్యూహక్రమంబుల నెఱింగించి యుద్ధపద్ధతుల నన్నింటిని గఱపి సంగరయోగ్యులఁ జేసెను ఇట్లు శివాజీకిఁ దోడ్పడిన మావళేవారికి నధిపతులును దేశముఖులును అయిన ముగ్గురుమహారథులు ప్రారంభమునుండి శివాజీకిఁ గుడిభుజములుగా నుండిరి వా రెవ్వ రనిన,—

1 తానాజీమాలసురే — ఈ మావళేవీరుని నామము మహారాష్ట్రదేశపు చరిత్రములలో నేమి చరిత్రగీతములలో నేమి (Ballads) యజరామరమై యున్నది ఇతఁడును, ఇతని తమ్ముఁడగు సూర్యాజియు శివాజి మహారాజునకు బహిఃప్రాణము లయియుండిరి ఈ వీరుఁడు తనప్రాణముల సమర్పించి వాజికి సింహగడ మనుపర్వతదుర్గము సాధించి యిచ్చెను

2 ఏసాజీకంక్. ఈతఁడు మావళేపాదాతము యొక్క ముఖ్య సేనాని శివాజియొక్క ప్రథమవిజయములలో నితని శౌర్యసాహసములే మిక్కిలి యక్కఱకు వచ్చెను అఫజుల్ ఖానుని వధసమయమునను, షాహిస్తేఖానుని భంగపఱిచినపుడును నితఁడు శివాజికిఁ దోడుగా నుండెను ఇతఁడును తానాజియు శివాజివెంట దిల్లీకి వెళ్ళియుండిరి

3. బాజీసల్కార్ —పై నుదహరించిన యుద్ధము నూరులవలెనే యీతఁడు శివాజిసేవలోనుండి ప్రాణసమర్పణమునకైన వెనుదివియక స్వామికార్యముల నిర్వహించుచుండెను కొంకణప్రాంతములో యుద్ధము చేయుచు నీతఁడు కీర్తిశేషుఁడయ్యెను

ఈముువ్వురు మావళేవీరులు శివాజియొక్క ప్రథమపరిచితులు ప్రాణస్నేహితులు వీరుగాక శివాజికి సాయముచేసిన మావళే మహారథు లనేకులుండిరి వారిలో ముఖ్యులీక్రింద వర్ణింపఁబడినవారు

నేతాజీపాల్కార్,—ఈతఁ డశ్వసైనికులకు నధిపతియైయుండెను ఇనపేరిట రెండు శతాబ్దములవఱకు దేశంబులనన్నింటి గజగజవడఁకఁ జేసిన మరాటాగుఱ్ఱమునకు నీతఁడు కూటస్థుఁడని చెప్పవచ్చును ఇతఁ డసామాన్యసాహసము కలవాఁడయి అహమదనగరము వఱకును అవ రంగాబాదు వఱకును దండు వెడలుచుండెను ఎక్కడఁజూచిన దానెయై రాజ్యమునకువచ్చు నాపద లన్నింటిని నిర్భయముగా నెదుర్కొను చుండెను

ప్రతాపరావుగుజర్ —ఈతఁడు గుఱ్ఱపు రౌతులకు మఱియొక మొనగాఁడుగా నుండెను శివాజి కితనియం దత్యంత విశ్వాసము కలిగి యుండెను ఈతఁడు మోగలుల సైన్యమును బీజాపూరుసైన్యము నోడించెను డిల్లీబాదషాకును శివాజికిని సంధి గలిగిన రెండు సంవత్సరము లీయన ఔరంగబాదులో సైన్యసమేతుఁడై యుండెను ఒకసారి బీజాపూరు సైన్యములను నీతఁడు తగినరీతిని వెంబడింపనందున నీతనిపై శివాజికిఁ గొంచెము కోపమువచ్చెను కాని యాకోపమును దీసివేసి మరల శివాజి యనుగ్రహమును సంపాదింపవలయునని తలఁచి యీతఁడు మఱియొక

సారి తురకసైన్యము నోడించి యా యుద్ధమునందు దాసను గూలి జయ మును సంపాదించెను. ఆహా! ఇట్టిసేవకు లుండినందునఁ గదా శివాజీ స్వరాజ్యమును స్థాపింపఁగల్గుట!

ఇట్లు శివాజియొక్క క్షాత్రతేజము స్వదేశస్వమతాభిమానములు సాహసము మొదలయిన సద్గుణములఁ జూచి యనేక మహారాష్ట్రవీరు లీతని చుట్టుఁబోగైరి. శివాజియొక్క స్వాభావికమధుర సంభాషణకు వశులై యీ శూరు లందఱును నతనితో స్వదేశమునకై ప్రాణములను గూడ నర్పించెదమని కృతనిశ్చయులై కార్యమునకుఁ బ్రారంభించిరి

స్వరాజ్యము స్థాపించునిమిత్తమై ప్రప్రథమునఁ గొన్ని పర్వతదుర్గ ములను స్వాధీనపఱుచుకొనినఁగాని మనమందఱము సురక్షితులమై స్వకా ర్యము నిర్వహింపఁజాల మని వారందఱు నిశ్చయించిరి ఏల యన నిది వఱకు రాజ్యము చేయుచున్న నవాబుల ప్రచండసైన్యములతో రణరంగ మునందు హోరాహోరిగాఁ బోరాడునంతశక్తి తమకుఁ బ్రారంభముననే గలుగుట యసంభవ మనియుఁ గొన్ని దినములవఱకును దా మిష్టము వచ్చినప్పుడు వీరి యిష్టములేనపుడు దాఁగియుండుటకుఁ బర్వతదుర్గము లుండుట యావశ్యక మనియు నావీరు లందఱకుఁ దెలిసి యుండెను. ఇట్లు యోజించి వారు ప్రథమమందు తోరణాయను దుర్గమును సాధింపఁ దలంచిరి శివాజి తోరణాకిల్లాపైకి దండెత్తి పోయి కొంతభయము చూపియుఁ గొంత యాశచూపియు నాదుర్గాధిపతిని వశపఱుచుకొని దుర్గము నాక్రమించుకొనెను ఇట్లు క్రీ శ ౧౬౪౬ వ సంవత్సరమున ననఁగా శివాజి పందొమ్మిది సంవత్సరములవాఁ డయియుండఁగా నతఁడు తోరణా యనుదుర్గమును సంపాదించి తాను ముందు స్థాపించునట్టి స్వరాజ్యము నకుఁ దోరణము గట్టెను.

తోరణాకిల్లా బీజాపూరు (విజాపురము) సంస్థానముకోవిది. అందు వలన బీజాపూరు నవాబు కోపించి తనమీఁదికిఁ బెద్దసైన్యము పంపునేమో యనియు వారినందఱిని మొట్టమొదటనే యెదిరించుట దుర్లభమనియుఁ దలఁచి శివాజీ బీజాపూరు నవాబున కిట్లు వర్తమాన మంపెను. "తోర

ణాకిలా నేను దీసికొనుట మీకొఱకె ఇంతకుఁ బూర్వ మున్న కిల్లేదారు (దుర్గాధిపతు లందఱును రావలసిన పైకమేమియు దేవరవారికిఁ జెల్లించనవారు కారు ఈ దుర్గము మాచేతిలోనే యుంచిన యెడల మేము పూర్వపుదుర్గాధిపతులకంటె నధికధనము చెల్లించెదము ఇదియుఁ గాక యీ దుర్గప్రాంత మొకమూల నున్నందున నిట్టిచోట మావంటి విశ్వాసస్థులైన సేవకు లుండుట మీకు మేలు" ఇట్లు సులతానునకుఁ దియ్యని మాటలతో వార్తనంపి తాను స్వాధీనపరచుకొనిన తోరణాదుర్గము పరులకభేద్యమగునటుల దృఢముగాఁ గట్టించి సైన్యమును వృద్ధిపఱుపసాగెను కోటపని జరుగుచున్నప్పుడొక ప్రాంతగోడసందున శివాజికి నమితధనసంచయము దొరకెను. తాను ప్రారంభించిన మహాకార్యమునకు మెచ్చి తన కులస్వామిని యగు భవానియే యా ధన మిచ్చెనని తలఁచి శివాజి తోరణాకిల్లాకు సమీపముననే యున్న కొండపై మరియొక దుర్గము నిర్మించెను ఈ క్రొత్తదుర్గ మొక సంవత్సరములోఁ గట్టించి యది యత్యంతాభేద్య మైనందున దానికి రాజగడ మని నామమిడి దానినే తన రాజధానిని జేసికొనెను

ఇట్లు శివాజి నవీనదుర్గములను నిర్మించుచుండఁగా నీసంగతి యంతయు బీజాపూరునవాబునకుఁ దెలిసెను. కాని యీ కోటలే ముందుఁ దన రాజ్యమునకు నాశహేతువులగునని యా నవాబునకుఁ దెలియనందున నాతండు విశేషము భయపడఁడయ్యె కాని యొద్దనుండు ముసలి సరదారులు వెంటవెంట హెచ్చరిక సేయఁ దుదకాతఁడు నీవు దుర్గములను గట్టుట మానుమని శివాజి ని నీకొడుకిట్లు కోట నేల కట్టుచున్నాఁడని ద్రవిడదేశమందున్న శహాజికిని వార్తపంపెను శహాజికి నంతకుబూర్వము తనకొడుకిట్లు క్రొత్తదుర్గముల నిర్మించుచున్నాఁడన్న వార్తయే తెలియదు. కాన నవాబునొద్దనుండి వచ్చిన వార్తవిని యతనికిఁ దనకుమారునిపై గోపమువచ్చెను గాని నవాబునకుఁ గోపము రాకుండ నతఁడిట్లు వార్త పంపెను నాకుమారుఁడు నన్నడుగకయే క్రొత్తకోటలను గట్టుచున్నాడు,

అయినను నేనును వాఁడును మీ సేవకులమే నాకొడుకు చేయుచున్న పని మీరిచ్చిన జాగీరును రక్షించుకొనుటకయి కాని మఱియొక దురిచ్ఛచేఁ గాదనుటకు సందేహములేదు." ఇట్లు నవాబును సమాధానపఱిచి శహాజీ దాదోజి కొండదేవునకును శివాజికిని గోపముతో నుత్తరములు వ్రాసి కోట పని వెంటనే యాఁపివేయవలసినది యని యాజ్ఞాపించెను ఈ యుత్తరము చూచుకొని దాదోజికొండదేవుఁడు ఇన్నిరోజులు పేరు ప్రతిష్ఠలతోఁ గడచినను నిఁకమీద శివాజీవలనఁ దనకు నపకీర్తి రాఁగలదని యెంచి శివాజీని దనయొద్దకుఁ బిలిచి యిట్లనియె "నేను మొదటినుండి చెప్పుచుండినను మీరు వినకపోతిరి మీయవిచారకృతములను విని శహాజీ రాజుగారికి మిగుల కోపమువచ్చినది మీరు చేయుచున్న కృత్యమువలన మీగొప్ప కుటుంబమునకు హాని కలుగఁ గలదు మీ రీ పిచ్చిపనులను జేయక మీ తండ్రివలెనే నవాబులసేవ చేసి కీర్తినిబడయుఁడి" అందుపై శివాజి సరియేయని తలయూఁపి తాను జేయఁదలఁచిన పనుల నన్నిటిని నిరాటంకముగాఁ జేయుచుండెను ఇట్లు శివాజి తన మాటవినక కులనాశన మగు పనులనే చేయుచున్నాఁడని చూచి దాదోజికొండదేవుఁడు చింతచే క్షీణింపసాగెను కొన్నిదినములు గడచినపిదప నతఁడు మరణోన్ముఖుఁ డై నప్పుడతఁడిట్లు యోచింపసాగెను "శివాజి సామాన్యమానవుఁడుగాఁ గానిపింపఁడు అతఁడు చేయుచున్న పని మే మనుకొనినటుల వింద్య మయినది కాదు. అతని మనసు త్రిప్పుటకై నేను జేసినయత్నము లన్నియు నిష్ఫలములైనవి ఇందుచే నీతఁడు చేయుపని యీశ్వరునకు సమ్మతంబే యని యేల తలంపఁగూడదు ఇతని బుద్ధియుఁ బరాక్రమ మును జూడఁగా నితఁడు నద్వితీయుఁడని తోఁచుచున్నది. ఈ వంశమున యవనులను సంహరించు శకకర్త యొకఁడు పుట్టఁగలఁడని యొక ప్రసిద్ధి కలదు. అతఁడే యీతఁడేల కాఁగూడదు ఇట్లు చింతించి యాతఁడు మరిఒక సమయమున శివాజీనొద్దకుఁ బిలిచి జాగీరు పని యంతయు నత నికి నప్పఁజెప్పి యిట్లనియె 'నాయంత్యకాలము సమీపించినది ఇంత

వరకు మీరారంభించిన పని వలదని వివారించుచుంటిని గాని మీ బుద్ధియు బరాక్రమమును జూచి మీరాపనిని నిర్వహింపఁగల రనిన నమ్మికనాకుఁగలి గెను కాన మీరిఁకఁ బైనమమానింపక హిందూస్వరాజ్యముస్థాపింపయిత్నము చేయుఁడి. మీకు నీశ్వరుఁడు నిశ్చయముగా యశము నియ్యఁగలఁడు మీరు గోబ్రాహ్మణులను రక్షించి దేవాలయములను బాడుజేయుచున్న యవనులను సంహరింపుఁడి ఇన్ని దినములు మీ తండ్రిగారు నన్నుఁ బోషించినటుల నిఁకఁబై మీరు నాకుటుంబమును బోషింపుఁడి—ఇంతియ నా ప్రార్థన" ఇట్లుపదేశించి యావృద్ధబ్రాహ్మణుఁడు ప్రాణములు విడిచెను.

దాదోజికోండదేవుఁడు గతించిన పిదప జహగీరి సంబంధమైన సర్వస్వాతంత్ర్యంబులను శివాజీకిఁ బ్రాప్తమయ్యెను అప్పుడు వెనుకటి వసూలుబాకీ యడుగుటకయి కర్ణాటకము నుండి శహాజీయొక్క మనుష్యులు వచ్చియుండిరి కాన తాను ప్రారంభించిన మహాకార్యమునకు ధన మధికముగాఁగావలయునని యెంచి శివాజి తనతండ్రి కిట్లు వ్రాసంపెను. "వృద్ధుఁడయిన దాదోజికోండదేవుఁడు మృతుఁడయ్యెను ఇప్పుడు మీరు వసూలిమ్మనిన నేనెట్లియ్యఁగలను? ఇక్కడఁ బ్రతిదినము నాఖర్చునకే పైకము చాలకున్నది. నావ్యవహారము సిబ్బంది యభివృద్ధిమీఁద నున్నది ఇఁక మీఁదఁ గర్ణాటకములోని యాదాయమువలననే మీరు మీ వ్యవహారములను జరుపుకొనుట మంచిది

శివాజి పాలింపఁదొడఁగిన జహగీరిలో నదివఱకు శహాజిచే నియమింపఁబడిన పురాతనాధికారులు కొందఱుండిరి వారు శివాజి యనుజ్ఞనుమించఁజొచ్చిరి ఇట్లు శివాజియొక్క యాజ్ఞను నతిక్రమించిన వారలో చాకణ్ అను కిల్లాకు నధిపతియైన ఫిరంగాజీనరసాళా యనువాఁడొకఁడు వీనితోఁ బోరాట పెట్టుకొనిన యెడల నంతఃకలహములకుఁ బ్రారంభమై తన మహోద్దేశమునకు విఘ్నము కలుగునని తలఁచి శివాజి తియ్యని మాటలచే వాని వశపఱుచుకొని వాని యుద్యోగమునందే వాసించెను

శివాజికి లోఁబడని రెండవయధికారి శహాజీయొక్క ద్వితీయభార్యయైన తుకాబాయికిఁదోఁబుట్టు వగు బాజీమోహితే సుపా యనుపరగణా యితని చేతిలో నుండుట యే కాక యితనియొద్ద మూఁడువందల గుఱ్ఱపురౌతు లుండిరి. శివాజి యెన్ని సారులు పిలిపించిన నీతఁ డతనిదర్శనమునకు వెళ్ళిన వాఁడు కాఁడు. శహాజియొద్దనుండి శివాజికి నీస్వాధీనములో నున్న పరగణా యిమ్మని నాకు నాజ్ఞవచ్చినఁ గాని యీ పరగణా మీకు స్వాధీన పఱుచుటకు వీలులేదు, అని శివాజికి వార్తలంపుచుండెను వీఁడు మంచి మాటలచే స్వాధీనపడఁడని తెలిసికొని శివాజి యొకనాఁడు తన మావళా సైన్యంబును వెంటఁబెట్టుకొని మధ్యరాత్రి బాజీమోహితె యింటిని ముట్టడించి యతని నతనిపక్షమువారి నందఱను జెఱఁబట్టి పరగణాయంతయు స్వాధీనపఱుచుకొని కర్ణాటకములో శహాజియొద్దకు బొమ్మని యతనినివదలి వేసెను

శివాజియొక్క జహగీరులో కొండాణా యనియు పురందర మనియు రెండుగొప్ప దుర్గంబులుండెను ఈ దుర్గములకు నధిపతులు బీజాపూరునవాబుచే నియమింపఁబడినవారు వారు శివాజికిఁ బ్రథమము నుండి మిత్రులయియుండిరి కొండాణాయను దుర్గాధిపతి యగు తురుష్కునికి ధనమిచ్చి శివాజి యాదుర్గమును స్వాధీనపఱుచుకొనెను ఇంతలో బురందర దుర్గాధిపతి యగు నీలకంఠీహైబతరావు మృతిఁజెందెను వానికి ముగ్గురుపుత్రులుండిరి అందుఁ బెద్దవాఁడు బీజాపూరు సులతానుయొక్క యనుజ్ఞ లేకయే దుర్గమును స్వాధీనపఱుచుకొనెను అందుకు నతనికి నతని యిద్దరుతమ్ములతో వైరము సంభవించెను। ఈతగవు తీర్పవలయు నని వారు ముగ్గురును శివాజి యొద్దకు వచ్చిరి వారితగవు తీర్ప శివాజి తన సైన్యముతో బురందరదుర్గము క్రింద దిగెను, శివాజి చిన్నతమ్ముల పక్షపాతియై యుండెను. దుర్గాధిపతి కుమారులిద్దరును న్యాయనిర్ణయమునకు నతనిని దుర్గముపైకి దీసికొనిపోయిరి దుర్గాధిపతి పెద్దకుమారుఁడు నిద్రించుచున్న సమయమునఁ జిన్నకుమారులచే నతని కైదుచేయించి

# మూడవ ప్రకరణము

శివాజి తన సైన్యమును దుర్గముపైకి రప్పించి దుర్గము స్వాధీనపఱుచుకొనెను తరువాత శివాజి ముగ్గురు తమ్ములనుగలపి వారి పరస్పరద్వేషంబుల రూపుమాపి వారికిఁ గొన్ని జాగీరు లిచ్చి తనయొద్దఁ గొన్ని యధికారంబు లొసఁగెను వారును శివాజియెడ భయభక్తులు కలవారయి యేకనిష్టతో శివాజిని భజించి ఖ్యాతి వహించిరి

ఇట్లొకసంవత్సరములోపల శివాజి రక్తపాత మెంతమాత్రమును జేయకయే యభేద్యము లయిన మూఁడు ప్రచండదుర్గములను సంపాదించి వానికంటె నధికప్రచండమైన యొక దుర్గమును నిర్మించెను ఇట్లు మహారాష్ట్ర స్వరాజ్యంబునకు మూలాధారం బేర్పఱుచుకొని శివాజి యింతకంటె నధిక సాహసకృత్యంబులఁ జేయ నుద్యమించె

కొంకణ ప్రాంతము ప్రథమమున అహమదునగర రాజ్యములోనిదియైనను క్రీ శ ౧౬౩౬ లో † విజాపూరు నవాబుల స్వాధీనమయ్యెను. అందలి కొంతభాగమునకు ముల్లానా అహమ్మద్ అనువాఁడు సుబేదారుగా నుండెను ఆ ప్రాంతమందు స్థలదుర్గములును పర్వతదుర్గములును ననేకము లుండెను కాని యాసుబేదారుఁ డసమర్థుం డగుటచే నా దుర్గంబులన్నియు సులభసాధ్యంబులగా నుండెను తనచారులను బంపి శివాజి యా ప్రాంతములోని దుర్గరహస్యంబు లన్నియుఁ గనుఁగొనుచుండెను

ఒక పర్యాయము సుబేదారునొద్దనుండి విజాపురమునకు నగదు ఖజానా పోవుచున్నదని చారులవలన శివాజికిఁ దెలిసెను. ఈ సంగతి తెలిసిన తోడనే మూఁడువందల గుఱ్ఱపు సిబ్బందితో బయలుదేఱి శివాజి యాఖజానాను నడ్డగించి దోఁచుకొనెను. ఆధన మంతయు రాయగడకుఁ దెచ్చి సురక్షితముగా నుంచెను. ఇట్లమితధనార్జనము చేసి శివాజి వెంటనే కాంగారీ తికోనా లోహగడ్ భోరప్ కేలనా మొదలయిన దుర్గముల నన్నింటిని గెలిచి మావళాప్రాంతము నంతయు స్వాధీనపఱుచుకొనెను తరువాతఁ గొంతకాలములోనే శివాజి తళే ఘోసాళే రాయరీ మొదలయిన

---

† మహారాష్ట్రీయు విజాపూరు అనియుఁ దురకలు బీజాపూరు అనియు వాడెదరు

కిల్లాలను సాధించి కొన్ని శత్రుగ్రామముల దోఁచికొనెను ఇట్లు కొలఁది కాలములోనే శివాజి యనేకదుర్గములను అసంఖ్యధనమను సంపాదించెను ఈ సమాచారము లన్నియు రమారమి క్రీ శ ౧౬౪౮ వ సంవత్సర ప్రాంతమున జరిగెను

కాని కేవలము ధనము సంపాదించుటయే శివాజిపని కాకయుండెను ధనము సంపాదించుట యతఁడు తలపెట్టికొనిన మహాకార్యమున కొకసాధనము మాత్రమయియుండెను గాన ధనము దొరికినవెంటనే శివాజి ఆబాజిసోనదేవుఁ డనువానిని మహారాష్ట్రములోని కళ్యాణపురము వైపునకు యుద్ధమునకుఁ బంపెను అతఁడు నాకస్మికముగా ముల్లానా అహమ్మదను ప్రాంతాధిపతిని నెదుర్కొని చెఱఁబట్టి యాప్రాంతములోని కోటల నన్నింటిని స్వాధీనపఱుచుకొనెను ఈ వృత్తాంతము తెలిసినతోడనే శివాజి కల్యాణమునకుఁ బోయి యాబాజీ సోనదేవుని నాతనికార్యసాహసములకునై యెంతయు మెచ్చి యాతఁడు గెల్చిన ప్రాంతమునకు నాతనిని సుబేదారు (ప్రాంతాధిపతి)గా నేర్పఱిచెను. చెఱలోనున్న ముల్లానా సుబేదారుని జెఱ విడిపించి గౌరవించి విజాపురమునకు బోవ వెలవిచ్చెను. చేతఁజిక్కిన శత్రుని నిట్లు సన్మానించి పంపుట శూరలక్షణమే కదా?

ముల్లానా సుబేదారుఁడు చెఱఁజిక్కినప్పుడు వానికోడలును మరాఠావారిచేతిలోఁ జిక్కెను ఈ యవన స్త్రీ యతిరూపవతియై యుండెను ఈ రూపలావణ్యవతిని స్వీకరించుకొనఁడి యని ఆబాజీసోనదేవుఁడు శివాజీకి సూచింపఁగా నాపురుషపుంగవుఁ డాసూచనను ధిక్కరించి యతినీతివిశారదత శోభిల్లునట్లుగా నిట్లనియె

† "ఈస్త్రీ నాకుఁ దల్లితో సమానమైనది యశస్సు కోరువారు

పరస్త్రీని నభిలషింపఁగూడదు పరదారాభిలాషచే రావణాదులు నశించిరి"

ఇట్లు చేతఁజిక్కిన సుందరయవనస్త్రీని దల్లిఁగా నెంచి బాధావిముక్తను జేసి స్వజనమునొద్దికిఁ బంపిన మహామహుని యింద్రియనిగ్ర

† చిటణీసుకృతమైన బఖరు

హమును పాపభీరుతను ఉదాత్తనీతి ప్రవర్తనమును (High moral conduct) వేయినోళ్ళఁ గొనియాడినను దనివితీరునా ! ఇట్టి యాత్మ నిగ్రహముగల రాజు లరుదు. కాన నట్టి రాజశిఖామణిని లోకులు దేవాంశ సంభూతునిగా నెంచుట యాశ్చర్యముగాదు. మహారాష్ట్రులందఱును శివాజీని శివుని యవతారముగా నెంచెదరు ఆ ట్లెంచుటకుఁ గారణ మాతని యందలి యుత్తమసద్గుణములే హిందూస్త్రీలను జెఱఁబట్టి భంగపఱుచుచున్న తురుష్కులస్త్రీ యోర్తు చేతఁ జిక్కి నామెను సత్కరించి పంపినాఁడన్న మాట యొక్కటియే శివాజియందు దేవగుణము లున్నవనుటకుఁ జాలును.

కల్యాణప్రాంతమునుగెలిచినతోడనే శివాజి యాప్రాంతముయొక్క జమాబందిపనికిఁ బ్రారంభించెను లోకుల మిరాసులు మాన్యములహక్కులు స్థిరపఱిచెను దేవస్థానములయొక్కయు, బ్రాహ్మణులయొక్కయునాదాయముల స్థిరపఱిచి కొన్నింటిని నధికముచేసి ప్రజలకునెల్లవిధముల సుఖము కలుగునటులఁజేసి యీరాజేమాకు నెల్లప్పుడుండుఁగాకయని వారుదేవునిఁ బ్రార్థించునటులఁ బ్రజాపాలనము చేసెను కల్యాణప్రాంతమునకు దక్షిణమున జింజిరా యనుసిద్దీల (Negro) రాజ్యముండెను. ఆ రాజ్యములోనివి యగు తళే, ఘోసాళే, రాయరీ మొదలయిన దుర్గములను శివాజి యదివఱకే సంపాదించియుండెను ఈ సిద్దీలరాజ్యము తనకు భయంపడునటులఁ జేయవలయునని తలఁచి శివాజి రాయరీదుర్గమునకు సమీపముగా లింగాణా యనుదుర్గమును ఘోసాళాదుర్గమునకు సమీపమున చిరవడీ యనుదుర్గమును క్రొత్తగా నిర్మించెను.

శివాజి ఖజానాదోఁచుకొనెను, దుర్గములను సాధించెను, సుబేదారునిఁ జెఱపట్టి ప్రాంతమంతయు స్వాధీనపఱుచుకొనెను, నూతన దుర్గములను నిర్మించె ననుమొదలయినవార్త లొకదానివెనుక నొకటి వెంటవెంట విజాపురమునకు రాఁగా నచ్చటిజనులలో సంక్షోభము పుట్టెను గాని యిందువలన సులతానునకుమాత్ర మెంతమాత్రము భయము కలిగినది

కాదు శివాజి చేయుసంగతు లన్నియు నీతనితండ్రి యగు శహాజియే చేయించుచున్నాఁడని యతనియభిప్రాయమై యుండెను. కర్ణాటమునుండి రణదుల్లాఖాను డు తిరిగివచ్చిన తరువాత నచ్చట శహాజియొక్కఁడే యుండుటవలన నాతనియధికారము నానాఁటికి నధికమగుచుండెను ఇదియుఁగాక శివాజి చేయుచున్న యుద్ధములన్నియు శహాజీయొక్క జాహగీరు సమీపముననుఁ అతఁడు అధికారిగానుండిన ప్రాంతములలోను జరగుచున్నందున నతనినిబట్టి కైదుచేసిన యెడల శివాజి చేయు దుడుకుతన మంతయు నాఁగిపోవు నని యాతఁడు తలఁచుచుండెను ఇట్లు తలఁచుచున్నవాఁడు గనుక సులతాను శివాజీతోఁ బోరాడ నేమియు సైన్యమును పంపక శహాజియొద్ద నున్న దేశముఖు బాజీ ఘోరపడే యనువానికి శహాజిని నాకస్మికముగాఁ జెఱఁబట్టి తనయొద్దకుఁ బంపుఁడని గుప్తముగా వార్తపంపెను ఇట్లు సులతాన్ మహమ్మద్ అదిల్‌శహా యొద్దనుండి వర్తమానము రాఁగా బాజీఘోరపడే యొకనాఁడు శహాజీని దనయింటికి భోజనమునకుఁ బిలిచి నమ్మించి క్రీ శ ౧౬౪౯ లో చెఱఁబట్టెను అతఁడు శహాజిని వెంటనే విజాపురమునకు నవాబునొద్దకుఁ బంపెను

విజాపురమునకు వచ్చినతరువాత శహాజినిఁ జూచి నవాబు మిగుల నాగ్రహపడి నీపుత్త్రుఁడు చేయు రాజద్రోహకార్యముల నన్నింటికిని నీవే ప్రేరకుఁడ వని నాకు నిశ్చయముగాఁ దెలిసినది నీవు నీ కుమారునకు నుత్తరము వ్రాసి యతఁడు రాజద్రోహము మానునట్లుగాఁ జేసినఁ గాని నిన్నుఁ జెఱనుండి విడువను అని పలికెను అందులకు శహాజీ వినయముతో నిట్లనియె నాకుమారుని రాజద్రోహమునకు నే నెంతమాత్రమును నుత్తరవాదిని గాఁజాలను వాఁడు నన్నెంతమాత్రమును లక్ష్యపెట్టఁడు వాఁడు మీయెడల రాజద్రోహము చేసినటులనే నాయెడలను పితృద్రోహము చేసినాఁడు మీకిష్టమున్న యెడల సైన్యమునంపి వానిని శిక్షింపవచ్చును వాని దండించుట నాకు సమ్మతమే ఇట్లు శహాజీ తనకుమారుఁడు ప్రారంభించిన కార్యములోఁ దాను లే నని సులతానుతో నెంత

చెప్పినను నాతఁడామాటలు నమ్మినవాఁడు కాఁడు శహాజి తాను నిరపరాధినని చెప్పిన కొలఁదినిఆదిలషహాకుఁ గోప మధిక మయ్యెను. ఆతఁడు శహాజిని నొకచీఁకటినేల గదిలో బంధించి యుంచి 'కొలఁదిరోజులలో నీ కొమారుఁడు మాకు"శరణుచొరనియెడల ఈగది యొక్క ద్వారము మట్టితో మూసివేసెదము' అని భయపెట్టెను.

తండ్రికి సంభవించిన యాపద వినినతోడనే శివాజి మిగుల చింతాక్రాంతుఁ డయ్యెను తాను దలపెట్టిన స్వరాజ్య సంస్థాపనం బను మహాకార్యమైన వదలివేయవలయు లేక పరమపూజ్యుం డయిన తన తండ్రియొక్క ప్రాణంబులయినఁ దురుష్కునిచేతిలో వదలి వేయవలయు మూఁడవమార్గము లేదు ఈ రెండు కార్యంబులును శివాజికిఁ దన ప్రాణంబులకంటె నధిక ప్రియంబులు వీనిలో నొకటి వదలుటకును నిష్టములేక శివాజి యేమి చేయుదునా యని చింతించు చుండెను ఘనుల బుద్ధి బలంబులఁ బరీక్షించు ప్రసంగంబు లిట్టివియే. పామరసామాన్యుం డిట్టిసమయమున నంగీకృతకార్యంబు మానుకొనును ఘనుండు తన యమిత బుద్ధిబలముచే నంగీకృత కార్యంబు పరిత్యజింపకయే యాపదల గెలుచును గాన నాపత్సమయమున నే పండితపామరభేదంబు తెల్లం బగుఁ గనుక ప్రస్తుత సంకటసమయమున శివాజి ఏమి చేసెనో చూచెదము

ఆదిల్ షహా నవాబునకు శరణుచొచ్చి తండ్రిని విడిపించుకొను టయే మేలని కొందఱు శివాజికి సలహాచెప్పిరి కాని యాసలహా యతని కిని, నతనిభార్య యగు సయీబాయికిని రుచింపదయ్యె ఆ భార్యామణి భర్తకిట్లనియె "నవాబునకు శరణుచొచ్చి యతనిచేతిలోఁ జిక్కినయెడల మనయిష్ట కార్యము (స్వరాజ్య సంస్థాపనము) సిద్ధింపదు నవాబు మన మాట వినునటులఁ జేసిన మేలుకాని యతనికి మనము లోఁబడుట మంచిదికాదు" ఆహా! వీరపత్ని కీమాటలు తగినవే గదా!

అందఱ యుపదేశము విని శివాజి యొకయుక్తి యోచించెను. ఈయుక్తివలన శివాజియొక్క బృహస్పతిసమాన బుద్ధికుశలత వ్యక్తమగును ఇన్నిరోజులవఱకు శివాజి విజాపురరాజ్యములోనే యుద్ధములు చేయుచుండెను డిల్లీరాజ్యమునకు నెంతమాత్రమును బాధ కలిగించినవాఁడు కాఁడు డిల్లీశ్వరులగు మొగలు లధికబలవంతు లనియు వారితో నిప్పుడే పోరాటపెట్టుకొనుట క్షేమకరము కాదనియు వారితో స్నేహభావముతో నుండినయెడల విజాపూరు నవాబుతోఁ బోరాడుటకుఁ దనకు వా రెప్పుడైన సాయము చేయఁగల రనియుఁ దలఁచి శివాజీ డిల్లీరాజ్యము జోలికిఁ బోయినవాఁడు కాఁడు. ఈస్నేహభావ మప్పుడు శివాజికి నుపయోగించెను శివాజి తన తండ్రికి విజాపురపు నవాబువలనఁ గలిగిన యాపద డిల్లీశ్వరుండగు శహాజిహానునకుఁ దెలపి యాతనిని విడిపింపుమని వేఁడుకొనెను డిల్లీశ్వరునకు శహాజి పరాక్రమమును శివాజి పరాక్రమమును దెలిసియున్నందున నట్టిపరాక్రమవంతుల నుపకారముచే స్వాధీన పఱుచుకొనినయెడల వారు తనకు దక్షిణరాజ్యములు (గోలకొండ మొదలయిన) గెలుచటలో సహాయము చేయఁగల రనియెంచి శహాజిహాను శివాజిమహారాజున కిట్లు ప్రత్యుత్తరి మంపెను శహాజిని విడువవలసిన దని మేము విజాపూరు సులతానునకు వ్రాయఁగలము. మీ తండ్రి మాకుఁ బూర్వము (అహమదు నగరరాజ్యములో నున్నప్పుడు) చేసిన యపకారము మఱచి యతనిని మన్నించెదము. అతనిని మానౌకరీలో నుంచుకొనియెదము ఇదియుఁ గాక మీకు విడిగా నైదువేల గుఱ్ఱపు రౌతుల మనసబుదారీ యిచ్చెదము ఇట్లు శివాజికి వ్రాసి డిల్లీశ్వరుండు విజాపూరునవాబునకు శహాజిని చీఁకటి గదినుండి తీయునటులను ఇతరబాధలు పెట్టకుండు నటులను నాజ్ఞాపత్రిక వ్రాసిపంపెను. అందుపై శహాజీకిఁ జీఁకటికొట్టునుండి మోక్షము కలిగెను ఉండిలేనటులఁ గొంచెము రాచచెఱ మాత్ర ముండెను ఇట్లు శివాజి తన బాహ్యాన్వత్యబుద్ధికౌశలమువలనఁ దన స్వాతంత్ర్యంబునకు హాని కలుగకుండఁ దండ్రిచెఱ

విడిపించెను ఈ యుక్తిని నింగ్లీషు చరిత్ర కారులు రాజతంత్ర శిఖామణి (master stroke of policy) యని యభినందించియున్నారు

తరువాత శహాజి నాలుగు సంవత్సరములవఱకు విజాపురములోనే యుండెను అంతవఱకు శివాజి విజాపురరాజ్యము నెంతమాత్రమును బాధ పెట్టినవాఁడు కాఁడు ఈ నాలుగు సంవత్సరములను విజాపూర నవాబు శివాజిపైకి దండు పంపినవాఁడు కాఁడు ఇట్లు చేయుటకు వీరిద్దఱకును నొక్కొకకారణ ముండెను విజాపూరు రాజ్యములో యుద్ధము లు జరిగిన యెడల మరలఁ దనతండ్రిని నేలగదిలో వేయుదు రేమో యని శివా భయము౦డెను శివాజితో యుద్ధము పెట్టుకొనినయెడల నతఁడు ఢిల్లీశ్వరునితోఁ గలసి తాను విజాపురరాజ్యములో నుండి సంపాదించిన స్థలము లన్నియు ఢిల్లీశ్వరున కిచ్చివేయునని విజాపురనవాబునకు భీతి కలిగి యుండెను తాను ఢిల్లీశ్వరునకుఁ గట్టవలసిన కప్పము కట్టనందున నపుడు తనపై వెడలివచ్చునేమో యనియు వచ్చిన వానికి శివాజి సహాయము చేయుననియు నతనికి జంకు గలిగియుండెను ఇట్లు ఒకరి కొకరు భయ పడుచున్నందున నాలుగు సంవత్సరములవఱకు వారిరువురు (ఆదిల్ షహా, శివాజి) ఒకరిజోలి కొకరు బోయినవారు కారు.

ప్రత్యక్షముగా యుద్ధమునకు రాకపోయినను విజాపూరు నవాబగు ఆదిల్ షహా శివాజిని దొంగతనముగాఁ జంపించుటకు యత్నము చేసెను కొందఱు మహారాష్ట్రులను గుప్తముగా శివాజియొద్దకుఁ బంపెను గాని వారి దురుద్దేశము దూరదృష్టి గల శివాజి కనుఁగొని వారినే బంధించెను. శివాజి మోసగాఁడనియు మోసముచే నెందఱినో చంపె ననియు నింగ్లీషు చరిత్రకారులు వ్రాసియున్నారు కాని చరిత్రమువలన శివాజీకి మోసము నేర్పినవారు తురుష్కులే యనియు నతనిప్రాణములు దీయవలయు నని యెందఱోతురుష్కులు ఎందఱో తురుష్కులలోఁ గలసిన మహారాష్ట్రులు మాయోపాయములచే యత్నింపఁగా దుదకు శివాజి యాత్మరక్ష

కార్థమై మాయోపాయములు పన్నవలసినవాఁ డాయెనని యీ చరిత్రము వలన స్పష్టపడఁగలదు.

క్రీ. శ. ౧౬౫౩ వ సంవత్సరమున ఆదిల్‌షహా శహాజీని కర్ణాటకములోని యతని జాగీరునకుఁ బంపెను. కర్ణాటకమునకుఁ బోవుచు శహాజీ తన కొమారుఁడగు శివాజీ కిట్లు వార్త పంపెను "నీవు నా నిజమైన కుమారుఁడ వైన నన్ను నమ్మించి భంగపఱిచి చెఱఁబట్టిన బాజీఘోరపడేను భంగపఱిచి నా పగ తీర్చుము"

శహాజీ కర్ణాటకమునకుఁ బోయినతరువాతఁ గనకగిరిలో గొప్ప యుద్ధములు జరిగెను. ఆ యుద్ధములో అఫజులఖాన్ అనువాని మోసము వలన శహాజీ పెద్దకుమారుఁడును శివాజీ యన్నయు నగు సంభాజీ మృత్యుఁడయ్యెను

# నాల్గవ ప్రకరణము



## పునాదిని బలపఱచుకొనుట

శివాజీమహారాజుయొక్క తండ్రియైన శహాజిని కైదులేకుండఁజేసి యతనిని బీజాపూరు సులతాను కర్ణాట (ద్రవిడ) దేశములోని యతని సొంత జాగీరునకుఁ బంపెనని వెనుకటి ప్రకరణములో వ్రాసియుంటిమి ఇట్లు తన తండ్రి బంధవిముక్తుఁడై నవాబు చేతిలో లేకుండా బీజా పూరు వదలి కర్ణాటకమునకుఁ బోయెనని తెలిసికొని శివాజీ తన యవన విదారణమను నంగీకృత కార్యమును మరలఁ బ్రారంభించెను బీజాపుర రాజ్యములో మరల మహారాష్ట్రవీరులు తమ ధౌర్త్యమును జూపసాగిరి. శహాజికొఱకు నాలుగు సంవత్సరముల వఱకు బయటఁ బడక లోలోపల రవులుకొనుచున్న శివాజీ శౌర్యాగ్ని తండ్రి బంధ విముక్తతతోఁ బ్రజ్వ లించెను ఇటుల నేసమయమునందేపని మానవలయునో యేకాలమున నే కార్యము ప్రారంభింపవలయునో తెలిసి ప్రవర్తించుటయే సారాసార విచారము

శివాజీ యాఱుసంవత్సరముల క్రిందట సంపాదించిన రాజ్యము నకు సమీపముగాఁ జంద్రరావుమోరేయను మరాటి జాగీరుదారుఁ డుం డెను. అతఁడు జావళియను గ్రామము తన రాజధానిగా నేర్పఱచు కొనెను. అతఁడు శివాజీ కులస్థుఁడే సమానజాతి వాఁడయినందున నత

---

† నవాబు శబ్దమును సులతాను గించిద్భిన్నార్థకము లయినను జనసామా న్యవ్యవహారము ననుసరించి యీ శబ్దములు పర్యాయపదములుగా వాడఁబడును సులతాను పదమునకు నాంధ్రంబున సురతాను అనియు సంస్కృతమున సురత్రాణ అనియు రూపాంతరములు గలవు.

నిని తన పక్షమునకుఁ ద్రిప్పుటకు శివాజీ యెంతయో ప్రయత్నించెను కాని చంద్రరావు శివాజీ ప్రారంభించిన క్రొత్తయుద్యోగమునకు ననుకూలుఁడు కాకపోయెను నీపక్షము నే నవలంబింప నని స్పష్టముగా శివాజీతోఁ జెప్పక సగ మనుకూలముగాను సగము ప్రతికూలముగాను ప్రవర్తించుచుండెను. ఇంతియకాదు, పైకి మీరు పెద్దలన మీరు పెద్దలని సృగాల వినయములు బలుకుచుఁ గపటోపాయములచే † శివరాయనిఁ జంప యత్నించుచుండెను బాజిశామరా వనువాఁడు మోసముచే శివాజిని జంప యత్నించి భంగపడెనని క్రిందటి ప్రకరణములో వ్రాసియుంటిమి. ఆ మోసమున కీ చంద్రరావు మోరేయను జాగీరుదారుఁడును సహాయుఁడుగా నుండెను. ఇట్లు చంద్రరావు గొప్ప మోసగాఁడనియు నతఁడెప్పు డే యుపాయముచేఁ దన ప్రాణములకు మోసము తెచ్చి తన యంగీకృత కార్యంబయిన స్వరాజ్యస్థాపనమునకు భంగము కలిగించునో యనియుఁ దలచి యుక్తులపుట్టి ల్లయిన శివాజీ యతనిని యుక్తిచేఁ దొలఁగింప నిశ్చయించెను

చంద్రరావు బలవంతుఁడును గుయుక్తిపారీణుఁడు నయినందునఁ బ్రత్యక్షముగా యుద్ధముచేసి యతనిని గెలుచుట దుర్ఘటమని తలంచి యతని మోసమునకుఁ బ్రతియగు మఱియొక మోసము శివాజీ కల్పించెను చంద్రరావు కుమార్తెను దన కిమ్మని శివాజీ చంద్రరావునకు వర్తమాన మంపి యావివాహమును గురించి రాయబారము చేయుటకు రాఘోబల్లాలు సభాజికావజి యను తన సరదారులఁ జంద్రరావు నొద్దకుఁ బంపెను ఆ మాయరాయబారులు తాము పిల్లను గుదుర్చుటకు వచ్చినారమని పైకిఁ జెప్పుచుఁ జంద్రరావు నొద్దకు మాటిమాటికి వెళ్ళుచుఁ దాము గుదుర్ప వచ్చినారమని చుట్టరికము గురించి మాటలాడుచుఁ దాము వచ్చిన కార్య

† శివాజీ శివునియవతార మని మహారాష్ట్రుల యభిప్రాయమైనందున శివాజీకి శివరాయ శివరాజ శివఛత్రపతి యని పదము లన్నియుఁ బర్యాయ శబ్దములుగా వాడఁబడును

మెట్టుల నెఱవేర్పవలయునో యోజించుచుండిరి అక్కడి లోకులలోఁ గలసి మెలసి వర్తించుచు వారిగుట్టంతయుఁ గనుఁగొని యచటివారిలోఁ బరస్పరకలహములు కలవనియు యుక్తిచేఁ జంద్రరావుని జంపిన రాజ్య మంతయు శ్రమలేకయే మన స్వాధీనముగుననియు శివాజీకిఁ దెలిపిరి అందుపై శివాజి వారి సాహాయ్యమునకు గుప్తముగా సైన్యమంపి వెనుక నుండి తానును రాయగడము వదలి యెవరికిఁ దెలియకుండుటకై రాత్రి ప్రయాణముచేసి మహాబళేశ్వరమునకు వచ్చెను చంద్రరావు మోరే యొక్క జావళీ గ్రామము మహాబళేశ్వరము నొద్ద నుండెను

ఇట్లు చేయవలసిన పూర్వప్రయత్నము లన్నియు సిద్ధముగా నుంచుకొని రాఘోబల్లాళుఁడు (శివాజి జావళికిఁ బంపిన రాయబారులలోఁ నొకఁడు) ఒకనాఁడు చంద్రరావును నతని తమ్ముఁడగు సూర్యరావును రహస్యము మాటలాడుట కయి యేకాంతమునకుఁ బిలుచుకొనిపోయి విశ్వాసఘాత మొనరించి వారిని జంపెను ఈసంగతి తెలిసి చంద్రరావు సైన్యము వారిపైకి రాఁగా నా రాయబారు లిద్దరు నరణ్యములోనికిఁ బాఱి పోయిరి అక్కడ శివసైన్యములు వారికి సాయముచేయుటకు సిద్ధముగా నుండెను వా రొక్కపట్టున నలుప్రక్కలనుండి జావళీ గ్రామమును ముట్టడించిరి చంద్రరావు మంత్రియగు హిమ్మతరావును జంద్రరావు యొక్క యిరువురు పుత్రులును శివాజి సైన్యమును మిగుల శౌర్యముతో నెదిరించిరి కాని తుదకాకృతజ్ఞతా భూషితుండగు మంత్రిపుంగవుండు యుద్ధములోఁ దెగెను చంద్రరావు పుత్రులు చెఱఁబట్టఁబడిరి ఒక నిముస మైనను వ్యర్థపుచ్చక శివాజి యాప్రాంతము నతిశీఘ్రకాలములో స్వాధీన పఱుచుకొనెను, ఈ రాజ్యములోని వాసోటా సాఎతరేభోరేయను దుర్గ ములు శివాజికి విశేష లాభప్రదములయ్యెను ఈ సమాచారము లన్నియు క్రీ. శ. ౧౬౫౫ సంవత్సరములో జరిగెను శివాజియొద్ద చెఱలో నుండియుఁ జంద్రరావు కుమారులు బీజాపూరు నవాబునకు వార్త లంపుచు నతని సాయముచే శివాజిని నడంచుటకు యత్నించుచున్నందున

శివాజి వారినిగూడ వధింపవలసిన వాఁడాయెను గాని వారి భార్యా పుత్ర సేవకాదుల నందరును వదలిపెట్టెను

పైని వర్ణింపఁబడిన చంద్రరావు ఘోరవృత్తాంత మంతయు శివాజి చరితములో నొక గొప్ప కళంకమనియు నతడు నీతి విహీనుఁడని చూపుటకు గొప్ప నిదర్శన మనియుఁ గొందఱు నవనీతివిశారదులగు చరిత్రకారుల యభిప్రాయమై యున్నది ఈ యభిప్రాయము బొత్తిగా ననాదరణీయ మని చెప్పుటకు వీలులేదు కాని యానవనీతివిశారదు లారో పించునంత దోషమునకు శివాజి పాత్రుఁడు కాఁడని మఱికొంద ఱభి ప్రాయ పడుచున్నారు చంద్రరావు శివాజిని నాకస్మికముగాఁ జంప యత్నించిన వాఁడును సమయము దొరికినప్పు డెటులయినఁ జంప యత్నించుచుండిన వాఁడును నయి యుండె ననినమాట జ్ఞప్తినుంచు కొనిన యెడల నతనిఁ జంపినందులకు శివాజియం దారోపింపఁబడిన దోషములో ముప్పాతిక మూఁడువీసముల దోషము తగ్గును కథా సందర్భ మంతయుఁ జూడఁగా రాజ్యలోభముచేతఁ గాక తన ప్రాణరక్షణార్థమై శివాజి చంద్రరావును జంపవలసిన వాఁడాయె నని తోఁచుచున్నది త ౹ ౨ మోసపుచ్చిన వానిని మోసపుచ్చ న ౼ ౨ వానిని మోసపుచ్చిన నెంతదోష ముండునో యంతదోషముకంటె నధికదోషము శివాజిపై నారోపింపరా దనుటకు సందేహము లేదు.

చంద్రరావును జంపి జావళీ గ్రామము సంపాదించిన తరువాత కొలఁదిరోజులకు శివాజి రోహిడా యను దుర్గమును నెకయకి రాత్రి ముట్టడించెను. ఆ కిల్లామీఁదనున్న దేశముఖు మిగుల శౌర్యముతోఁ బోరాడెను, గాని శివాజి సైన్య మధికమగుటచే నతఁ డోడిపోయి వీర శయనము నొందెను అతని దివాన్ అగు బాజీపరభూ అనువాఁడా యుద్ధ ములో నత్యద్భుతముగా యుద్ధముచేసి తన యమితస్వామిభక్తిని వెలిపఱి చెను యుద్ధము సమాప్తమయి దుర్గము చేతఁ జిక్కిన పిదప శివాజి

యాబాజి పరభూను మిగుల నాదరించి యతనిపూర్వాధికారము పూర్వపు జాగీరును నతని కిచ్చి యతనిని దనయొద్ద నుంచుకొనెను అతని చేతి క్రిందఁ గొంతసైన్యము నుంచెను ఈబాజీపరభు † తుదవరకు నద్వితీయ స్వామి భక్తితో శివాజి కార్యముల నిర్వహించుచుండెను. ఈ దుర్గము క్రింద నున్న ప్రాంతమునకు హిరడస యని పేరు.

ఇట్లు జావళిప్రాంతము హిరడస ప్రాంతము సంపాదించిన పిదప నాప్రాంతములను గాపాడుటకునై శివాజి కృష్ణానదియొక్క యుగమము నొద్ద (మహాబళేశ్వర సమీపమున) నొక నూతన దుర్గము నిర్మాణింప నెంచెను. ఈ దుర్గనిర్మాణకార్యము నిర్వహించుటకు మోరోత్రిమలపింగళేయను బ్రాహ్మణపరవారుని నియమించెను ఈతఁడు నానూతన దుర్గమును శత్రువులకు నభేద్యముగా క్రీ శ ౧౬౫౬ వ సంవత్సరములోఁ గట్టించెను అప్పటినుండి మోరోత్రిమలపింగళేపై శివాజికరుణ శుక్లపక్ష చంద్రునివలె నభివృద్ధిజెందెను ఆ దుర్గమునకు ప్రతాపగడ్ అని నామ మిడిరి.

ఇట్లింతవఱకు శివాజి బీజాపూరు నవాబుయొక్క రాజ్యములోను నారాజ్యములో నున్న యితర సంస్థానపతుల సంస్థానములలోను అల్లకల్లోలము చేయుచుండెనే కాని డిల్లీశ్వరుని రాజ్యములోనికిఁ గాలుపెట్టలేదు. డిల్లీశ్వరుఁడు సార్వభౌముఁడు అమితబలమును అమితధనమును గలవాఁడు ఆతనితో మొట్టమొదటనే పోరాటపెట్టుకొనిన విలుమట దుస్తరమని యెంచి, శివాజి యింతవఱకు డిల్లీశ్వరునిజోలికిఁ బోయినవాఁడు కాఁడు ఇప్పుడు కొంతధనము సంపాదించి కొన్ని సంస్థానముల గెలిచి యనేకదుర్గముల నాక్రమించి ప్రబలినపిదప శివాజి డిల్లీశ్వరుని ప్రాంతం

---

† పరభు అనిన శబ్దము ప్రభు అనుసంస్కృత శబ్దమునకు మహారాష్ట్ర తద్భవము ఈ పదము మహారాష్ట్రములోని యొకజాతిని దెలియఁజేయును.

బులపై దండు వెడలుటకుఁ బ్రారంభించెను ఈసమయమున † ఢిల్లీశ్వరుని స్థితియు దక్షిణములో నతనిక్రింద నున్న రాజ్యముయొక్క స్థితియు జక్కఁగఁ దెలిసినఁగాని తత్సంబంధమైన శివచరిత్రము బోధపడఁజాలదు గాన దానిని గురించి యిక్కడ సంక్షేపముగా వ్రాసెద

అప్పటి ఢిల్లీబాదుషహా నామము షహాజహాన్ ‡ దక్షిణములోని రాజు లందఱు పేరికైనను నతనికి సామంతులుగా నుండిరి అయినను వీరందరు మనసు వచ్చినప్పుడు ఢిల్లీశ్వరుని మాట వినుచు మనసురానప్పు డితనిని ధిక్కరించుచుండిరి గాన వీరి నందఱను దండించుటకును వీలయినయెడల వారిని రాజ్యమునుండి తొలఁగించుటకును ఢిల్లీశ్వరుఁడు యత్నించుచుండెను ఢిల్లీశ్వరుఁడు శివాజి తండ్రియగు శహాజిచే రక్షింపఁబడుచుండిన యహామదనగర రాజ్యమును బాడుచేసెననియు నందులో కొంచెము భాగము బీజాపూరునవాబునకిచ్చి కడమ భాగమంతయుఁ దనక్రింద నుంచుకొనెననియు వెనుక (ప్రథమ భాగములో) వ్రాసియున్నాము. దక్షిణములోని తన రాజ్యమునకు సుబేదారుగాఁ దన మూఁడవ కుమారుఁడగు ఔరంగజేబును నియమించి యతనిని క్రీ. శ. ౧౬౩౦ సంవత్సరములో దక్షిణమునకుఁ బంపెను ఔరంగజేబు విద్యావంతుఁడును బుద్ధికుశలతగలవాఁడును నయినందువలన నహామద నగర ప్రాంత మంతయు నతఁడు (ఖుబాదు) చేసెను కొంచెపాటి పన్ను లేర్పరించి భూము లంతయుఁ బొందుపరిచెను ఖడకీ యను

---

† ఢిల్లీ ఢిల్లీ ఈయుభయులూఁ బుసు వాని లో నున్నవి

‡ దక్షిణ మనఁగా నర్మదానదికి దక్షిణమున నున్న హిందూదేశమంతయునని యర్థము వింధ్యపర్వతమునకు నుత్తరమున నున్నదంతయు నుత్తరమనియు దక్షిణమున నున్నదంతయు దక్షిణమనియుఁ గొందరు చెప్పెదరు దక్షిణమునకే తురకమున "దక్షిన్" దాని ననుసరించియే యింగ్లీషులో Deccan అనియెదరు

గ్రామమును రాజధానిగా నేర్పరిచి దానికిఁ దన నామము ననుసరించి ఔరంగాబాదని పేరుపెట్టెను

ఔరంగజేబుయొక్క గొప్ప దుర్గుణము రాజ్యతృష్ణ దక్షిణమునకు వచ్చినప్పటినుండియు గోలకొండ నెట్లు కూల్పవలయును, బిజాపూరు నెట్లు గెల్వవలయుననిన యాలోచనలే చేయుచుండెను క్రీ శ ౧౬౫౫ వ సంవత్సరములో గోలకొండ నవాబునకు నతనిమంత్రి యగు మిర్జుమ్లా యను వానికిని వైరము సంభవింపఁగా ఔరంగజేబు మంత్రి పక్ష మవలంబించి గోలకొండమీఁదికి దండెత్తి పోయి నవాబు నోడించి యతని యొద్దనుండి కోట్లకొలది ధనము పుచ్చుకొని యతని కూఁతును దన కుమారుఁడగు సుల్తానుమహమ్మదను వానికిఁ బెండ్లి చేసెను

ఇట్లొకరాజ్యము నొంచి బిజాపూరు రాజ్యముపైకి నేదియో కారణముచే దండు వెడల యోజించుచుండెను ఇంతలో విజాపూరు నవాబగు మహమ్మద ఆదిల్షహా క్రీ శ ౧౬౫౬ లో మృతిజెందెను వాని కుమారుఁడగు రెండవ అల్లీఆదిల్షహా రాజ్యాసనారూఢుఁడయ్యెను. అప్పుడాతని వయస్సు పందొమ్మిదిసంవత్సరములు అప్పుడతని రాజ్యము సుస్థితిలో నుండి బొక్కసములోఁ జాలధన ముండెను. ఇవియన్నియుఁ జూచి యౌరంగజేబు దురాశ యధికమయ్యెను ఢిల్లీశ్వరుని యనుజ్ఞ పడయకయే రాజ్యారూఢుఁ డైనాఁడనిన యపవాద మొకటి క్రొత్త నవాబుపై మోపి ఔరంగజేబు బిజాపూరుపై ధాడిమి వెడల నిశ్చయించెను తాను సాయముచేసిన గోలకొండమంత్రి గొప్పసైన్యముతో వచ్చి తన్నుఁ గలిసికొనఁగా నాతఁడు దండయాత్ర వెడలెను అప్పుడనఁగా క్రీ శ ౧౬౫౭ వ మార్చినెలలో శివాజి ఔరంగజేబున కిటుల వార్త నంపెను "మేము మొదటినుండియు ఢిల్లీశ్వరుని సేవకులము. ఇఁక ముందును నటులనే యుండెదము మేము విజాపుర రాజ్యములో గెలిచిన రాజ్యమంతయు మాక్రిందనే యుంపవలసినది అటులనే కొంకణ ప్రాంతములోని దాభూళ్ మొదలయిన రాజ్య లన్నియు మాయధికారములోనే యుండునది ' ఔరంగజేబు మహాసంతోషముతో నీయుత్తరమును స్వీక

రించినవానివలె నటించి యందులోని యంశములన్నియుఁ దనకు సమ్మత ములని సూచించెను ఇంతియకాదు శివాజిని జూడఁదనకుఁ జాలనభిలాష మున్న దనియు నొకరి నొకరు కలిసినయెడల ననేక రహస్యములు మాటలాడవలసి యున్నవనియు బీజాపూరిరాజు నోడించుట యిద్దఱకు నావశ్యకమే గనుక శివాజిహితమే తన హిత మనియుఁ దనహితమే శివాజిహితమనియు బకనీతు లుపన్యసించెను కాని ఔరంగజేబుకంటె జిత్తులలో శివాజి రెండుకమ్మలధికము చదివినవాఁ డయినందున ఔరంగజేబు మాటలు నమ్మి యతని యొద్దకుఁబోక "మేము మీకు సామంతులము. మీ యాజ్ఞమాకు శిరమున వంద్యము" అని శుష్క సమాచారములు పంపుచుఁ గాలము గడపెను

ఔరంజేబు బీజాపురముపైఁ గత్తికట్టుకొని పోఁగా నచ్చటివారును జేతనయి నంతవఱకుఁ బోరాడిరి. కాని నవాబు చిన్నవాఁ డయినందునను వరదార్లఁదఱును నొక్కచోట లేనందునను నొక్కమనసుగలవారు కానందున వజీరు స్వామిద్రోహియై ఔరంగజేబుతోఁ గలసినందునను నవాబు జర్జరుఁడై కోటిరూపాయలును మఱియేపదార్థము లడిగిన నా పదార్థములు నిచ్చి సంధిచేసికొన సిద్ధుఁడయ్యెనుగాని వీలయిన యెడల విజాపూరు విజాపూరు రాజ్యమంతయు డిల్లీరాజ్యములోఁ గలిపి నవాబును దొలఁగబెట్టవలయు నని యౌరంగజేబు చూచుచుండెను

ఇచ్చట శివాజీ తియ్యనిమాటలతో నౌరంగజేబును విజాపురము పైకిఁ బంపి తాను నతనిరాజ్యములోనికిఁ జొరఁబడెను డిల్లీవారికిని విజా పూరు వారికిని యుద్ధము జరుగుచున్నందున నదిబహుదినముల వఱకు జరగుననియు వారిరువురును బోరాటములో మునిగియుందురు గాన వారి రాజ్యములలో యథేచ్ఛముగా విహరించి స్వరాజ్యాభివృద్ధియు ధనాదిసం గ్రమును జేయవచ్చు నని తలఁచి శివాజి యాకార్యమునకుఁ బ్రారంభిం చెను మొగలుల (ఔరంగజేబు మొదలయినవారు) విజాపురమునకు వెళ్ళఁగానే శివాజి డిల్లీశుని జున్నరను గ్రామము దోఁచుకొనెను ఈదోఁపి డిలో నతనికి మూఁడులక్షల మొహరీలు రెండువందల గుఱ్ఱములు మఱి

కొంత ధనము దొరకెను. ఈ ధనమంతయు స్వయముగా పూనాపట్టణమునకుఁ దీసికొనిపోయి యచ్చటినుండి యాశ్వికులచేత రాయగడమునకుఁ బంపి అహమదునగర పట్టణము దోచుటకు వెడలెను శివాజి దొంగత్రోవనెకాయకి అహమదనగరముపైకి వచ్చినను గోటలోనివార కా వృత్తాంతము త్వరగాఁ దెలిసినందున వారు గుఱ్ఱపురౌతులఁ బంపిరి అందువలన శివాజికి విశేషధనము దొరకలేదు అక్కడ ౭౦౦ గుఱ్ఱములు ౪ ఏనుఁగులు మాత్రము దొరకెను శివాజి భయము విడిచి స్వతంత్రరాజువలె నిట్లు డిల్లీ రాజ్యములోను దనమహారాష్ట్ర సాహసమును జూపసాగెను

పూనాకు వచ్చినతరువాత శివాజి యొక గొప్ప యాశ్వికసైన్యమును నిర్మించుటకుఁ బ్రారంభించెను ఇదియె ఖ్యాతివడసిన మరాటగుఱ్ఱమునకుఁ గూటస్థము జున్నరు అహమద నగరములనుండి తెచ్చిన గుఱ్ఱములను మూలాధారముగా నేర్పఱుచుకొని అశ్వసైన్యము నిర్మింపసాగెను అన్నిదిశలకును మనుష్యులఁ బంపి సైన్యమునకు నుపయోగకరము లగు నుత్తమాశ్వముల ననేకములఁ గొనితెప్పించెను సైనికుల కందఱకు నశ్వారోహణముచేసి యుద్ధము చేయువద్ధతి నేర్పెను శిలేదారులను చిన్న చిన్న యశ్వసేనాధిపుల నియమించెను. ఇంతకుఁ బూర్వమతనియొద్ద మాణకొజీదు తొందే యని తండ్రికాలమువాఁడగు నొకవిశ్వాసపాత్రుఁడయిన హవాఁదారుండుండెను అతని యొద్ద గుఱ్ఱపురౌతుల యొకచిన్న గుంపుమాత్ర ముండెను. అతనికి శివాజి "సర్ నౌబత్" అనిన బిరుదు నొసంగి యుండెను. అతఁడు మృతి చెందఁగా నతనిపనిమీఁద శివాజి గొప్పవంశస్థుఁడును తెలివిగల శిలేదారుఁడు నయిన నేతాజిపాల్కర్ అనువాని నియమించెను అటులనే బహుదినములనుండి తనదివాన్‌గానున్న శామరావుపంతునకు "పేషవా" † యనుపదవి యొసంగెను అతనికిరాజ్య

---

† "పేషవా" యనఁగా ప్రధానియనియర్థము "ప్రధానః పేషవామతః" అని రాజవ్యవహారకోశము ఈకోశము శివాజికాలములోనే నిర్మింపఁబడినది

కార్యసంబంధమైనట్టియు (Administrative) కొంత యుద్ధసంబంధమైనట్టియు (Military) రెండు అధికారము లుండెను. బాలాజి విశ్వనాథుఁడు మొదటి పేషవా యని యన్ని యింగ్లీషు చరిత్రగ్రంథములలోను గొన్ని మహారాష్ట్ర చరిత్రగ్రంథములలోను వ్రాయఁబడి యున్నది కాని యాలాగు వ్రాయుట న్యాయముకాదు. బాలాజి విశ్వనాథునికాలము నుండి పేషవాలు ఇతరదేశములలో విశేషవిఖ్యాతు లయిరి. ఇంతయే. కాన శ్రీ శివాజిచే "పేషవా"పదవి ప్రప్రథమమున నెవ్వరి కీయఁబడెనో యాశామరావుపంతులే † మొదటిపేషవా యనుటకు సందేహము లేదు

ఈ ప్రకారముగా ఔరంగజేబు విజాపూరు పట్టణముతో ఘోరముగాఁ బోరి దానిని మ్రింగుదునా యని తలంచుచున్న సమయమునను ఒక యద్భుతమైన యశ్వసైన్యము నిర్మించి యిద్దఱు తురకలు ఒకరితో నొకరు పోరాడుచుండ సిద్ధఅను స్వాహా చేయుదునా యని శివాజి యోజించుచున్న సమయమునను ఉత్తరహిందూస్థానములోన నొక్క-గొప్ప రాజ్యక్రాంతి (Revolution) ప్రాప్తించెను అది యేది యన —

ఢిల్లీఖండును ఔరంగజేబుతండ్రియు నగు షహజహాన్ బాదుషహాతు నాకస్మికముగా వ్యాధిసంభవించి జీవించియుండుట దుస్తరమయ్యెను అతనికి నల్గురుకుమారు లుండిరి పెద్ద వాఁడు దారా వాఁడు తండ్రియొద్దనే యుండి రాజ్యకార్యములను జూచుచుండెను కడమ ముగ్గురిలో నొకఁడు బంగాళదేశములోను నొకఁడు గుజరాతదేశములోను ఒకఁడగు ఔరంగజేబు దక్షిణములోను నుండిరి. తండ్రిదేహస్థితి తెలిసినతోడనే పెద్దయన్న రాజ్య మంతయు నాక్రమించుకొనునేమోయని

† మహారాష్ట్రమున ఆదరార్థమున వాడఁబడు "పంత" శబ్దమును తదర్థముననే తెలుఁగు లుప్రత్యయముతోడ వాడఁబడు "పంతులు" శబ్దము భిన్నశబ్దములుగాక యొకశబ్దమే యైయున్నది గాన శామరావుపంత్ అనుటకు మాఱుగా "శామరావుపంతులు" అని వాడఁబడియె

ముగ్గురు తమ్ములును దమతమ సైన్యములతో డిల్లీకిఁబోయిరి ఇట్లు డిల్లీకిఁ బోవలసినవాఁ డయినందున ఔరంగజేబు బీజాపూరు యుద్ధము చాలించి నవాబు ఇచ్చెగ నన్నధనము తీసికొని యాతనితో సంధిచేసి డిల్లీకిఁ బోయి యన్నదమ్ములఁ జంపి కొంచెము బాగఁనతండ్రిని జెఱసాలలో నుంచి క్రీ. శ. ౧౬౫౮ వ సంవత్సరమున డిల్లీతక్తు నెక్కి బాదుషహా యయ్యెను.

ఇట్లాకస్మికకారణమువలన నౌరంగజేబు బీజాపూరు నవాబుతో సంధిచేసికొని డిల్లీకి వెళ్ళవలసినవాఁ డయినందున వీరిరువురకు బహుకాలమువఱకు యుద్ధము జరుగు ననియు వారి కలహమువలనఁ దనకేమో లాభము కలుగు ననియు శివాజి తలంచినతలంపు లన్నియు నిరర్ధకంబు లయ్యె ఔరంగజేబు సంధిచేసికొని తిరిగి రాఁగలఁడని విన్నతోడనే మిగుల నమ్రతతో నతనికి విజాపురమునకు శివాజి యిట్లు వార్త పంపెను —"నావలన తప్పయినది అందునకు క్షమింపుఁడి మేము బాదుషహా నామంతులము మీరు చెప్పినపని చేయుటకు సిద్ధముగానున్నాము" ఔరంగజేబు ఉత్తరమునకు వెళ్ళనప్పుడు శివాజి తన రాయబారి యగు కృష్ణాజిభాస్కరు అనువానిని నతనియొద్దకుఁ బంపి యిట్లు విన్నవించుకొనెను "ఇదివరకు జరగిన యపరాధమునకై మాకు బశ్చాత్తాపము కలిగినది ప్రస్తుతము మీకు సాహాయ్యము చేసి యిదివరకుఁ జేసిన యపరాధము లన్నియు లేకుండఁ జేసికొన దలఁచి మీ కొఱకు మేము గుఱ్ఱములదండును సిద్ధపఱిచి యుంచినారము మీయాజ్ఞయైన యెడల మీ సాహాయ్యార్ధమై దానినుత్తరమునకుఁ బంపెదము దక్షిణమున నున్న మీరాజ్యమంతయు మేము కాపాడఁగలము కాని దిల్లీబాదషాహి రాజ్యములో మాకుఁ బూర్వమునుండి వచ్చుచున్న దేశముఖీగిరిసంబంధమైన హక్కులు మాకు మీ రిప్పింపఁగోరుచున్నాము మా హక్కులు మా కిచ్చిన మీసేవచేయుటకు మేము సిద్ధముగా నున్నాము ఇదియుఁగాక కొంకణప్రాంత మంతయు విజాపురియువారి ప్రభుత్వముక్రిందఁ బాడయి పోయినది ఆ ప్రాంతము మీరు మా కిచ్చినయెడల మీకు మే మధిక లాభము గనఁబఱిచెదము

ఔరంగజేబున కీపత్త్రమానమువందలి యంతరార్థముతెలియకపోలేదు. కాని యుత్తరమునకు స్వకార్యార్థియై వెళ్ళవలసినవాఁ డయినందున నిప్పుడు దక్షిణములోఁ బోరాటపెట్టుకొనుట క్షేమకరము కాదని యెంచి యుక్తితో శివాజీ కిట్లు ప్రత్యుత్తరమంపెను — 'నీవు రాయబారిద్వారా పంపినవార్త తెలిసినది నీపూర్వాపరాధము లన్నియు క్షమింపఁబడియె ఇఁకమీఁద మరల దప్పులు చేయవలదు మారాజ్యములో నీకుఁ గల దేశముఖుహక్కులను గుఱించి సవిస్తరముగా విన్నవించుటకు మాయొద్దకు సోనదేవపండితుని (ఆబాజీసోనదేవుఁ డనువానిని) పంపిన మేము దానిని గుఱించి యోచింపఁగలము మీహక్కులు మీకుఁ బ్రాప్తము కాఁగానే మాసాహాయ్యమునకు నైదువందల గుఱ్ఱపురౌతుల నుత్తరమునకుఁ బంపవలసినది. దక్షిణములోని మారాజ్యమును గాపాడుచుండునది' ఇట్లు తియ్యనిమాటలతో శివాజిని సమాధానపఱిచి యుత్తరమునకుఁ బోయి రాజ్యము సంపాదించిన పిదప శివాజి గర్వమడఁప వచ్చును, అంతవఱకు వీనిని మంచిమాటలచే మనకు ననుకూలునిఁగానే యుంచుకొనవలెను, అని తలఁచి ఔరంగజేబుత్తరమునకుఁ బోయెను ఔరంగజేబు చెప్పినప్రకారము శివాజి తన హక్కులను గుఱించి ఔరంగజేబునొద్దకు వకీలును బంపను లేదు గుఱ్ఱపుదండును బంపి ఔరంగజేబునకు సాహాయ్యము చేయనులేదు ఈ ప్రసంగము జరిగిన తరువాత నాలుగుసంవత్సరముల వఱకు ఈ విఖ్యాత వీరప్రతివీరులకు మరలఁ బ్రసంగము జరగలేదు

ఔరంగజేబునకును విజాపురపు నవాబునకును సంధి కలిగినందున నవాబు తనయొద్దనున్న సైన్యములో నేడువందల తురుష్కసైనికులఁ దగ్గించెను నిరుద్యోగు లయిన యా శూరయవనులు శివాజీ యొద్దకు నుద్యోగమునకై వచ్చిరి. శివాజీ వారినందఱకు దగినజీతముల నేర్పఱిచి తనయొద్ద సైనికులఁగా నుంచుకొని వారిపైని రఘునాథబల్లాలుఁ డను మహారాష్ట్రశూరుని నధికారిగా నేర్పఱిచెను ప్రస్తుతము మనదొరతనము వారు హిందూశిపాయీలపై నింగ్లీషధికారుల నుంచినటులనే శివాజీ తన

తురకబంట్లను మొగలాయధికారిని నియమించెను. ఇ[illegible] పక్ష దృష్టి స్పష్టమగుచున్నది. హిందూ సిపాయిలు ఇంగ్లీషువారిసేవ కృతజ్ఞతతోఁజేసినట్లులనే యీ తురకయవనులు శివాజికి ననేక యుద్ధములలో నమితసహాయము చేసిరి. ఇందువలన శివాజియందుఁ దురకలను గూడ సంతోషపెట్టి తన భక్తులను జేసికొను కౌశల్యముండెనని చెప్పుటకు సందేహములేదు.

ఈ తురకబంట్ల సహాయమునేతను మరిహిందువుల సైన్యములఁ బోగుచేసి వారి సాహాయ్యముచేతను శివాజి కొంకణ ప్రాంతములో సముద్రపుటొడ్డున నున్న కొన్ని దుర్గములను సంపాదించెను.

కొంకణములో జింజిరా యను సముద్రదుర్గము కలదు. ఆదుర్గాధిపతి యగు సిద్దిఫత్తేఖానుని రాజ్యము కొంకణములోనే యాదుర్గము చుట్టుండెను. ఈఫత్తేఖానుఁడు సిద్దీయను నీగ్రో (Negro) జాతివాడు. మొదట వీఁడును వీని రాజ్యము క్రిందనున్న జింజిరా ప్రాంతమును అహమదనగర రాజ్యమునందుండెను. ఆ రాజ్యము నాశనమొందిన తరువాత వాఁడు విజాపూరు నవాబునకు సామంతుఁడయ్యెను. వానియొద్ద సముద్రముపై యుద్ధముచేయుటకుఁ దగినయోడ లనేకములుండెను. అందుచే సముద్రముమీఁద వానినెదిరించువాఁడెవ్వఁడు లేఁడయ్యెఁ గనుక వానిని గెలుచుటకు శివాజి తన పేష్వాయగు శామరావు పంతును సైన్యముతోఁబంపెను. కాని శత్రువులురాక ఫత్తేఖానునకుఁ ద్వరగాఁ దెలిసియుండుట వాఁడే ప్రతివ్యూహము పన్ని పేష్వాను క్రీ॥ శ॥ ౧౬౫౯ లో నోడించెను. ఈపరాజయమువలన శివాజికిఁ గోపించగలిగి యతఁడు శామరావుపంతును పనినుండి తొలగించి [1] మోరోత్రిమలపింగళే యను

[1] ఈ పేష్వా పేరు మోరోపంతు, "మోరో" అనునది యీ శబ్దము యొక్క హ్రస్వస్వరూపము. ఇతని తండ్రిపేరు త్రిమలపంతు. ఇంటిపేరు పింగళే. ఈ మూఁడుకూడి మోరోత్రిమలపింగళే యను పేరాయెను. మహారాష్ట్రులలో ప్రథమమునఁ దమ పేరు పిదప తండ్రి

7)

సరదారునకుఁ బేషవా యనుబిరుదు నొసంగెను ఇతఁడు రెండవ పేషవా కొంత సైన్యము వెంటఁదీసికొని రఘునాథబల్లాళుఁడను సరదారు జింజిరా సిద్దిపైకిఁ బోయెను కాని సిద్దీని వంపలేకపోయెను అందుపై శివాజి గొప్పసైన్యమిచ్చి పేషవాయగు మోరోపంతుపింగళేను సరనోబతు పాలకరును వానకాలము అయినతోడనే జింజిరాకుఁ బంపెను గాని యింతలో విజాపురిమునుండి అఫజులఖానను వాఁడు ప్రచండసైన్యముతోఁ దనమీఁదికిఁ వచ్చుచున్నాఁడని తెలిసినందున నాసైన్యముల నన్నింటిని దిరిగి పిలిపించుకొనవలసినవాఁడాయెను

---

పేరు తరువాత ఇంటిపేరు వ్రాయు నాచారముకలదు ఇతని యింటి పేరును గుఱించి కొంత విచారింపవలసియున్నది మహారాష్ట్రము లోని పింగళేవారును ఆంధ్రదేశమునందలి పింగలివారును ఒకయింటి వారెయని తోఁచెడిని "మోరోత్రిమలపింగళే" నామములోని "త్రిమల" శబ్దము "తిరుమల" శబ్దమే ఈపేరు మహారాష్ట్రములో లేదు తిరుమలయ్య, తిరుమలమ్మ, తిరుమలాచార్యులవారు మొదల యిన నామంబు లాంధ్రదేశంబున వాడుకలో నున్నవి కాన మహా రాష్ట్ర ""పింగళే"లు ఆంధ్ర "పింగలి" వారే దేశాంతరంబునకుఁ బోయినందున ఆదేశాచారములనే గ్రహించియుందురు తమయాచార ములను భాషను వదిలి పూర్ణముగా మహారాష్ట్రులైన యనేకాంధ్రులు ప్రస్తుతము మరాటాదేశములోఁ గానఁబచ్చెదరు అటులనే యీ పింగ ళేలు స్వరూపము మాఱిన పింగలివారయుందురు ఆంధ్రంబున "పింగలి" యను నింటిపేరు గలవా రిద్దఱున్నారు. ఒకరు ఉత్తర సర్కారులోనున్న పింగలివారు వీరు ప్రఖ్యాతుఁడైన పింగలి సూరన్నకు జ్ఞాతులని చెప్పవచ్చును రెండవవారు నైజామురాజ్యము లోని అనుమకొండ (హనుమకొండ) పైనున్న పింగలి వారు. తాము అక్కన్నమాదన్నగారి సంతతివారమని వీరు చెప్పెదరు వీరిరువురిలో నెవరిలోనుంచి "పింగళే"లు చీలినవారో కనుఁగొన వలసియున్నది.

# ఐదవ ప్రకరణము

## గురూపదేశము

పై శీర్షికఁ జదివినతోడనే చదువరులు వీరరసప్రధానమైన శివాజి చరితమునందు శాంతరసపూరితులగు మతగురువుల వారి సమాచార మేల వచ్చెనని యాశ్చర్యము నొందుదురు కాని శివాజి చూపిన శౌర్యమునకును స్వదేశాభిమానమునకును స్వమత సంరక్షణమునకును ప్రధాన ప్రేరకుఁడు గాకపోయినను ముఖ్యప్రేరకుఁ డయిన రామదాసస్వామి యొక్క సంపూర్ణ చరిత్రము గాకపోయినను, శివాజితో సంబంధించినంత మట్టునకయినను విచ్చట నియ్యకుండిన నమ్మహానుభావుని యెడల నగౌరవముఁ జూపినవాఁడ నగుదు ననియు, శివాజిచరిత్రము నసంపూర్తిగా వ్రాసినవాఁడ నగుదు ననియు నిచ్చట సంగ్రహముగా శివాజి రామదాససంబంధమును వర్ణించుచున్నాను

మతజిజ్ఞాసయు మతోపదేశంబును మానవులకు సంసారమునందు విరక్తిగలుగునటులఁ జేయు ననియు జ్ఞానోపదేశము యొక్క పరమోద్దేశము సర్వసంగపరిత్యాగమే యనియు జనసామాన్యంబు దలఁచుచుండ గురూపదేశమువలన మఱింత శూరుఁడయ్యె ననియు నైహికరాజ్యము సంపాదించుటయందు నధికోత్సాహి యయ్యెననియు నేను వ్రాయుట చదువరులకు వింతగానుండును. కాని వివిధదేశముల చరిత్రములను జక్కఁగా నభ్యసించిన వారికి, స్వమతాభిమానము, స్వదేశాభిమానముగాఁ బరిణమించు ననినసంగతి వింతగా నుండఁజాలదు. మతాభిమానమును మతశ్రద్ధయుఁ బూర్వము దేశాభిమానమునకుఁ బ్రబల పోషకములుగా నుండెను. క్రి. శ. ౧౬౫౩ నుండి ౧౬౫౮ వఱకు నింగ్లండు దేశసంరక్షకుఁడు (Protector)గా నుండిన క్రాంవేల్ గెలిచినయుద్ధంబు లన్నియు మత ప్రేరకులగు శూరులసైన్యంబుల వలననే యని తద్దేశచరిత్ర బోధ

వారికి విశదమే. ఏవానినైనను సైన్యములోనికిఁ జేర్చుకొనుటకుఁ బూర్వ మాతఁడు నమిత మతాభిమానము కలవాఁడా కాఁడా యని క్రాంవెల్ ఆలోచించుచుండెను మతాభిమానము లేనివారల నతఁడు సైన్యములోఁ జేర్పనేలేదు. కనుకనే సార్థకనామము గలిగిన లోహకాయులు (Ironsides) ఎచ్చటను బరాభూతు లయినవారు కారు ఇఁక రెండవ యుదాహరణము హాలండు దేశములో స్థాపింపఁబడిన ప్రజాసత్తాత్మక రాజ్యమంతయుఁ బ్రొటెస్టంటు మతాభిమానముయొక్క ఫలమే యని "డచ్ ప్రజాసత్తాత్మక రాజ్యముయొక్క యభ్యుదయము Rise of the Dutch Republic అను చరిత్రగ్రంథముఁ జదివినవారికిఁ దెలిసిన విషయమే అంతదూరము పోనేల? సాంఖ్యంబును యోగంబును సమన్వయించి సాంఖ్యయోగం బను శాస్త్రంబు నిర్మించి కర్మ బ్రహ్మమీమాంసా ప్రతిపాదితంబు లగు కర్మయోగ జ్ఞానయోగముల నన్వయించి యర్జుననకుఁ గృష్ణునిచే నుపదేశింపబడిన గీతా శాస్త్రంబు గొప్ప వేదాంత గ్రంథంబని హిందువులందఱును బఠించుచున్నారు కాని యీ వేదాంత శాస్త్రంబు అర్జుననుఁ గర్తవ్యాచరణంబునకుఁ బ్రేరేపించి యతనిచే స్వధర్మము ననుష్ఠింపఁజేయలేదా? ఇట్లు నిజమైన మతంబు మనుజుని సంసార పరాఙ్ముఖునిం జేయుటలేదు. కర్తవ్యనిష్ఠనే చేయును. కనుక శివాజి రామదాసచరిత్రము సాంసారికులకును సన్న్యాసులకును ననుకరణీయమే

మహారాష్ట్రదేశములో జన్మించిన భగవద్భక్తులగు సాధువులలో రామదాసొక గొప్పసాధువు మహారాష్ట్రమున ఏకనాధస్వామి, ముక్తేశ్వరుఁడు, నాదోపంతులు, ఆనందతనయుఁడు, వామనస్వామి, తుకారామ్ రామదాసు, మొదలగు సాధువు లనేకులు జన్మించిరి వీరిలోఁ గొందఱు శివాజి కంటెఁ బూర్వపువారు, మఱికొందఱు శివాజీ సమకాలికులు వీరిలో తుకారామ్ అనునతఁడు కోమటికులమువాఁడు ఈ సాధువులను వీరి పూర్వపువారును, తరువాతి సాధువులను మహారాష్ట్రమునందుఁ జేసిన మహాకార్యంబులు చూఁడుఁ:—

1. సంఘసంస్కరణము.—జాతిభేదము లేక భక్తి జ్ఞానవైరాగ్యము లన్ని జాతులవారికిని నీసాధువులు బోధించిరి. జ్ఞానసంపన్నుండు నీచజాతి వాఁడయినను వానిని బ్రాహ్మణసాధువువలెనే సన్మానించిరి. తుకారాము అనుసాధువు వైశ్యుఁడు, నామదేవు శూద్రుఁడు, చోఖామేళా యనువాఁడంత్యజుఁడు. ఈ సాధువు లందఱును బ్రాహ్మణసాధువు లయిన ఏకనాథ, రామదాసు, మొదలయినవారితో సమానమైన గౌరవమును జెందిరి. నేఁటివఱకును బ్రాహ్మణులచే వందనములను గైకొనుచున్న పాండురంగభక్తుఁడగు తుకారాము అభంగము లనఁబడు తనపద్యములలో నిప్పటి మననవనాగరికులవలెనే పాషాణపూజానిషేధము, జాతిభేదనింద మొదలయిన సంగతుల నత్యుత్తమముగా నుపన్యసించియున్నాఁడు. † రామదాసస్వామి భూతప్రేతములయందలి పిచ్చినమ్మికలను ధైర్యముతో ధిక్కరించియున్నాఁడు. ఇట్లీసాధువులు మానవులందఱును సమానులనియు జ్ఞానమే ప్రధానము కాని జన్మము కాదనియు నేర్పిరి.

2. భాషాభివృద్ధి.—ఆంధ్రదేశంబున రాజసాహాయ్యముచే భాషాభివృద్ధియయ్యెను గాని మహారాష్ట్రమున సాధుసాహాయ్యముచే భాష యభివృద్ధిఁ జెందెను. కేవల బ్రాహ్మణులకే కాక జ్ఞానము సర్వజాతులవారికి నొసంగవలయు నని సాధువుల యుద్దేశమైనందున సంస్కృతభాషలో గ్రంథరచనచేసినందున లాభము లేదని తలఁచి వారు మహారాష్ట్రభాషలోని కావ్యముల రచించిరి. ఇందువలననే మహారాష్ట్రకావ్యము లన్నియు

† తెలుఁగువారిలోఁ దుకారామువంటివాఁడు వేమన. వేమనపద్యములలో నున్న సంఘసంస్కరణోపదేశమును మనమింకను నెఱుంగక యుండుటయు మహారాష్ట్ర సాధువుల సంస్కరణవాక్యములను న్యాయమూర్తి రానడేవంటి వారును నభినందించుటయుఁ జూచిన నిప్పటి యాంధ్రులకును, మహారాష్ట్రులకును గలభేదంబును, వారిభాషాభివృద్ధికిని మనభాషావనతికిని గల కారణంబులు తేటపడఁగలవు

భక్తిరసప్రధానములు. ఆదిరసప్రధానకావ్యం బొక్కటియు వసు నా భాషలో లేదు. మన యాంధ్ర పురాతన కవులలో నొక్క బమ్మెరపోత రాజు భగవద్భక్తుఁడు మహారాష్ట్రములోఁ బ్రతికవియు భగవద్భక్తుఁడే. భక్తిప్రేరణచేఁ గాక మఱి యన్యప్రేరణచేఁ గావ్యము చెప్పినవాఁడు లేఁడు. ఇట్లు మహారాష్ట్రములోఁ గవిత చెప్పినందున వీరిని సంస్కృత పండితులు నవ్విరి తురుష్కరాజులు ప్రతిబంధపెట్టిరి, కాని యీశూర భగవద్భక్తు లా బాధల కన్నిటికి నోర్చి యుత్తమ నీతిపూరితంబు లయిన భవ్యకావ్యంబుల నిర్మించిరి ఈ సాధువులు నిర్మించిన కావ్యంబులను గుఱించి న్యాయమూర్తు లయిన మహాదేవగోవిందరానడేగా రిట్లు వ్రాసిరి — "తురకల మతిదురభిమానంబును సంస్కృతపండితుల పరిహాసంబులను లక్ష్యపెట్టక విద్యాప్రీతిచేతను నజ్ఞానులకు నీశ్వరజ్ఞానము సులభముగా లభించునటులఁ జేయవలయు ననెడి నిరపేక్షపరోపకార బుద్ధిచేతను బ్రేరితులై మహారాష్ట్రకవులపరంపర దేశభాషా వాఙ్మయంబును నభివృద్ధిచేసెను పవిత్రరచన గలిగినట్టియు, నున్నతనీత్యుపదేశ పూరితంబయినట్టియు, భక్తిమయ మయినట్టియు నిట్టివాఙ్మయంబు భూతలంబుపై నేదేశంబున కైనను భూషణాస్పదంబె"†

† A succession of Marathi poets, inspired with the love of letters, or with the benevolent and disinterested object of placing the knowledge of God within the reach of the ignorance, cultivated, in spite of the Mahomadan bigotry and the sneers of Sanskrit Pandits, a literature which can well meet the ordinary wants of any people and which for its purity and high line of morality and devotion would do credit to any nation on the surface of the earth.

Justice M. G RANADE

౬. రాజకీయసంస్కారణ:—ఈసాధులు భగవద్భక్తిద్వారా హిందువుల నందఱను నొక్కచోటఁ జేర్చి వారిలో నైకమత్యమును వృద్ధిపఱుచుచుండిరి ఐకమత్యము లేక యెవ్వరికి వారు విడివిడిగా నున్నప్పుడు హిందువులు తురుష్కులుపెట్టినబాధల సహించుటకును ధైర్యముతో వాని నెదిరించుటకును నసమర్థులుగా నుండిరి. కాని భగవద్భక్తుల సాహాయ్యమునే నైకమత్యము గలిగినప్పుడు జను లందఱును స్వమత సంరక్షణమునకు నధికోత్సాహు లైరి.

ఇట్టి సాధుపుంగవులలో రామదాసస్వామి శ్రేష్ఠుఁ డని చెప్పుటకు సందేహము లేదు గోదావరీతీరమం దున్న జాంబ్ అను గ్రామములో నీతఁడు క్రీ. శ. ౧౬౦౮ వ సంవత్సరములో జన్మించెను ఇతని ప్రథమ నామము నారాయణుఁడు రామభక్తుఁ డయినందున నితనిని లోకులు రామదాసు అని పిలువసాగిరి † ఆతనితో సమకాలికులయిన సాధువులలో నితఁడు శ్రేష్ఠుఁ డయినందున నితనికి "సమర్థ" అని బిరుదు గలిగెను, గనుకనే మహారాష్ట్రమున నితనికి "సమర్థరామదాసస్వామి" యని

---

† ఆంధ్రదేశమునో జన్మించిన రామదాసు చరిత్రములోను ఈ రామదాసు చరిత్రములోను గొన్నిసామ్యము (Similarities) లున్నవి ఈ యిద్దఱు రామదాసులును సమకాలికులు ఇద్దఱకును రామదాసు అనిననామము రామభజనవలనఁ గలిగినదే కానీ నామకరణమునాఁడు పెట్టఁబడిన పేరుకాదు మహారాష్ట్రరామదాసు తెలుఁగుదేశమునకుఁ బోయినాఁ డనియుఁ దెలుఁగుకవిత్వము చెప్పినాఁ డనియు నొకకింవదంతి కలదు అందువలన నిద్దఱు రామదాసు లొక్కరేనా యని కొందఱు సంశయించిరి కాని యిద్దఱచరిత్రములలో గొన్ని భేదములు గూడఁ గలవు తెలుఁగు రామదాసుని మూలనామము గోపన్న, మహారాష్ట్రరామదాసుని మూలనామము నారాయణుఁడు ఒక్కఁడు భార్యాపుత్రాదులు గలసంసారి. మఱియొకఁడు వివాహములేనిసన్న్యాసి.

నామము గలదు ఇఁక నీతఁడు మనకథానాయకుఁ డగు శివాజికి గురు వయినరీతిఁ గనుఁగొందము

చిన్ననాఁటనుండియు శివాజికి పురాణశ్రవణమునందు నమితాసక్తి యుండె నని వెనుక వ్రాయఁబడియె. ఆకాలమున తుకారామ్ అను వైశ్య సాధువు హరికీర్తన మను భక్తివిశేషమును మహారాష్ట్రమునఁ బ్రొత్తగాఁ బ్రారంభించెను అతఁడు స్వయముగా నసామాన్య భగవద్భక్తుం డయినందునను సహజకవిత్వ ధోరణి గలవాఁ డగుటవలనను † అతనిహరికీర్తనలు మిగుల శ్రావ్యములయి వినువారి చిత్తముల నాకర్షించి, వారిని విరాగులఁ జేయుచుండెను. ఇట్టి భగవత్కథా శ్రవణము నందు నత్యాదరము కలవాఁడయి శివాజి యెల్లప్పుడును తుకారాము కీర్తనలనే వినుచుండెను తుకారామ్ కీర్తనలనే వినివిని యైహికమునందువిరక్తికలవాఁడయియాసాధుతుకారామువలన నేగురూపదేశమునుబొందనిశ్చయించెను ఇట్లునిశ్చయించియొకనాఁడు శివాజి తుకారామును దనయొద్దకుఁదీసికొనివచ్చుటకుఁ దనయుద్యోగస్థులను ధనధాన్య వస్తువాహనాదికములతోఁ బంపెను. కాని భక్తిభాండారము సంపూర్ణముగ లభించిన యీ పరమభాగవతోత్తమునికి ఆవస్తువాహనాదికములతోను ఛత్రచామరాదికములతోను రాజసన్మానముతోను నేమి ప్రయోజనము? ఆ నిరపేక్ష పాండురంగభక్తుఁడా వస్తువాహనాదికముల నన్నింటినిఁ ద్రిప్పి రాజునొద్దకు బంపి యుద్యోగస్థులతో శివాజిపేర నొకయుత్తరము నభంగము లను వృత్తంబుల వ్రాసి పంపెను అందులో తాత్పర్య మేమనఁగా "మావంటి యరణ్యవాసుల వలన నీకు నేమియు లాభము కలుగనేరదు. నీవలనఁ జెందవలసిన

---

† తుకారము కవిత్వము చెప్పుటకుఁ బ్రారంభించిన కొన్ని దినముల పిదప నిత్యవ్యవహారములోఁగూడ నభంగ మను పద్యములలోనే మాటలాడు చుండె నని చెప్పెదరు.

లాభము మాకును నేమియులేదు. నీవు రామదాసులను గురువు చేసికొన వలసినది, అతనికి శరణుఁ జొచ్చిన నీకార్యసిద్ధి కాఁగలదు ' ఇది తుకా రాము వ్రాసిన యిరువదిరెం డభంగమ్ముల సారాంశము. తుకారాము కేవల వైరాగ్యమూర్తి యైనందునఁ దాను రాజగురువగుటకుఁ దగిన వాఁడను గానని యెంచి రామదాసును గొలువుమని శివాజికి నుపదేశించెను తుకారాము ఉత్తరము చదివి నప్పటినుండియు శివాజి రామదాసును వెదకఁ జొచ్చెను

ఇట్లు శివాజి రామదాసును వెతకుచున్న సమయముననే యటు రామదాసు శివాజి ప్రారంభించిన స్వమతస్థాపన యను సత్కార్యమునకుఁ దానును దోడుపడుటకును తన యుపదేశముచే నాతని దేశాభిమానాగ్నిం బ్రజ్వలింపఁజేయుటకును ఇచ్చగించి యోగ్యసమయమును నిరీక్షింపుచుం డెను ఒకదినము శివాజి వేఁటమార్గమునకై యరణ్యములోనికిఁబోఁగా నక్కడ వృక్షములమీఁద యాకులపై దేశాభిమానమును బుట్టించుకొన్ని శ్లోకములు వ్రాయఁబడియుండెను వానిని జూచి యట్టిప్రాసాదిక శ్లోక ములు వ్రాసిన కవిపుంగవుఁ డెక్కడనున్నాఁడా యని శివాజి వెదకి చూచెను గాని యాశ్లోకములచే శివాజి మనసుపై నేమి పరిణామ మగునో యని చూడఁదలఁచి దాఁగియున్న రామదాసు అతనికిఁ గానిపించినవాఁడు కాఁడు తరువాత శివాజి యెల్లప్పుడును నదే ధ్యానముతో నుండఁగా నొకరోజతనికి రామదాసు నొద్దనుండి యిట్లు శ్లోకమయ మయిన జాబు వచ్చెను —"ఓ మహారాజా! నీ నిశ్చయము మేరువువలె నచలమైనది నీవు ధైర్యమున కాధారము, అనేక జనులకు నాశ్రయస్థలము, రాజయో గివి ఎవనివలన నహోరాత్రములు అసంఖ్యజనులకు నుపకారము కలుగు చున్నదో యతని ఘనతకు సాటికలదా? ఓనరపతీ! నీవు హయపతివి, గజపతివి, దుర్గాధిపతివి, మఱియు ధనాధిపతివి, పురందరుఁడును శక్తియు నీపృష్ఠ భాగంబుననుండి రక్షించుచుందురు రాజా! యశోవంతుఁడవు, కీర్తిమంతుఁడవు, పుణ్యమంతుఁడవు, మఱియు సునీతివంతుఁడవు. దేశ

దేశాంతరములలోని సమాచారములు తెలిసికొనుటలో నీకుఁ గలయనుప
మేయ చాతుర్యమును నీ సువివేకతయు దానశీలతయు, సుశీలతయు
సుప్రసిద్ధములు

"మాతీర్థ క్షేత్రము లన్నియు విధ్వస్తము లయినవి బ్రాహ్మణుల యాగాదిభూము లన్నియు నపవిత్రీకృతంబుల లయ్యె. మతంబు విలుప్తమయ్యె. వృద్ధిక్షయంబాయెను విప్లవపూర్ణంబయ్యె మీ హృదయములోఁ జొచ్చిఁబడి భగవంతుఁడు గోబ్రాహ్మణ సంరక్షణ చేయుటకు మిమ్ముఁ బ్రేరేపించెఁగాత! మతసంరక్షణము చేయుటకుఁ బ్రస్తుతము భూమండలములో నీవంటిరాజు లేఁడు. కేవలము నీప్రయత్నమువలననే హిందూమతము కొంచెమైనను సజీవముగా నున్నది నీసహాయమువలననే యనేక మతకార్యము లనుష్ఠింపఁబడుచున్నవి కల్యాణప్రదుఁడ వగు నో శివరాజా! నీవనేక దుష్టుల సంహరించితివి అనేకుల భయమును నివారించి యభయదాన మొసంగితివి మేమిన్ని రోజులు నీరాజ్యములో నున్నను నీకు జ్ఞాపకము వచ్చిన వారము కాము చింతలేదు నీవు సకలము తెలిసినవాఁడవు, ధార్మికుఁడవు నీకు నధిక మేమి వ్రాయవలెను? మతసంస్థాపనమును చేసినాఁ డనిన కీర్తి నీవే సంపాదింపవలయును జూమా! వివిధ రాజకార్యములలో నిమగ్నుఁడవయి యుండఁగాఁ బిలువని పేరంటము వలె ఈయుత్తరము నీకుఁ బంపినందులకు క్షమింపవలయును"

ఈయుత్తరము చదివి శివాజికి శరీరము పులకాంకితంబయ్యె. తాను జేసిన కార్యములను స్తుతించి చేయవలసిన కార్యములను సూచించు విశేషణంబులఁ జూచి యుత్సాహ పూర్వక స్ఫూర్తియు దేశముయొక్క దీనదశను వర్ణించిన వాక్యములు చదివి యుద్వేగ పూర్వకస్వదేశాభిమానమును "మతసంస్థాపనకీర్తి నీవే సంపాదింపవలయు"నని నయర్థపూరిత వాక్యమువలన నంగీకృతకార్యము నెఱవేర్చుటకు దృఢనిశ్చయము శివాజి మనమునందుద్భవించెను. ఈపద్యములధోక్షజుఁడు,నరరాజ్యములోనాకుల పైని జూచిన నొక్కటయినందున ఆపద్యములను రామదాస కృతములే యని యెంచియతనినిరప్పించుటకు నొకవినయపూర్వక పత్రికతో నుద్యోగస్థులఁ

బంపెను అప్పుడు రామదాసు వచ్చి క్రీ. శ ౧౬౪౯ లో † శివాజికి జ్ఞానోపదేశము చేసెను ఉపదేశసమయమున గురుదక్షిణగా శివాజి తన రాజ్యమంతయు రామదాసున కిచ్చివేసెను; కాని సర్వసంగపరిత్యాగము చేసిన యాసన్న్యాసికి నా రాజ్యమెందులకు? అతడు దిరిగి యారాజ్యమంతయు శివాజి కిచ్చివేసి తనకొఱకయి రాజ్యమేలుమని యాజ్ఞాపించెను. అప్పటి నుండియు రాజ్యము సన్న్యాసిది యని చూపుటకు శివాజి తన రాజ్యముయొక్క పతాకము కాషాయాంబరముతో సుశోభితము చేసెను ఇదియే మహారాష్ట్రుల "భగవాఝెండా" (కాషాయాంబరపతాకా) యొక్క యుత్పత్తి అమితగురుభక్తి గల రాజును, రాజ్యమును వదలివేసిన విరక్తి యగు గురువును ఒకరికంటె నొకరధిక సంస్తవనీయులు గదా!

ఏకాంతవాసము నిచ్ఛయించు రామదాసు శివాజికి గురువయినప్పటి నుండియు సాతారాయొద్ద పరళీ యను పర్వత దుర్గముపై నేకాంతముగా వాసము చేయుచుండెను. అక్కడ తానుండుటవలన ననేకసాధువులు వచ్చుచుఁ బోవుచుండిరి అందుచే నా దుర్గమునకు సజ్జనగడ మని సార్థకనామము ప్రాప్తించెను

గురూపదేశ మైనప్పటినుండియు శివాజి గురువును విడువలేక యతఁ డెక్కడికి వెళ్ళినను దాను నక్కడికిఁ బోవుచుఁ గాలమంతయు నతనియొద్దనే పుచ్చుచు రాజ్యకార్యములయందు నశ్రద్ధ చేయుఁదొడఁగె. అప్పుడు రాజకార్యకుశలుఁడగు రామదాసు శివాజికిఁ గృష్ణబోధిత మగు కర్మయోగము నుపదేశించి కర్తవ్యగతియు, దుష్టనిగ్రహంబును, శిష్టపరిపాలనంబును రాజధర్మంబులు గాని యరణ్యములోఁ దిరుగుట కాదని బోధించి యతనికిఁ దాను రచించిన "దాసబోధ" యను గ్రంథంబొసంగి దానినిఁ దనకు మాఱుగాఁ బారాయణము చేసికొమ్మని చెప్పి

† క్రీ. శ ౧౬౭౨ వ సంవత్సరమున శివాజి రామదాసువలన నుపదేశము బొందె నని మఱికొందఱు వ్రాసియున్నారు.

పంపెను. ఆ సమయమున రామదాసు శివాజీకిఁ జేసినబోధ "శివదిగ్విజయ"మను గ్రంథంబున నిట్లు వర్ణింపఁబడియె:—"యవనులు బహుదినముల వఱకు యథేచ్ఛగా విహరించిరి, వారిని దండించుటకు హిందువులలో నీవంటివాఁ డెవ్వఁడును లేఁడు దుష్టుల యత్యాచారమువలన దేవబ్రాహ్మణుల యుచ్ఛేద మయ్యెను సమస్తధర్మములును భ్రష్టములయినవి దేవభక్తి విలుప్తమయ్యెను. ఈ సంకటకాలమందు నందఱు సుఖము లోపించినది యవనులు బహుదుర్భాషలను వ్యవహరించుచున్నారు. అనేక ప్రకారముల బాధలు పెట్టుచున్నారు వీని నన్నింటిని సహింపలేక రఘుపతి నిన్నుఁ బంపినాఁడు నీవీశ్వరాంశ సంభూతుఁడవు నీవు ప్రజలకు హితము చేయవలయును ఈ సమయమునకు ననురూపమైన మతస్థాపనము చేయుట నీ కర్తవ్యము. మతస్థాపనకొఱకే జీవితమును విసర్జింపుము నిజప్రాణము లర్పించియైనను శత్రునాశము చేయుము వారినిఁ బ్రహారములచే జర్జరీభూతులఁ జేసి వారియొద్దనుండి స్వరాజ్యము తీసికొనుమా మతనీతు లను పునాదిపై రాజ్యము స్థాపించి యది నిర్భయముగాఁ జిరకాల ముండునటులఁ జేయుము. మతమును నీతియు వదలిన నేమి లాభ ముండదు తన మానరక్షణార్థమై ఖడ్గము ధరించి వైరికులము సంహరించిన వానికీర్తి జగత్తంతయుఁ బ్రసరించును (సహాయకులు) అందఱతో మిత్రభావముగా నుండి శూరుల నందఱను జేగు చేయుము ఇట్లయిక్య భావమువలన సుఖము కలుగును.

శివదిగ్విజయము ౪౪౹ పుటము

"నీవు క్షత్రియుఁడవు గాన క్షాత్రధర్మము ననుసరించి రాజ్యరక్షణము ప్రజాపాలనము దేవబ్రాహ్మణులసేవ † మత సంస్థాపనము

---

† "బ్రాహ్మణులసేవ యనినతోడనే నవనాగరకులు నవ్వెదరు గాఁబోలు. కాని పూర్వము విద్యలన్నియు బ్రాహ్మణుల స్వాధీనములో నున్నందున బ్రాహ్మణసేవయన "విద్యాభాండార సేవ" యని పూర్వ మర్థమిచ్చుచుండెననిన మాట జ్ఞాపకముంచుకొనినఁ బూర్వము బ్రాహ్మణసేవ యెంతయావశ్యమో తెలియఁగలదు

(యవనాభావము) చేయుము యవనుల గెలిచి నీవు రాజ్యభారమును గ్రహించుటయే రఘుపతియిచ్ఛ,

(రామదాసస్వామి బఖరు)

ఇట్టి యుపదేశమువలన శివాజికి నమితోత్సాహముగలిగి యతఁడు నంగీకృతస్వరాజ్యసంస్థాపన కార్యము మిగుల శ్రద్ధతోఁ జేయసాగెను.

రామదాసు రాజ్యధర్మముల సంపూర్ణముగా నెఱిఁగిన వాఁడు గావునఁ దనదాసబోధ యను గ్రంథమునందలి రాజ్యప్రకరణములో రాజ్యమును నడుపువిధము, రాజధర్మములు, ప్రజలు సుఖులై రాజభక్తి గలవారుగా నుండునటులఁ జేయు నుపాయములు, సామదానభేదదండములచే నరిని గెలువవలసిన విధమును జితశత్రువుల నాదరించి ప్రేమభావముతో వారిని వశపఱుచుకొను మార్గములను మొదలయిన శకకర్తలకుఁ గావలసిన ధర్మములను కడునేర్పుతో నాతఁడు వర్ణించి యున్నాడు ఈ గ్రంథముయొక్క యీ యొకభాగమే కాక కడమ గ్రంథమంతయు ననుభవపూర్ణమును, ఇమృతము చిప్పిలునట్లుగ నుండును గ్రంథవిస్తరభీతిచే నందలిభాగముల భాషాంతరము వ్రాయనొల్ల

ఉచ్ఛృంఖలత్వము మదోన్మాదము, కారణములేనిది రక్తపాతము చేయుట, శత్రుస్త్రీల నవమానించుట మొదలయిన దుర్గుణములు వీరపురుషులకు సామాన్యములుకాని రామదాసుస్వామియొక్క యోగ్యరాజధర్మోపదేశమువలన శూరుఁడైన శివాజియందు నిందలి యే దుర్గుణంబులును గానరాకయుండెను. శివాజిచేసిన యుద్ధములన్నియు ధర్మకల్పనలతోడను దేశాభిమానముతోడను నిండియుండినను ఆరౌద్రరసనమయము నందును శాంతరసమును విడిచినవాఁడు కాఁడు కొందఱింగ్లీషు చరిత్రకారులు వ్రాసినట్టును మఱికొందఱు తురుష్కులు వ్రాసినటులను శివాజి యుద్ధములు బందిపోటులుకావు సిడ్నేఓవెన్ (Sydney owen)అను గ్రంథకారుఁడు తన "యాంగ్లేయ విజయప్రభాత సమయమునందలి హిందూదేశము" [India on the Eve of British conquest

అను గ్రంథమునందు శివాజియొక్క యుద్ధములను గురించి యిట్లు వ్రాసియున్నాఁడు "శివాజీయు నతని సైన్యంబులును జేయు యుద్ధములలో వారు కేవలము బందిపోటువారివలె వర్తింపలేదు శౌర్యప్రభయు స్వదేశాభిమానమును స్వమత శ్రద్ధయు వారుచేయు కార్యములయందుఁగానవచ్చుచుండెను ఈ గుణములుచూచియే వారు [మరాటా సైనికులు] శహాజీ కొమారుని [శివాజిని] ఈశ్వరసంకేతముచేతను ఈశ్వరప్రేరణచేతను తమ్ము పరబాధనుండి విముక్తులఁ జేయవచ్చిన యవతారపురుషునిగా నెంచిరి. శివాజియు నతని ప్రథమసహచరులును దామిట్లు తురకలతోఁ బోరాడుటవలనఁ దాము మతహితమును లోకహితమును జేయుచున్నామని నమ్మిరి అట్లు వా రనుకొనుట సయుక్తికమే"†

ఇట్లిఁకమీఁద శివాజియొక్క జీవితములో నెచ్చటఁజూచినను రామదాసుచిహ్నాలు గానుపించును ఈ సాధుపుంగవుని చరిత్ర యత్యంతరమ్యమైనది కాని యిచ్చట నధికము వ్రాయుటకు వీలులేదు. ఆయన చేసిన యుపదేశములలో నొకటి రెండు ఈ క్రింద నిచ్చి యీ భాగము ముగించెదము

"ఇఁక దుర్లభమైన క్షాత్రధర్మమెట్టిదో వినుము, మృత్యువునకు భయపడువాఁడు క్షాత్రధర్మమును అవలంబింపఁగూడదు ఇట్టివాఁ డన్య

---

† Shivaji and his people even in their warfare by no means were mere bandits A halo of hereism, patriotism and religious zeal invested their proceedings and induced them to regard the son of Shahaji as a predestined, devinely favoured, indeed as an inspired deliverer. † † † Both Shivaji and his original followers might well hold and did hold that in waging war after their own fashion with the Mosalmans, they were doing both God and man good service."
*India on the Eve of British Conquest pp 129-130*

మార్గములవలనఁ బొట్టనింపుకొనుటయే మేలు పగఱకువెన్నిచ్చువానికి నిహమునందు దుష్కీర్తియుఁ బరమునందు నరకంబును గలదు. యుద్ధములో శత్రువులఁ జంపుచుఁ జంపుచు మృతుఁడైన వానికి సద్గతిగలదు. శత్రుహననముచేసి యింటికి వచ్చిన వీరుఁడే సౌభాగ్యముల ననుభవించుటకు యోగ్యుఁడు ఫిరంగిలోని యినుపగుండు నిర్భయముగా శత్రుసైన్యమధ్యమునకుఁ బోయినట్లు శత్రువులలోనికి భయమువిడిచి పోవలయును. పురుషుఁడు సాహసమును బరిత్యజింపఁగూడదు కాని దేశకాలపాత్రవివేచన చేసి సాహసము ప్రకటింపవలయును "

"అనేకజనుల నొక్కచోటికిఁ గూర్పవలయును వారికి సువిచారము నేర్పవ యును. మిక్కిలి సాహసముతో శత్రువులమీఁకి దండువెడలవలయును సంపాదించిన రాజ్యమును రక్షించుకొనవ లయును. తరువాత అధికరాజ్యము సంపాదింపవలయును ఇట్లు జగత్తంతయు మహారాష్ట్రరాజ్యము స్థాపించవలయును ' అని శివాజితో జెప్పెను.

"శివరాజు [శివాజి] యొక్క రూపమును, దీర్ఘాలోచనలును, ప్రతాపమును జ్ఞాపకముంచుకొనుము " †

ఇట్లిఁకమీద శివాజి చేసినయన్ని కార్యములకును ముఖ్య సూత్రధారుఁడైన రామదాసునకును శివాజికిని గలిగిన గురుశిష్యసంబంధము వర్ణించి మూలచరిత్రమునకుఁ బోయెదము

---

† ఈ వాక్యము శివాజి కొమారుఁడైన సంభాజికి రామదాసు చేసిన యుపదేశములోనిది

# ఆఱవ ప్రకరణము

## అఫజుల్ ఖానుని వధ

శివాజి విజాపూరు రాజ్యములోని కోటలను స్వాధీన పఱుచుకొను చున్నాఁడనియుఁ దిన్నతిన్నఁగా రాజ్యమంతయు దోఁచుకొనుచున్నాఁడనియుఁ దనయొద్ద సైన్యమును భాండారమును దినదినమును వృద్ధిపఱుచు చున్నాఁ డనియుఁ దన్డ్రిచేసిన యుపదేశములను లక్ష్యపెట్టక యవన ప్రభుత్వమును నాశముసేయఁ దలంచినాఁడనియు శివాజిచర్యలను గుఱించి వెంటవెంట వచ్చు సమాచారముల వలన విజాపూరు నవాబును అతని భార్యయు నక్కడి సరదార్లును నిశ్చయముగాఁ దెలిసికొనిరి ఇఁకమీఁద శివాజిచర్యలయెడ నుపేక్షాభావముతో నుండిన రాజ్యమునకు మోసము వచ్చునని తలఁచి నవాబు శివాజిని నోడింపుటకయి యొక గొప్ప సైన్యముఁ బంపనిశ్చయించెను అప్పుడు అఫజుల్ ఖాన్ అను నొక వృద్ధామాత్యుఁడు "శివాజి యన మన కొక లక్ష్యమా? మీయాజ్ఞ యైన యెడల నాదొంగఱేనిఁ బెడఱెక్కలు కట్టి యేలినవారి యెదుటకుఁ దేఁగలను" అని గర్వవాక్యములను బలికెను, అప్పుడు నవాబామాటలకు సంతసించి యతనివెంట నైదువేల గుఱ్ఱపు రౌతులను, ఏడు వేల కాల్బల మును, మంచిఫిరంగులను, గావలసినంత సామగ్రియు నిచ్చి యాయఫ్ జుల్ ఖానుని శివాజి పైకి దండుపంపెను. అతఁడు వర్షాకాలము ముగియఁ గనే క్రీ శ ౧౬౫౯వ సెప్టెంబరు నెలలో మహావైభవముతో దండ యాత్ర వెడలెను, పూనాపట్టణమునకుఁ దిన్నఁగాఁ బోక యఫ్ జుల్ ఖానుఁడు త్రోవలోనున్న పట్టణములను దోఁచుకొనసాగెను. తుళుజాపూరు పండరపూరు మొదలయిన హిందూక్షేత్రములను గొల్లగొట్టి, యచ్చటి దేవాలయముల నన్నింటిని బాడుచేసెను.

శివాజి రాజగడ మనుకోటలో నుండెను అఫ్జుల్‌ఖానుఁడు ప్రచండ సైన్యముతో వచ్చుచున్నాఁడని విని శివాజి రాజగడము నుండి బయలుదేఱి ప్రతాపగడ మను బలవంతమైన దుర్గమునకుఁ బోయెను. ప్రతాపగడ మనుకోటకుఁ జుట్టు నరణ్యముండుటవలన నది శత్రువులకు దుస్సాధ్యంబై యుండె. శివాజి తనసరదారుల నందఱను బిలిపించి సభ చేసి భయంకర శత్రువును నెదిరించు నుపాయంబుల నిశ్చయించెను. చుట్టుపట్ల నుండు సైన్యంబుల నన్నింటినిఁ బోగుచేసెను జింజిరామీఁదికిఁ బంపిన సైన్యంబులఁ బిలిపించుకొనెను దుర్గముల నన్నింటిని బాగు చేయించెను శివాజి యరణ్యములోని ప్రతాపగడమునకుఁ బోయినాఁడని విని యఫ్జుల్‌ఖాను పునాపట్టణమునకుఁ బోవుట మాని ప్రతాపగడమునకుఁ బోవసాగెను అతఁడు వాయీ యను క్షేత్రమునకుఁ బోయి యక్కడి దేవాలయాదులను, జనులను దోఁచుకొనెను శివాజి చొచ్చి యున్న యరణ్యప్రదేశము బహుదుర్గమమైనది యని యచ్చటఁ బూర్వము సుబేదారుగా నున్న యఫ్జుల్ ఖానునికిఁ దెలిసి యున్నందున యుద్ధము చేసి శివాజిని గెలుచుట యసాధ్యం బని యెంచి యాతఁడు యుక్తిచేతను మోసముచేతను శత్రుని గెలువ నిశ్చయించెను ఇటు నమ్మించి శివాజిని భంగపఱుపఁదలఁచి యాయవనవీరుఁడు దత్తాజీ గోపినాథుఁడను †పంతులను బ్రాహ్మణుని శివాజియొద్దకుఁ బంపెను.

అటు ఖానుఁడు మోసము చేయఁదలఁచినటులనే యిటు శివాజియు ఖానుని మోసపుచ్చ నిశ్చయించెను ఆతఁడు ఖానున కిట్లు వార్త లంపుచు వచ్చెను "మీవంటి శూరసేనానితోఁ బోరునంత సామర్థ్యంబు మాకు

---

† నానాఫడనవీసునకు సమకాలికుఁడును అతనికిఁ బ్రబలప్రతిస్పర్ధియు మహారాష్ట్ర దేశమునందు జన్మించిన రాజ్యకార్యధురంధరులలో నొక్కండును నగు సఖారామ పంతు బోకీలునకు నీదత్తాజీగోపీనాథుండు మూలపురుషుఁడు.

లేదు మే మనేకాపరాధములఁ జేసినందున నవాబుగారికి మాయెడ మిక్కిలి కోపము కలిగియున్నది అయినను మీవంటివారు నాయెడల నను గ్రహము పుట్టునటుల నవాబుతోఁ జెప్పినయెడల నా యపరాధము లన్నియు వారు క్షమింపఁగలరు. మీరు నాయందనుగ్రహము కలుగు నటుల నవాబుతోఁ జెప్పెడి యెడల నే నీ రాజ్యమంతయు దేవరవారి స్వాధీనము చేయుటకు సిద్ధముగా నున్నాను" ఇట్టివార్త లంపుచుఁ దాను జేయవలసిన సన్నాహము చేసికొనుచుండెను. ఇంతలో ఖానునియొద్ద నుండి మరాటరాయబారి వచ్చినాఁ డని విని శివాజీ వాని నెదుర్కొనుటకై దుర్గము దిగి ఫాడ్ అను గ్రామమునకు వచ్చెను. ఇద్దఱు కుశలప్రశ్న లయిన తరువాత రాయబారి ఖానుఁడు నీ కిట్లు చెప్పుమనె నని శివాజీతో నిట్లనియె:—"మీతండ్రి యైన శహాజీకిని నాకును అనేక సంవత్సరముల నుండి స్నేహమయినందున నీ యెడల నాకు స్నేహభావమే కాని వైర భావము లేదు నీ కనుకూలముగా సులతానుతోఁ జెప్పి నేను నీవు గెలిచిన కొన్ని యూళ్ళు నీకు జాగీరుగా నిప్పింపఁగలను." అందుపై శివాజీ యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను "ఖానుసాహేబుకు నాపైఁ బ్రేమయున్న దనియు వారు నాకుహిత మెన్నఁడును జేయ రనియు నాకుఁ దెలియును. ఖానుసాహేబుగారు చెప్పినటుల మాకు జాగీరులు దొరకునెడల నవాబు యొక్క యాజ్ఞలో నుండుటకు నాకు నే యభ్యంతరము లేదు. నేను మొదటనుండియు నవాబుయొక్క యాజ్ఞాధారకసామంతుఁడను గనుకనే యనేక రాజద్రోహులగుపాళేగారుల రాజ్యములనునవాబుకై నేనుసంపా దించినాఁడను. ఆ రాజ్యమంతయు నవాబున కియ్యఁగలను" మొదటి రో జిట్లు సంభాషణ జరిగి యా రాయబారి బసకు వెళ్ళెను

రాయబారి వెళ్ళిన తరువాత శివాజీ తనమీఁదికి వచ్చిన మహాసంక టము నెట్లు తప్పించుకొనవలయునో యని విశేష చింతాక్రాంతుఁడయి యుండెను. అప్పు డాతఁడు తన యిష్టదేవత యగుభవానినిఁ బ్రార్థింపఁ బోడఁగె. ప్రార్థింపఁగా నతని దేహమునందు దేవి ప్రవేశించి "వత్సా! నీకింత చింతయేల? నీకు నా యనుప్రసాదము గలదు నీసంకటములు

వన్నింటిని దూరము చేయఁగలదాన"నని పలికెనఁట † దేవివచనములు విన్నతోడనే సరదారులందఱును మఱింత ధైర్యముగలవారయిరి. శివాజియు నధికోత్సాహముతో ఆ రాత్రి హిందువును బ్రాహ్మణుఁడును నైన రాయబారి బసకుఁ బోయెను. అదివఱకు రాయబారి యొక్కయు, రాయబారి వెంట వచ్చినవారియొక్కయుఁ బరామర్శ బహుశ్రద్ధతోఁ జేయుచుండిరి. కాని రాయబారియొక్క బస యతనివెంట వచ్చిన మనుష్యులు దిగిన చోటికి దూరముగా నుండునట్టుల నేర్పాటు చేసి యుండిరి. అట్టి రహస్యస్థలమునకుఁబోయి రాయబారికిఁ దియ్యనిమాటలుచెప్పి యుక్తిప్రయుక్తిచే అఫ్జుల్ఖానుని మనసులో నున్న ద్రోహేచ్ఛ యతనివలనఁ దెలిసికొనెను. ఈ యుక్తిచే మోసపుచ్చి శివాజినిఁ బట్టుకొని పోవలయుననియు, వీలయినయెడలఁ జంపవలయుననియు అఫజుల్ఖానునికి నిచ్ఛకలదని యీ రాయబారివలన శివాజీ తెలిసికొనెను. అప్పుడు శివాజీ యా రాయబారి మనసు తనకు ననుకూలముగాఁ గరఁగింపవలయు నని యతనితో నిట్లనియె—"ఖానునిమనసు నిర్మలముగా లేదు. మీరు బ్రాహ్మణులు. మాకు దేవతలు. గోవులుబ్రాహ్మణులు అతివంద్యులు. యవనుల బాధనుండి గోబ్రాహ్మణుల సంరక్షణ చేయుటయు, హిందూ మతమునకుఁ బ్రాప్తమైన దుర్దశను నివారించుటయు, హిందూ స్వరాజ్యము స్థాపించుటయు, మా ముఖ్యోద్దేశములు గనుక మీరీ సత్కార్యమందు నాకు సహాయంబు చేయవలయును. ఈ కార్యమునకై "హివరే" యనుగ్రామము వంశపరంపరగా జాగీరియ్యఁ గలము" ఇట్లు చెప్పినమాటలు విని

---

† శివాజీ దేహమునందు దేవి ప్రవేశించి ధైర్యపుమాటలు చెప్పినసంగతి యన్ని మహారాష్ట్రబఖరీలలోను వ్రాసియున్నది. ఇది శివాజీయొక్క యుక్తులలో నొక యుక్తియని తోఁచెడిని. అప్పటి సైనికులందఱును సరదార్లందరును పిచ్చినమ్మకములు గలవారయినందున మహాసంకట సమయములందు వారికి ధైర్యము కలుగుటకై తనయందు భవాని ప్రవేశించి భవిష్యము చెప్పునని తెలుపుచుండెను. ఇట్టి సంగతులకు రామదాసస్వామివారును సమ్మతించుచుండిరని తోఁచెడిని.

కొంత మతాభిమానమువలనను, గొంత యాశచేతను, ఆ రాయబారి మనసు కరఁగెను అప్పుడు శివాజికిని, ఆ రాయబారికిని, గొంతసంభాషణ జరిగి రాయబారి యిట్లనియె "అఫజుల్‌ఖాన్ మహాదుర్మార్గుఁడును, గప టియు అయినను దనతో బుద్ధిపై భవమున సమానుఁడు లేఁడని యతనికి మిక్కిలి గర్వము కలదు కాన నతనిని నమ్మించి భంగపఱుపవచ్చును అతనిఁ గోటక్రిందికి రమ్మనినను వచ్చును" ఇట్లాతఁడు చెప్పఁగా శివాజి తనకు విశ్వాసపాత్రుఁడగు కృష్ణాజిభాస్కరుఁ డనువానిని బిలి పించి ముగ్గురును యోజించి, మోసపుచ్చ వచ్చిన ఖానుని కోటక్రిందికి యుక్తిచేఁ బిలిపించి మోసపుచ్చి పంపవలయు నని శ్చయించిరి ఇట్లు నిశ్చయించి వారు తమతమ బసలకుఁ బోయిరి.

రెండవనాఁ డందఱు చూచుటకునై శివాజియు రాయబారియు నొకరినొకరు కలసికొని రాయబారపుమాటలు మాటలాడినటుల నటిం చిరి. తరువాత రాయబారి యక్కడనుండి వెడలెను అతనివెంట శివాజి తనరాయబారి యని కృష్ణాజి భాస్కరునిఁ బంపెను. వారిద్దఱు వాయీ యనుపట్టణములో అఫజుల్‌ఖానుని కలిసికొనిరి పంతాజీగోపీనాథుఁడు (ఖానుని రాయబారి) ఖానునకు శివాజిని గుఱించి కొన్ని సంగతులుచెప్పి యిట్లనియె. "శివాజి సామర్థ్య మెంతః మనసైన్యమును, బరాక్రమ మును, జూచి యాతఁడు భయపడి పోయినాఁడు. గాన నతనికి నభయ మొసంగినయెడల నాతఁడు తనంతటఁదాను మనస్వాధీన మగును. మిమ్మును స్వయముగావచ్చి చూడవలయు నని యతనికి నిచ్చగలదు కాని యాతఁడు పిఱికి యైనందున నిమ్మ యిక్కడికిఁ రాఁజాలకున్నాఁడు. మీరే కోట క్రిందికి వెళ్ళినయెడల నాతఁడు దప్పక తమదర్శనమునకు రాఁగలఁడు ఒకసారి మీరొకరినొకరు చూచుకొనువఱకే యతనికిఁ గొంచెము భయము కలిగియుండును ఒకసారి యాతఁడు మిమ్ముమ జూచి మాట లాడినయెడల నాతనికి మీయెడల నమ్మిక కలుగును అందు పై నాతఁడు మనశిబిరములోనికిఁ గూడ రాఁగలఁడు" అఫజుల్‌ఖానునికిఁ దన తెలివితేటలను గుఱించియు, చాకచక్యములను గుఱించియు, మొద

టనే యధికగర్వముండెను అందువలన వకీలు (రాయబారి) చెప్పినమాట లన్నియు నాతఁడు నమ్మెను. ఇదియుఁ గాక యామోసగాఁడు తనమనంబున నిట్లు తలంచెను.—"శివాజీ పంపిన వర్తమానము చూడఁగా నాతఁడు వచ్చి స్వయముగా నాస్వాధీన మగునట్లుఁ దోఁచుచున్నది తనంతట తానే నాచేతిలోఁ జిక్కనియెడల నొకసారి నమ్మి నాయొద్దకు వచ్చిన యా పొట్టిమరాట సరదారును నేను పోనిత్తునా? దీర్ఘదేహుఁడను, దీర్ఘబాహుఁడనగు నా కౌఁగిలింతలోఁ జిక్కినయెడల నాతఁ డెక్కడికిఁ బోఁగలవాఁడు?" ఖానుఁ డిట్లుతలంచెనేగాని తానుపంపిన రాయబారియే శివాజిలోఁ గలసియున్నాఁ డనిన సంశయము గర్వనిమగ్నుఁ డగునాతనికిఁ గలిగినదేకాదు, ఇట్లు తలంచి ఖానుఁడు దుర్గముక్రింద శివాజిని గలిసికొనుటకు సిద్ధుఁ డయ్యెను. మిగుల కష్టముతోఁ దనసైన్యమంతయు జావళియను పర్వతప్రదేశమునకు నెక్కించి యక్కడ మహావైభవముతో విడిసెను. అంతకుఁ బూర్వమే శివాజి ఖానుని యేనుఁగులకును గుఱ్ఱములకును బంటులకును కావలసిన వస్తువులన్నియు దొరకునటుల నేర్పాటులుచేసి యుండెను అందునకు ఖానుం డెంతయు సంతసించెను.

ఇటు శివాజి ప్రతాపగడముక్రిందఁ గొన్ని వృక్షములు కొట్టించి గొప్పయంగణము చేసి యందు ఖానునిఁ గలియుటకై యొక్క భవ్యమైన మంటపము నిర్మించెను ఆ మండప మంతయుఁ జిత్రవిచిత్రములైన చక్కని పదార్థములతో నలంకరింపఁబడెను సైనికులు, సైన్యాధిపతులు సరదారులు మొదలయినవారు వారివారి యధికారముల ప్రకారము-గూర్చుండుటకై వేఱువేఱుస్థలములు నిర్మింపబడియె. ఖానుని సైనికులు కొందఱు వచ్చి యద్వితీయముగా నలంకృతంబైన యామండపంబుఁ జూచి మిగులసంతసించి యజమానియొద్ద శివాజిని మిక్కిలి కొనియాడిరి.

ఇట్లు పైకి ఖానునియనుగ్రహము గోరువానివలె నటించుచు నతనిని మోసపుచ్చుటకు శివాజి కొన్ని యుక్తులు పన్నెను. చుట్టు నున్నయడవిలో నక్కడక్కడఁ దనసైనికుల నుంచెను అఫజుల్‌ఖానుఁడు వచ్చుటకుఁ గొన్ని చెట్లుకొట్టి చేసిన త్రోవ తప్ప యితరత్రోవ లన్నియు మూసి

వేయించెను. కొంకణదేశమునుండి వచ్చిన నేతాజీపాలకరుని నతని ప్రచండ సైన్యముతో దుర్గమునకుఁ దూర్పుదిక్కున నునిచి విజయసూచకంబగు శృంగధ్వని వినినతోడనే యడవిలో నుండి వెడలి సమీపమున నున్న తురకలసైన్యముపై నెకాయెకి పడి నాశము చేయవలసినది యని యాజ్ఞాపించెను. పేషవా యగు మోరోపంతును బిలిపించి సైన్యముతో నరణ్యములో దాఁగియుండు నట్టును, కోటపై నైదుఫిరంగులధ్వని యైన తోడనే జావళియొద్ద నున్న యవనసైన్యమును జెండాడునటుల నియమించెను.

ఇటుల శత్రుసైన్యములను నొక్కసారి చెండాడు నుపాయంబులు చేసియు రాజ్యకార్యకుశలుండగుటచే శివాజీ తనకే యొకవేళ మోసము సంభవించినయెడలఁ దనసైనికులు చేయవలసిన కార్యములను గూడ నిర్ణయించెను తాను బడినప్పటికిఁ దాను ప్రారంభించిన కార్యమునకు భంగము కలుగకుండ మహారాష్ట్రరాజ్యము నడుచునటుల నేర్పాటులఁ జేసెను దుర్గముయొక్క ప్రతిద్వారమునందును దగినసైనికుల నుంచెను సింహద్వారములో గొప్పగొప్ప సరదార్లను రెండువేల సిబ్బందియు నిలిపెను పేషవాను ఇతరసరదారులను బిలిపించి తనతల్లియగు జిజాబాయిని కొమారుఁ డగు సంభాజిని వారికి స్వాధీనపఱిచి యిటులఁ జెప్పెను — "మే మీజూదము ప్రారంభించినారము ఇటగునో యటగునో; శ్రీకృపచే యశంబు గలుగును ఒకవేళ నాకేమైన మోసముకలిగెనేని మీరు ధైర్యము వదలక నేను నియమించిన ప్రకారము శత్రుమథనము చేయవలయును.

ఖానునిఁ గలియఁ బోవలసిన దినము వచ్చెను. ఆ దినముప్రొద్దున లేచి శివాజీ మంగళస్నానము చేసి దేవబ్రాహ్మణులకు నమస్కరించి, తల్లియగు జిజాబాయికి నమస్కరించెను. అప్పు డాయమ కుమారుని దీవించి యిట్లనియె. "ఈదుష్టుఁ డగుఖానుఁడు నీయన్నయగు సంభాజిని మోసపుచ్చి చంపెను ఆ పగ తీర్చికొనుము దేవీభవాని నీకు యశంబు నొసంగునుగాక" ఇట్లు వీరమాతవచనంబులు విని యావీరపుత్రుండు పులకాంకితాంగుం డాయెను

# ఆఱవ ప్రకరణము

తరువాత శివాజి కవచమును ధరించి దానిపై నంగి [illegible]యునవి తొడుగుకొనెను శిరమున శిరస్త్రాణము ధరించి యందుపైని పాగా పెట్టికొనెను కుడిచేతిలో నంగిచాటునఁ జిన్నకత్తి దాఁచికొని యెడమ చేతిలోఁ బులిగోళ్ళు దాఁచియుంచెను ఇట్లు కోటదిగి వెళ్లుటకు సిద్ధుఁడై శివాజి ఖానునకిట్లు వర్తమాన మంపెను "మే మిక్కడినుండి సభాస్థలమునకు బయలుదేఱు చున్నాము. మీ రక్కడినుండి బయలుదేఱి రావలసినది."

ఇట్లు వార్త వచ్చినతోడనే ఖానుఁడు పదునేనువందల గుఱ్ఱపు రౌతులఁ దీసికొని శివాజిని గలసికొన బయలుదేఱెను అతఁడు కోటకొక యరమైలు దూరమున నుండఁగా నతనిరాయబారి యగు పంతాజిగోపీనాథుఁడు వచ్చి "ఇంత గొప్ప సైన్యముతో వెళ్ళినయెడల శివాజి బెదరఁ గలఁడు, అతఁడు భయముచే మిమ్ముగను గలసికొనఁడు కాన మీరీసైన్యం బంతయు నిక్కడనేయుంచి యొక సశస్త్రుఁడైన భటుని వెంటదీఁసికొని పల్లకిలోఁ గూర్చుండి సభాస్థలంబునకు వెళ్ళవలయు నని నా యభిప్రాయంబు" అని చెప్పెను. ఖానునకుఁ దనసామర్థ్యంబునందపరిమితమైన విశ్వాసముండెను తన కత్యంతశక్తి గలదనియుఁ దనకంటె మోసమునందు గట్టివా రెవరును లేరనియు నతనికి గర్వ ముండెను. గానఁ దాను మోసపుచ్చుటకు మాఱుగాఁ దన్నే శత్రువు మోసపుచ్చు ననినమాటయే యతనికిఁ దోఁచినదికాదు. శత్రువుచేతఁ జిక్కుచున్నాఁ డనినయాశచే నంధుండయిన యాయవనుఁడు అపనమ్మక మన్నమాట యెఱుంగక, స్వరక్షణమునకై సాధారణముగానందఱు చేసికొను నేర్పాటుల నైనను లక్ష్యపెట్టక, తన రాయబారియేశత్రునిచే భేదింపఁబడియె ననిన సంశయంబైనను లేక, యారాయబారి చెప్పినటుల నాతఁడు నడచు కొనుచుండెను.

రాయబారి చెప్పినటుల నొకభటునితో అఫజుల్ ఖానుఁడు సభాస్థలమునకుఁ బోయెను కాని యదివఱకు శివాజి యక్కడికి రానందున ఖానుఁ డధైర్యపడి శివాజి యెక్కడ నెక్కడ నని యడుగఁజొచ్చెను.

ఇంతలోఁ గోటక్రిందికి నొక్కబంటుతో దిగుచున్న శివాజిని జూచెను. అతని వెంట నున్నవాఁడు తానాజిమాలసురే యను శూరవీరాగ్రేసరుఁడు. ఈ తానాజి నడుమునకున్న రెండుఖడ్గములు తప్ప శివాజివెంట నేమియు శస్త్రము లేనటుల ఖానునకుఁ గాన్పించెను. శివాజి సభాస్థలమునకు వచ్చియు ఖానునికి మిక్కిలి భయపడి యతని యొద్దకు వచ్చుటకు సందేహించు చున్నటుల నటించెను అదియే యొకకారణముగాఁ గైగొని రాయబారి యగు పంతాజి గోపీనాధుఁడు మీయొద్ద శస్త్రధరుఁడై యున్నభటుని జూచి శివాజి మీ యొద్దకు వచ్చుటకు సంశయించుచున్నాఁ డని అఫజుల్ఖానునితోఁ జెప్పి యాభటుఁడు కొంతదూరముగా పెళ్ళునటులఁ జేసెను తన యాజానుబాహు శరీరము ముందట శివాజియొక్క వామన మూర్తి యొక లెక్కలోనిది కాదని తలంచుచుఁ దనయొద్దకు రా వెఱచుచున్న శివాజియొక్క పిఱికితనమునకు నవ్వుచు ఆయవనుఁడు తనరాయబారి చెప్పినటులెల్ల నడచుచుండెను బంటు తొలఁగినవెంటనే శివాజి ఖానుని యొద్దకు రాఁ దొడఁగెను. అఫజుల్ఖానుఁడు ప్రత్యుత్థానం బాచరించి రెండుమూఁ డడుగులు ముందునకుఁ బోయి శివాజిని గలిసికొనెను. ఒకరినొకరు కుశలప్రశ్న లడుగుకొని మిత్రభావమును వెల్లడించుటకై వా రొకరినొకరు కౌఁగిలించుకొనిరి ఇంతలో అఫజుల్ఖానుఁడు దన్నుఁ జేతితో ముందునకుఁ దీసి యెడమ చేతిక్రింద నొత్తిపట్టినాఁడనియు నిఁక కొంచె మాలస్యము చేసినయెడల ఖానుఁడు దన్ను బాకుచేఁ బొడుచుననియు చూచి శివాజి తనయంగచాపల్యముచేతఁ దనశరీరమును వానికౌఁగిటనుండి తప్పించుకొని తన చేతిలో దాఁచికొనిన పులిగోళ్ళు ఖానుని పొట్టలో గ్రుచ్చెను ఖానుఁడు వెంటనే పెద్దపెట్టున, మోసమురా మోసము ' అని యఱచెను, తన యొఱనుండి కత్తితీసి శివాజి శిరస్సుపై దెబ్బ వేసెను. కాని శిరస్సుపై శిరస్త్రాణమున్నందున గోధుమగింజ త కాటు పడునంత దెబ్బయే శివాజికిఁ దగిలెను. ఇట్లా దెబ్బ తప్పించుకొని శివాజి తన కత్తిదూసి ఖానుని భుజముపై దెబ్బతీయగా నాతనిశరీరమునందుఁ

గవచము లేనందున నా కత్తి యాయవనుని గర్భమునం బడె. ఎగెను వెంటనే అఫజుల్‌ఖానుఁడు గతప్రాణుఁ డయ్యెను. ఈ సాహసమును గని పట్టి ఖానుని వెంటనున్న సయ్యద్ బందు అనువాఁడు శివాజీపైకిఁ దఱుముకొనివచ్చెను. కొంతవఱకు స్వామిభక్తుండు శివాజీతోను తానాజీతోను బోరాడి స్వామినిమిత్తంబు దేహంబు సమర్పించెను. ఈ భటునితో వీరిద్దఱుఁ బోరాడునపుడు పాలకీ మోసికొని వచ్చిన బోయీలు అఫజుల్ ఖానుని ప్రేతమును పల్లకిలో వేసికొని తీసికొనిపోవసాగిరి. కాని దానికిఁ గొందఱు మరాటసరదారు లడ్డపడి ఖానునిశిరస్సుఁ గోసికొని కోటపైకిఁ దీసికొని పోయిరి.

ఇన్ని కార్యములు జరుగువఱకు మూఁడుజాములవేళ యయ్యెను. శివాజీ సుఖముగాఁ గోటపైకిఁ బోయినతరువాత సంకేతప్రకారము ఫిరంగులు వేయించిరి శృంగములు నూఁదించిరి. ఈ శబ్దములు విన్నతోడనే నలుదిక్కుల నుండియు మరాటావీరు లడవినుండి బయలుదేఱి ఖానుని సైన్యముపైఁ బడిరి. ఖానునిసైనికులకు గుఱ్ఱముల నెక్కుటకుఁగాని, శస్త్రముల నవరించుకొనుటకుఁగాని, వ్యవధి చిక్కినదికాదు. అన్ని దిక్కుల నుండి మరాట సైనికులు చెండాడుట వలన భయభ్రాంతులై యవనవీరులు పాఱిపోవఁజొచ్చిరి. కోటకు సమీపమునందున్న పదునైదువందల సైన్యమును నేతాజీ పాలకరుఁ డనువీరుఁడు ఘోరముగా సంహారించెను. కాని "శత్రువులు మన కప్పగించి శరణుచొచ్చిన శత్రుసైనికులఁ జంపక రక్షింపవలయును, అనావశ్యముగా రక్తపాతము చేయవలదు' అని శివాజీ వార్త యంపినందున జావళిపైపున నున్న ఖానుని సైన్యమును మోరోపంతు పింగళే యంతగాఁ జెండాడినవాఁడు కాఁడు. విజాపురము నుండి వచ్చిన ప్రచండసైన్యం బిట్లు చెల్లాచెదరైనందున శివాజీకి నసంఖ్య ద్రవ్యంబును, యుద్ధసామగ్రియు, నాలుగువేల గుఱ్ఱంబులును అఱువది యేనుఁగులును, వెయ్యి లొట్టిపిట్టలును, ఎడ్లబండ్లతో ననేక ఫిరంగులును దొరకెను

శత్రుసైనికులలో నందఱకును ఆ యరణ్యప్రదేశంబు క్రొత్తది యగుటచే వారందఱును త్రోవలు దొరకక యన్నాహారంబులు లేకయే యరణ్యంబులోఁ దిరుగుచుండిరి వారికి నభయదానం బిచ్చి వారిని తన యొద్దకుఁ బిలిపించుకొని యన్నవస్త్రాదు లిచ్చి తనయొద్ద నుండుట కొప్పుకొనిన వాండ్రకుఁ దగినపను లిచ్చి యితరులను వారివారి దేశంబు లకుఁబంపెను. వారిలో ఝుంఝూరరావుఘాటగే యను మరాటాసరదారుం డొకఁ డుండెను అతనితండ్రియు, శివాజితండ్రి యగు షహాజియు మిత్రులుగా నుండిరి గాన శివాజీ యతనిని మిగుల గౌరవించెను విజా పురములోని యుద్యోగము వదలుకొని తనయొద్ద నుండుమని యతనికి శివాజి యెంతయో చెప్పెను. కాని యాతండొప్పినవాఁడుకాఁడు. అయి నను నతనికిఁ దగినట్లు కానుకలిచ్చి శివాజి యాతనిఁ బంపెను.

ఖండోజీ కాకడే యను నొకమరాటసరదారుఁడు ద్రవ్యలోభము చేత శత్రువులకు వశుఁడై, శివాజికిఁ దెలియకుండ అఫజుల్ ఖానుని భార్యాపుత్రాదులను దొంగత్రోవలఁ దీసికొనిపోయి సురక్షితముగా కర్హా డలోఁ జేర్చెను. ఈ సమాచారము శివాజికిఁ దెలిసినతోడనే వానినిఁ బిలి పించి శిరచ్ఛేదము చేయించెను.

శివాజి యిట్టిమహాసంకటము నుండి తప్పించుకొని సుఖముగ దిరిగి వచ్చినాఁడని సంతసించి జిజాబాయి తన కుమారునికి దృష్టితీసి "నాయనా! నీయన్నయైన సంభాజినిజంపిన అఫజుల్ ఖానుని పగతీర్చి కొంటివి. నేను నిన్ను మరలఁ జూడఁగలిగితిని, ఇదియే మనకు సువర్ణ దినంబు" అని గద్గదస్వరముతోఁ బలికెను. తరువాత శివాజి విశేషముగా దానధర్మములు చేసెను. తమ పరాక్రమముఁ జూపిన సరదారులను బంటు లను గౌరవించి, కొందఱకుఁ బల్లకీలు, కొందఱకు ఛత్త్రచామరములు, కొందఱకు సువర్ణకంకణములు, ఇట్లు వారివారికిఁ దగిన బహుమానంబు లొసంగెను గాయపడిన వీరులకు నౌషధోపచారంబులు చేయించె. యుద్ధ ములో మృతులైన వారికుమారులఁ బిలిపించి వారికి వారితండ్రులయుద్యో గంబు లిచ్చెను మృతులైనవీరుల కొడుకులు చిన్నవయస్సుగల వాం

ప్రయాణమైనయెడల వారి భార్యలకు సర్దాశనము చేర్పించెను. ఇట్లు శివాజి తన సైనికులందఱును సంతసించునట్లుఁ జేసి శత్రుసైనికులను బొగడునట్లు జేసెను. రాయబారి యగు పంతాజిగోపీనాథ బోకీలునకు హివరే యను గ్రామంబు సంతతపరంపరగా ఇనాముగ నిచ్చెను (౧౬౫౯)

అఫజుల్‌ఖానుఁడు చచ్చినవృత్తాంతంబును, సైన్యంబు లన్నియు ఘోరంబుగా నాశము జెందిన సమాచారంబును నాల్గవరోజు విజాపురంబులోఁ దెలిసెను. ఆ వార్త వినినతోడనే యచట వారందఱును మిక్కిలి చింతాక్రాంతులైరి. నవాబు నవాబుతల్లియు దుఃఖపరవశులైరి. నవాబుబిడ్డ మూఁడురోజుల వఱకు భోజనమే చేసినది కాదఁట. సరదార్లందఱు దుఃఖితులైరి. కాని వారిలో వారికిఁ బరస్పరమత్సరంబులును వైరంబులును నున్నందున శత్రుపరాభవమునకు నెవ్వఁడును వెళ్ళ నిశ్చయించిన వాఁడు కాఁడు.

ఈ ప్రకరణము ముగించుటకుఁ బూర్వము, అఫజుల్‌ఖానుని జంపుటకు శివాజి యుపయోగించిన కుట్రను గుఱించి కొంత వ్రాయవలసియున్నది. దీనిని గుఱించి మరాటచరిత్రకారులు శివాజిని స్తుతియించి యున్నారు. యవన చరిత్రకారు లత్యంతనీచముగాఁ దిట్టియున్నారు. గ్రాంట్ డఫ్‌వంటి యింగ్లీషు చరిత్రకారుఁడు ఈ కార్యము చెడ్డదనియు లేక మంచి దనియుఁ జెప్పక మూకభావముతో నూరకుండెను. ఇట్లు వివిధజనులు వివిధ రీతులుగా వర్ణించుచున్న కార్యముగుఱించి మనము ఆలోచన చేయునపుడు నిష్పక్షపాతబుద్ధితో నుండవలయును. అట్లుండి విచారించినయెడల నీతిని మన్నించువా రెవరును నెట్టిమోసమైనను నెట్టికుట్రయైనను మంచిది యని చెప్పుటకు వీలులేదు. రెండుకాసులు సంపాదించుటకుఁ జేసిన దొంగతనం బయిన నేమి జ్ఞానభాండారము సంపాదించుటకుఁ బుస్తకాలయంబును మాయముచేయు దొంగతనంబైన నేమి నీతివిశారదులకొక్కటియే. అటులనే మోసం బెక్కుడుఁ గాన్పించినను దోషార్హంబే. ఇట్లు కేవల తత్త్వనీతిజ్ఞులు (Theoretical mora-lists) చెప్పెదరు. కాని లౌకికనీతిజ్ఞులు (Practical moralists)

కొన్ని దోషములను మన్నించెదరు ఇప్పుడు మన దివాణములందును సుజ్ఞానిచేయు తప్పిదముకంటె నజ్ఞాని చేయు తప్పిదమునకుఁ దక్కువ శిక్ష విధించెదరు ధనవంతుఁ డయినవాఁడు దొంగతనము చేసినయెడల నన్నము లేక దొంగిలించిన వారికంటె నధికదండనము విధింపఁబడును గదా! భయాంధుఁడై గాని క్రోధాంధుఁడై గాని స్వసంరక్షణనిమిత్తమై కాని చేసిన యపరాధ మంతగా శిక్షార్హము కాదు అనఁగా దేశకాలపాత్రములను బాగుగా విచారించి యపరాధమునకు శిక్ష విధింపవలయు నని యాధునిక న్యాయసిద్ధాంతము ఈ సిద్ధాంతము ననుసరించి శివాజీయం దెంత యపరాధ ముండునో చూచెదము

1. శివాజి కాలములోని నీతికల్పన (Moral ideal) యిప్పటి మన నీతికల్పనవంటిది కాదు సామాన్యమైన నీతి వేఱనియు రాజనీతి వేఱనియు నప్పటివారి యభిప్రాయమై యుండెను † శత్రువును మోసము చేతనైనను జంపవచ్చుననియు నటులఁ జంపిన దోషంబు లేదనియు వారి యభిప్రాయంబై యుండె. శ్రీరాములవారు చాటుననుండి వాలినిఁ గూలవేసె ననియుఁ దొడ చూపి శ్రీకృష్ణుఁడు భీమునిచే దుర్యోధనునిఁ జంపించెననియు మొదలయిన పౌరాణికకథ లన్నియుఁ జిన్ననాఁట నుండియు వినుచున్న వారికి సత్కృత్యంబు నెరవేర్చుటకు నన్యాయంబైనను జేయవచ్చు ననితోఁచుట యాశ్చర్యంబు కాదు.

† ఇప్పటికైనను నాగరకత హెచ్చైన యూరోపుఖండమునందుఁగూడఁ గొందఱు రాజనీతియు, లోకనీతియు, భిన్నంబు లని వాదించెదరు. మనము చేయఁదలఁచిన కార్యంబు మంచిదియైన నది సాధించుటకు నెట్టి యనీతికరము లయిన మార్గములైన నవలంబింప వచ్చునని జర్మనీ రాష్ట్రముయొక్క జగద్విఖ్యాత మంత్రియగు ప్రిన్సుబిస్మార్కుగారి యభిప్రాయమై యుండెనఁట. ఇక్కాలంబుననే యింత గొప్పవారి కిట్టియభిప్రాయం బుండఁగా నక్కాలంబు వారికిట్టియభిప్రాయం బుండుట యొకవింత గాదు.

శివాజీ కాలములో నిట్టిమోసములు తఱచుగా జరుగుచుండెను. బీజాపూరు గోలకొండ మొదలైన రాజధానులలో నెల్లప్పుడును సరదారు లొకరినొకరు భంగపఱిచి చంపుచుండిరి శత్రువినాశము చేయుటకు నా కాలములో మోసమొక నిర్దోష మైన సాధనమై యుండె

శివాజీ యన్నయైన సంభాజిని మోసముచే అఫ్జుల్ ఖానుఁడు చంపెను అందుచే నాతనిని నెట్లులైనఁ జంపవలయునని శివాజీకి నుండుట సహజము కోపావేశ పరవశులైనవారును దుఃఖపూరితులై యున్నవారును జేయు సాహస కార్యంబులు కొంతవఱకు క్షంతవ్యంబులు కదా!

అఫజుల్ ఖానుఁడు దండయాత్రకు వచ్చునప్పుడు త్రోవలో నున్న హిందూక్షేత్రములను బాడుచేసెను అందుచే హిందూమతాభిమానియైన శివాజీకి నధిక సంతాపంబు గలుగుట వింత కాదు జనులకుఁ దమ మతమును నిందించినవారియందే యసూయ కలుగుచుండఁగా మతమును బాడుచేసినవానిని నెట్టులైనఁ జంపవలయునని యిచ్ఛ గలుగుట యాశ్చర్యంబు కాదుగదా!

అఫజుల్ ఖానుఁడు గూడ శివాజిని మోసము చేయవలయునని తలఁచి యుండెను. ఈ సంగతి రాయబారివలన శివాజీకిఁ దెలిసినందున నతఁడును నాత్మరక్షణమునకై తన శత్రువునే మోసపుచ్చ యత్నించెను. ఇట్లు వీర ప్రతివీరు లిద్దఱును నొండొరుల మోసపుచ్చ యత్నించి వారిలో నధికప్రజ్ఞ గలవాఁడు కడతేఱెను హీనప్రజ్ఞుఁ డీల్గెను! ఇందుల రహస్యం బింతియ. సత్యం బిట్లుండ మోసమునకై యొక్క శివాజిని దూషించుట న్యాయంబు కాదు శివాజిని దూషించువారు పై కారణంబుల నన్నింటిని యోజించి తమ యభిప్రాయంబును స్థిరపఱుచు కొనవలయును.

# ఏడవ ప్రకరణము

## దండయాత్రలు

అఫజుల్ ఖానుని వధియించిన తరువాత శివాజి యూరకుండక మఱి కొన్ని సైన్యములను బోగుచేసికొని జంజిరా పట్టణములోనున్న సిద్దీవాని పైకి దండు వెడలుచున్నటుల నటించి యెవరికిని దెలియకుండ నెకాయెకి కోలాపూరు ప్రాంతమున విడిసెను. పన్హాళాయను నొక దుర్గము బిజాపూరు రాజులదియై యుండెను. ఆ దుర్గాధిపతి ధనాశచే నా దుర్గమును శివాజికి విచ్చివేసెను. శివాజి తన యొద్దనున్న విశ్వాసపాత్రుడును తెలివి గలవాడును అయిన అణ్ణాజీదత్తో యను బ్రాహ్మణుని నా దుర్గమునకు నధిపతిగా నేర్పఱచెను. ఈ దుర్గమును సంపాదించిన కొలది రోజుల లోనే పావనగడ్, వసంతగడ్ మొదలయిన దుర్గములను సాధించి కృష్ణా నది యొడ్డుననున్న గ్రామాదులలో పేష్కషు (Tribute) వసూలు చేయుచు నక్కడక్కడ దన ఘట్టకుటములను (ఠాణాలను) శివాజి స్థాపించెను. పన్హాళా మీదనున్న సైన్యములను బంపి సహ్యాద్రి పర్వత పాద ప్రదేశములందును శిఖర ప్రదేశములందను గల దుర్గముల నన్నిం టిని సంపాదించెను. ఆ దుర్గములలో రాంగణా ఖేళణా దుర్గములు విశేష పరిశ్రమచే సాధింపబడియె. ఖేళణా యను దుర్గముపేరు మార్చి దానికి విశాలగడమని పేరు పెట్టిరి.

శివాజి కోలాపూరు ప్రాంతమునకు వచ్చి దేశమంతయు గొల్ల గొట్టుచున్నాడని విని యచ్చటి యధికారియైన రుస్తుంఖానుడు కొంత సైన్యము గూర్చుకొని యుద్ధమునకు వచ్చెను. కాని వానియొద్ద మూడు నాలుగువేల సైన్యముకంటె నెక్కువ లేనందున శివాజి చులకనగా వాని నోడించి వాడు కృష్ణ దాటి పాఱిపోవునటుల జేసెను (క్రీ. శ. ౧౬౫౯ డిశంబరు) శివాజి యూళ్ళు దోచుకొనుచు పేష్కషు వసూలు

జేయుచు, విజాపురమువఱకు వెళ్లెను గాని శత్రువుల చేతఁ జిక్కక యక్కడనుండి త్వరగాఁ దిరిగివచ్చెను శివాజి తిరిగి వచ్చువఱకు విశాలగడముపై అణ్ణాజిదత్తో యనువాఁడు గొప్ప సైన్యముఁ గూర్చియుండెను. ఆ సైన్యమును వెంటఁ దీసికొని శివాజి సముద్రతీర ప్రాంతములపై దండు వెడలెను రాజాపూరు, దాభోళ మొదలయిన స్థలముల గెలిచి, యచ్చటివారినుండి కప్పములఁ గొని సంపాదించిన ధనమంతయు రాజగడమునకుఁ బంపెను. (క్రీ శ ౧౬౬౦ జనవరి)

ఇట్లు శివాజి రోజురోజు బలవంతుఁడై విజాపూరువారి దుర్గములను స్వాధీనపఱచుకొనుటయు, దేశము కొల్లగొట్టుటయు, సైన్యాధిపతుల నోడించుటయు, రాజధానియైన విజాపూరు వఱకుఁ దఱుముకొని వచ్చుటయుఁ జూచి విజాపూరు వారందఱును భయభ్రాంతులై శివాజి నెటులైన నోడింపవలయునని నిశ్చయించిరి వారొక ప్రచండ సైన్యమును సిద్ధము చేసి సిద్దీ జోహార్ అనువానికి సైన్యాధిపత్య మిచ్చిరి. ఈతఁడు కర్నూలు పట్టణములో నదివఱకు సుబేదారుగా నుండి నవాబు కార్యములెన్నియో సాధించి ఘనతకెక్కెను ఈతనికి సవాబత్ఖాన్ అను బిరుదు నొసంగి పదివేల యశ్వ సైనికులతోను పదునాలుగువేల కాల్బలములతోను శివాజిని గెల్చుటకునై పంపిరి. వీనివెంట అఫజల్ఖానుని కుమారుఁడైన మహమ్మదుఖానుఁడును శివాజి తన తండ్రినిఁ జంపిన పగ తీర్చుకొనవలయునని యుద్ధమునకు వెడలెను విజాపూరు వారిట్లు దండువెడలుట చూచి యిదియే సమయమని యెంచి జింజిరాధిపతియైన సిద్దీఫత్తేఖానుఁడు శివాజి సంపాదించిన కొంకణముపై దండెత్తెను వాడీ ప్రాంతమునకు దేశముఖువైన సావంత్ అనువాఁడును శివాజితోఁ బోర నారంభించెను

ఇట్లు శత్రువులంద ఱొక్కసారి తనతోఁ బోరాడ ధైర్యము యొక్క యపరావతారమైన శివాజి యెంతమాత్రమును జంకక యా శత్రువుల నందఱను వేఱువేఱ యెదిరించుటకుఁ దగిన యేర్పాటులు చేసెను జింజిరాసిద్దీ మీఁదికి రఘునాథబల్లాళునిఁ బంపెను. వాడీసావంతునితోఁ బోరాడుటకు బాజీఫసల్కర్సర్నోబత్ అనువాని నియమించెను. కొంకణ

ప్రాంతమును సంరక్షించుటకు ఆబాజీసోనదేవుని నాజ్ఞాపించెను. పురందర్, సింహగడ్, ప్రతాపగడ్ మొదలయిన ప్రాంతములను గాపాడుటకై పేషవయైన మోరోపంతు పింగళేను నియోగించెను తాను స్వయముగా పన్హాళా దుర్గముమీఁద నుండి యుద్ధ సన్నాహము చేసెను

శివాజి పన్హాళా కోటమీఁద నున్నాఁడని విని సిద్దీ జోహరుఁడు మొట్టమొదట ఆ కోటనే ముట్టడించెను ఈ దుర్గము శత్రువులకు నసాధ్యమని శివాజి యనుకొని శత్రువులు దుర్గము సమీపమునకు వచ్చువఱకు శివాజి వారి నడ్డగింపడయ్యె వారీ దుర్గము క్రిందికి వచ్చి విడిసిన తరువాత నేతాజీపాలకరుఁడు వారి చుట్టు ప్రదేశము దోఁచుకొని కాల్చి అక్కడక్కడ రాణా లేర్పఱచి తురకసైన్యములకు ధాన్యము గడ్డి మొదలైనవి దొరకకుండఁ జేసెను ఇదియుఁగాక రాత్రులయందు శత్రుసైన్యమును బాధ పెట్టుచుండెను ఇటు దుర్గములోనుండి మావళే సైన్యములు క్రిందికి దిగి పర్వత దుర్గములలో దాఁగియుండి శిబిరములలో శత్రువులు నిద్రించి యున్నప్పుడు వారి శిబిరములను నాశము చేయుచుండిరి శత్రువులు లేచి యుద్ధమునకు సిద్ధముకాఁగానే వారిపై దూరమునుండి బాణములు వేసి గుహలోనికిఁ బాఱిపోవుచుండిరి ఇట్లు మరాఠాలు విజాపూరు సైన్యమును లోపలినుండియు బైటనుండియు బాధపెట్టుచుండిరి కాని దుర్గము శివాజి యనుకొనినంత బలవంతమైనది కానందున సిద్దీజోహారు కోటను ముట్టడించి వెలుపలనుండి కోటలోనికి నొక్క మనుష్యునిఁగాని పదార్థముఁగాని పోకుండఁ జేసెను. ఇందుచే లోపలి సమాచారము వెలుపలను వెలుపలి సమాచారము లోపలను దెలియకుండెను తుదకుఁ దా నా దుర్గములోనే యుండుట తప్పని తెలిసికొని శివాజి యీక్రింద వర్ణింపబడిన యుక్తిచే నా కోటనుండి వెలువడెను (క్రీ. శ ౧౬౬౦)

సందు లేకుండ మనము కోటను ముట్టడించి వెలుపలినుండి శివాజికి నే సహాయము దొరకకుండఁ జేసినందున నాతఁడు మనచేత నిఁక చిక్కఁగలఁడని విజాపూర సైన్యములు తలంపసాగెను ఇట్టి యాసతో నున్నప్పుడే శత్రువులను మోసపుచ్చవచ్చునని తలఁచి శివాజి "ఈ దుర్గము

మీ స్వాధీన పఱిచెదము." అని సిద్దీజోహారునకు వార్తపంపెను సంధిని గుఱించిన మాట లన్నియు మాటలాడుటకుఁ దాపు క్రిందికి వచ్చెద ననియు మోసము గలుగదని యభయము మాత్ర మియ్యవలయు ననియు నేర్పాటులు చేసికొని శివాజియు సిద్దీజోహారుఁడును దుర్గముక్రిందఁ గలసిరి అక్కడ పెక్కుసంగతులను గుఱించి మాటలాడి "రేపు మేము ఈ కోట స్వాధీనము చేసెదము. కాని కొన్నిసంగతు లింకను మాటలాడవలసి యున్నవి ఇప్పుడు సాయంకాలమయినందున అందును గుఱించి రేపు మాటలాడుదము" అని చెప్పి శివాజి కోటపైకిఁ బోయెను.

సంధియైన దని తలఁచి విజాపూరసైనికు లారాత్రి నిశ్చింతగా నిద్రపోయిరి. మధ్యరాత్రి శివాజి విశ్వాసపాత్రులైన కొందఱు సైనికులతోఁ గోటదిగి శత్రువులను దప్పించుకొని రాంగణా యను దుర్గమునకుఁ బోవుచుండెను కొంతకాలము వఱకు విజాపుర సైనికులకు శివాజి వెళ్ళిన సంగతియే తెలియలేదు తెలిసినతోడనే సిద్దీజోహారుని కుమారుఁడు వెంట సైన్యములను దీసికొని శివాజిని బట్టుకొన వెడలెను ప్రొద్దున జాముప్రొద్దెక్కువఱకు శివాజి సైన్యముయొక్క వెనుక పార్శ్వము సైనికులకుఁ గావచ్చినదికాదు రాంగణాయను దుర్గమింక మూడుక్రోసు లున్న దనఁగా శివాజిని విజాపురసైనికులు చూచిరి శత్రువులు వేగముగా వెనుకనుండి వచ్చుచున్నా రని తెలిసిన తోడనే శివాజి బాజీపరభూ అను సేనాధిపతిని శత్రువుల నెదుర్కొనుట కక్కడ నిలిపి "నేను కోటమీఁదికి సైనికులతో జేరువఱకు నీ విక్కడనే శత్రువుల నడ్డగించి యుండవలసినది నేను కోటమీఁదికిఁ జేరఁగానే గుర్తు కొఱకు ఫిరంగిశబ్దము అయిదు సారులు చేయనగును ఆ శబ్దములు వినినతోడనే నీవు నీ సైనికులతో గుట్టలచాటునఁ కోటమీఁదికి రావలసినది' యని యాజ్ఞాపించి తాను గొంతసేనతోఁ గదలి వెళ్లెను

విజాపూరు సైన్యము మహావేగముతో గుట్ట యెక్క సాగెను బాజీపరభూ నిలిచియున్న స్థలము రెండుకొండల నడుమ నున్న యిఱుకు

త్రోవ యైనందున నచ్చట నిలిచి కొలఁది సైనికులను ప్రచండసైన్యముతోఁ బోరాడుటకు వీలుగా నుండెను విజాపూరుసైన్యములు ఆఁత్రోవను బోవునప్పుడు బాజీపరభూ వారిని ప్రాణములతో నొప్పించి మరలిక్రిందికిఁ బోవునటులఁ జేసెను కాని యింతలో విజాపురము వారి కాల్బలమువచ్చి చేరినందున శత్రువులు రెండు పర్యాయములు మరాటావారిని నెదిరించి పైకి నెక్కఁబోయిరి కాని రెండు పర్యాయములును వారు విజాపూరు సైన్యమును వెనుకకు నెట్టిరి విజాపూరువారు క్రొత్తసైనికులఁ దెచ్చి మూఁడవసారి పైకి నెక్కుటకుఁ బ్రయత్నము చేసిరి మరాఠ సైనికులు కొలఁదిమందియుఁ దురుష్కసైనికు లనేకులును అయినందున నిదివఱకు సగముకంటె నెక్కుడు మహారాష్ట్రవీరులు వీరశయనము నొందిరి. అయినను ప్రాణములపై నాశవదలి బాజీపరభూ అసమాన ధైర్యముతోఁ దురకలను నెదిరించి స్వామి కార్యము నకై ప్రాణముల సమర్పించెను. ప్రాణములు విడుచుటకుఁ బూర్వము కోటమీఁదినుండి వచ్చిన ఫిరంగుల ధ్వని విని శివాజి క్షేమముగాఁ కోటమీఁదికి జేరినాఁడని తెలిసికొని సమాధానముతో "నేను నా కర్తవ్యమును జేసితిని" అని పలికెను. బాజీపరభూ యొక్క ప్రేతము శత్రువులచేతిలోఁ బడకుండఁ దద్భటులు మహాప్రయాసతోఁ గొండపైఁదికి జేర్చిరి. శివాజి చరిత్రములోని యీ భాగము చదివిన వారికి గ్రీసుదేశము యొక్క చరిత్రములోని థర్మాపొలీ(Thermopylae) యుద్ధము జ్ఞాపకము రాకమానదు అచ్చట మూడువందల స్పార్టనులు ప్రచండ పారసీకసైన్యముతోఁ బోరాడి తమలోఁ బ్రతివీరుఁడు హతుఁడగువఱకు శత్రువులను థర్మాపొలీ యనుపర్వతద్వారమును చొరనీయనైరి అటులనే యిచట మహారాష్ట్రవీరుల సంఖ్య స్వల్పమైనను అసంఖ్యులైన తురకలతోఁ బోరాడి శివాజి దుర్గము నెక్కువఱకు వారిని త్రోవదాఁట నీయరైరి ఇట్టిస్వామిభక్తి పరాయణశిరోమణి యైన బాజీపరభూనామమును మహారాష్ట్రులందఱు మిక్కిలి గౌరవింతురు.

బాజీపరభూ తన సేనలో గతించినందున నాతనికొమారుఁడైన

బాలాజీబాజీ యనువానిఁ బిలిపించి శివాజీ వానికిఁ దంత్రి యధికార మొసంగెను వానితమ్ముఁ డంబజీకు నాందోళనాది సన్మానంబుల నొసఁగి సబనవీసు† అను పనులపై వారిని నియుక్తులఁ జేసెను

ఇట్లు తురకసైన్యములు శివాజియున్న రాంగణాయను పర్వతదుర్గమును ముట్టడించిరి గాని యప్పుడు వర్షాకాల మైనందునఁ దురుష్కులు కొండక్రింద నుండ లేక తిరిగి పన్హాళా దుర్గమునకుఁ బోయిరి తురకల సైన్యాధిపతియైన సిద్దీజోహారుఁడు శివాజీ యేదుర్గమునుండి పాఱిపోయెనో యా పన్హాళాదుర్గమును సాధించుట మేలా లేక శివాజీ యే దుర్గమునకుఁ బాఱిపోయెనో యా రాంగణాదుర్గమును సాధింపవలయునా యని యోజించుచు చేయునదిలేక దోఁచక త్రొక్కులాడు చుండెను. శివాజి నేఁడో రేపో చేతఁ జిక్కునన్న యాశతో నున్న విజాపూరునవాబు అతఁడు తప్పించుకొని పోయినాఁడని విని మిగుల చింతాక్రాంతుఁ డయ్యెను శివాజి యొద్దనుండి లంచము పుచ్చుకొని తన సైన్యాధిపతి యైన సిద్దీ జోహారుఁడే పోనిచ్చెనని యాతనికి సంశయము గలిగెను గాన నాతఁడు స్వయముగా సైన్యాధిపత్యమును స్వీకరించెను ఇట్లు నవాబు తన్ను నవమానించినందున సిద్దీజోహారుఁడు కోపగించి తన జాగీరు అయిన కర్నూలుకు వెడలి పోయెను (క్రీ శ ౧౬౬౧ జనవరి)

విజాపూరు సులతాను మహోగ్రాకారముగా మహారాష్ట్రుల పైకి దండువెడలి సహ్యాద్రిపర్వతము క్రిందను మీఁదను నున్నట్టి మహారాష్ట్రుల దుర్గముల నన్నింటిని స్వాధీనపఱుచుకొనెను. పన్హాళా పావనగడము ము దుర్గములను సాధించెను రాంగాణా విశాలగడను అను దుర్గములు మాత్ర మతనిచేతఁ జిక్కవైవి లేవు.

ఇట్లు శివాజిచేతిలోఁ బడ్డ తన దుర్గము లన్నియు నవాబు మరల

† సబనవీసు అనఁగా సైన్యములకుఁ గావలసిన వెచ్చములు మొదలయిన వానిపై నధికారి.

సాధించుచుండఁగా శివాజి యూరక కూరుచుండిన వాఁడు కాఁడు రాజా పురి మనుపట్టణముపై దఁడెత్తి, దానిని దోఁచుకొని స్వాధీనపఱుచు కొనెను. ఆ పట్టణములోఁ గొందఱు ఇంగ్లీషు వర్తకులుండిరి. వాండ్రు తురకల సైన్యాధిపతియైన సిద్దీజోహారునకుఁ దుపాకిమందు, గుండు మొదలయిన సాధనముల నిచ్చియుండిరి. ఈ సంగతి శివాజికిఁ దెలిసి నందున నాతఁడావర్తకులఁ జెఱఁబట్టి యొకదుర్గముపైఁ జెఱసాలలో నుంచెను. ఆ ప్రాంతమున దవలీ యను స్వతంత్రసంస్థానాధిపుఁడుండెను. అతని రాజధాని శృంగారపురము యుద్ధములో నాతనిని జంపి శివాజి యా పట్టణమును సాధించెను. కాని జనులందఱు భయపడి పాఱిపో సాగిరి అప్పుడు శివాజి పూర్వపు సంస్థానపుని మంత్రిని బిలిపించి పూర్వ మెవ్వరెవ్వ రేయేపని మీఁద నుండిరో వారివారిని ఆయాపనులపై నిలిపి లోకులందఱకుఁ బూర్వపుహక్కు లిచ్చి వారంఱు నిర్భయులై యుండు నటులఁ జేసెను.

ఇంతలో, గర్ణాటకములోని జమీదారులు రాజద్రోహులయి తిరుగఁ బడుచున్నా రనినవార్త విజాపురమునకు వచ్చి చేరెను. మొదట శివాజితోఁ బోరాడవలయునా లేక కర్ణాటకములోని జమీదార్లను దండించుటకుఁ బోవలయునా యని విజాపుర రాజసభలోఁ జర్చ జరిగెను ఇంతలో వాడీ యను గ్రామము రాజధానిగాఁగల సావంత్ అను సంస్థానాధీశుఁడు విజాపూరు నవాబున కిట్లు వర్తమాన మంపెను. మీరు నాకు సహాయము చేసిన యెడల నేను శివాజిని నోడించి కొంకణప్రాంత మంతయు సంపా దించెదను బాజీ ఫసల్కర్ అను సరదారుని శివాజి యీసావంతుతోఁ బోరాడ బంపెనని వెనుక వ్రాసియున్నాము వా రిద్దఱకు ననేకపర్యాయ ములు పోరాట జరిగి యొకసారి వీరును నొకసారి వారును నోడుచు గెలుచుచు వచ్చిరి ఇట్లిద్దరు సమాను లయినందున సావంతుఁడు విజా పూరునవాబును బైని వర్ణించినటుల సాహాయ్య మడిగెను

ఇట్లు సావంతుడు శివాజిని గెలిచెద ననినందున నవాబు కొంత సైన్యమాతనికి సాహాయ్యము చేయుటకునై పంపి తాను స్వయముగాఁ

గర్ణాటదేశమునకుఁ బోవ నిశ్చయించెను. సావంతునికి సాహాయ్యముగాఁ బంపినవారు బహిలోలుఖానుఁడును బాజీఘోరపదేముధోళ్ కరుఁడును. వీరిద్దఱను విటుఁబంపి నవాబు తన ప్రచండసైన్యముతోఁ గర్ణాటకమునకుఁ దరలిపోయెను. ఇట్లు శివాజియదృష్టమువలన భయంకర మైన శత్రు సైన్య మంతయు మహారాష్ట్రదేశము వదలి వెళ్లెను.

నవాబు సావంతుని సాహాయ్యమునకుఁ బంపిన యిద్దఱు సరదారులలో రెండవ వాఁ డగు బాజీఘోరపదేముధోళ్కర్ అనువాఁడు తురకల సేనలో నున్నమహారాష్ట్రవీరుఁడు, కర్ణాటదేశములో శివాజితండ్రి యగు శహాజీ యుండఁగా నాతనిని మోసపుచ్చి చెఱఁబట్టి నవాబునొద్దకుఁబంపిన మిత్రద్రోహి యీతఁడే. 'నీవు నాపుత్రుఁడవే యైనపక్షమున నీతఁడు చేసిన మోసమునకై పగ తీర్చుకొనవలయును' అని శహాజీ శివాజీకిఁ జెప్పియుండెను ప్రస్తుత మాతఁడు శివాజీతోఁ బోరాడుటకై సైన్యములను బోగుచేయునిమిత్తము తన యూరగు ముధోళ్కు వెళ్లెను విశాలగడముపై నున్న శివాజికి నీ వృత్తాంతము తెలియఁగానే పగతీర్చికొనుట కిదియే మంచిసమయ, మని యెంచి సైన్యము దీసికొని యెవరికిని దెలియకుండ ముధోళుగ్రామముపై నొక్క పెట్టునఁబడి బాజీ ఘోరపదేను, అతని బంధువుల పందఱను జంపి గ్రామ మంతయుఁ గాల్చి విశాలగడమునకుఁ దిరిగి వెళ్ళెను ఇట్లీసరదారుఁడు నాశమొందినందున నవాబు ఖావసఖాన్ అనువాని సావంతునకు సహాయునిఁగాఁ బంపెను బహిలోల్ ఖానుఁడును. ఖావసఖానుండును కొలఁదిదినములలో సహ్యాద్రిపర్వత సంబంధ మైన దుర్గముల నన్నింటిని స్వాధీనపరచుకొనిరి అక్కడ నుండి కొంకణమునకు రాఁ దలంచిరి. ఇంతలో నవాబు వారి నిద్దఱను దనకు సహాయముచేయుటకై కర్ణాటదేశమునకుఁ బిలిపించుకొనెను. ఇటులదుదకు సావంతుఁ డొక్కఁడే శివాజితోఁ బోరాడవలసినవాఁ డాయెను కొలఁదిరోజులలోనే శివాజి సావంతునిరాజ్యమంతయుగెలిచెను తరువాత సావంతుఁడును, శృంగారపురపు రామదళవి యనినవాఁడును గోవాకు వెళ్ళి బుడతకీచుల (Portuguese) సాయమువేఁడిరి. కాని బుడతకీచులు

భయపడునటుల వారికి శివాజి వార్తపంపినందున వాండ్రు శివాజితోఁ బోర నొల్లక, సావంతుని రామదళవీ యనువానిని దమరాజ్యములో నుండ వలదని వెడలఁగొట్టిరి తుదకు నిరాధారు లయి వారిద్దఱు శివాజికి శరణు చొచ్చిరి అప్పుడు శివాజి దయార్ద్రహృదయుఁడై సావంతుఁడు దనవంశ మయిన భోఁసలేవంశమునందే పుట్టినవాఁ డని తలఁచి యాతనికి నాతని రాజ్య మిచ్చి తన సామంతునిఁ జేసికొనెను సావంతుఁడును నప్పటినుండి మిగుల భక్తితో శివాజి సేవ చేయుచుండెను రామదళవీ యనువానికి వాని రాజ్యమిచ్చెను ఈయిద్దఱ రాజ్యములలోఁ దన సైన్యము నుంచి వారిరాజ్య ములలోని ప్రబలకాయులను శూరులను దన సైన్యములోఁ జేర్చుకొను చుండెను ఈ ప్రకార మిద్దఱు ప్రబలశత్రులు శివాజికిఁ బరమ మిత్రు లయిరి। వీరి యిద్దఱరాజ్యములలో శివాజి రాయరీ మాలవణ యను దుర్గములను బాగుచేయించి యధికదుర్గములుగాఁ జేసెను

జంజిరాకు నధిపతి యైన సిద్దీకులస్థుఁడగు ఫత్తేఖానునితోఁ బోరాడ శివాజి రఘునాథబల్లాలుని బంపె నని వెనుక వ్రాయఁబడియె ఫత్తేఖానునియొద్ద యుద్ధమునకుఁ దగిన గొప్పయోడ లున్నందున వాఁడు కొంకణప్రాంతములో సముద్రపురేవున నున్న శివాజీరాజ్యమునకుఁ జాల బాధ కలిగించుచు రఘునాథబల్లాలుని లక్ష్యపెట్టక పోయెను కాని శివాజి మఱింతసైన్యము కొంకణ ప్రాంతమునకుఁ బంపినందున రఘునాథబల్లా లుఁడు సిద్దీవాని నోడించి వాని గొప్ప యోడలరేవు అగు ధుండీరాజపుర మును స్వాధీనపఱచుకొనెను. అందుచే వాని రాజ్యముయొక్క యితర స్థలములనుండి సాయముచేరుటకు వీలులేక వాఁడు జంజిరా యనుపట్ట ణములోనే చిక్కుపడెను. మరాఠావారు జంజిరాపైని ఫిరంగు లెక్కు పెట్టి లోహనాళములను బ్రయోగింప సాగిరి వారియొద్ద మంచి ఫిరంగులు లేనందున సిద్దీ కొన్నిరోజులవఱకు వారిదెబ్బలకు నోర్చెను గాని విజాపురమునుండి గాని యితర స్థలములనుండి గాని తనకు సాయముచేయ నెవ్వరు వచ్చుజాడ కానక భయభ్రాంతుఁ డయి శివాజికి శరణుఁజొచ్చి "ఇఁకమీద మీ రాజ్యమునకు నేను బాధగలిగింపను.

మీరు నారాజ్యములకు గలిగింపఁగూడదు" అనిసంధిచేసికొనెను. (క్రీ. శ. ౧౬౬౨)

సిద్దీ (ఫత్తేఖానుఁడు) పైని వ్రాసినప్రకారము సంధిచేసినప్పటికి నప్పుడప్పుడు శివాజియొక్క సముద్రతీరమందలి (కొంకణమునందలి) గ్రామములపైఁ బడి కాల్చుచుఁ బేల్చుచునుండెను. అందుచే శివాజి యాప్రాంతమున నెప్పుడును అయిదువేల సైన్యము నిలువ యుంచెను. ఇంతియకాక సిద్దీవాని నెదుకించుటకునై తనకును సముద్రముపైఁ బోరాడునోడల నిర్మించెను నానా విధములయిన యైదువందల యోడలను గూర్చి వానినన్నిటికి "కులాబా" యనుగ్రామము ముఖ్యమైన రేవుగా నేర్పాటుచేసెను. సువర్ణదుర్గము విజయదుర్గము అనురేవుల లోను యుద్ధములకుఁ దగినయోడల నుంచెను ఈ సముద్ర సైన్యమున కంతకు దర్యాసాగరుఁ డగువాని నధికారిఁగా నియమించెను ఈ యోడలలోఁ గావలసిన ఫిరంగులు మొదయిన సాధనము లన్నియుఁ జక్కఁగా సిద్ధపఱిచి యధికారులు సముద్రముకో విచ్చలవిడిగాఁ దిరుగఁజొచ్చి నందున సిద్దీ పోర్చుగీజు మొదలయిన సముద్ర యాయులందఱు శివాజిని నొక ప్రజలరాజుగా మన్నింపసాగిరి. పోర్చుగీజువారు కొలఁదిరోజుల లోనే యొకరాయబారిని శివాజియొద్దకుఁ బంపి శివాజి తమయోడల జోలికిఁ బోవకుండునటులను అందునిమిత్తమై తాము శివాజికిఁ దుపాకి మందు ఫిరంగిలకుఁ గావలసిన గోళములు మొదలయిన యుద్ధసామగ్రి యిచ్చునటులను సంధిచేసికొనిరి.

విజాపూరుసుల్తాను కర్ణాటదేశమునకు దిగ్విజయార్థము వెళ్ళియుండె నని వెనుక వ్రాయంబడియె. అక్కడ నవాబు రెండుసంవత్సరములవఱకుండి కొందఱు బందిపోటువాండ్రను దండించి కొందఱకు దండించుటకు వీలులేక యెట్టకేలకుఁ బై నన్ని కలహములను నణఁచి క్రీ శ ౧౬౬౨ వ సంవత్సరమున విజాపురమునకుఁ దిరిగివచ్చెను ఇట్లు నవాబు తిరిగివచ్చువఱకు శివాజి సావంతులఁ బాదాక్రాంతులఁ జేసెను ఘోరపడేను యనుసదనమున కంపెను జింజీపతి యైనసిద్దీని లోఁబఱిచెను బుడతకీచులతో సఖ్యముచేసెను సముద్రసైన్యమునకు నాధిపత్యము

వహించెను, శివాజి యిటుల నత్యంత ప్రబలుడై నందుననూ గర్ణాటకము నుఁడి యలసి వచ్చిన తనకు నతని నెదిరించు సామర్థ్యము లేనందునను విజాపూరునవాబు శివాజితండ్రియగు శహాజీద్వారా శివాజితో సంధి చేయవలయు నని యెంచెను

శహాజిరాజు తంజావూరిలోఁ దనచిన్న కుమారుఁడైన వెంకోజీ యొద్ద నుండె ననియు అతఁడు విజాపూరునవాబునకు సామంతుఁడనియు వెనుక వ్రాసినసంగతి చదువరులకు జ్ఞాపకముండవచ్చును తంజావూరి నుండి శహాజిని బిలిపించి నవాబు తనికిఁ దన మనోరథంబుఁ దెలుపఁగాఁ బుత్రునిఁ జూడవలయుననిన యిచ్ఛ యతనికిఁ గూడ నున్నందున నందు కాతఁడు సమ్మతించి "నాకుమారుఁడు నేను జెప్పినటుల వినఁడనిన సంగతి మీఁకుఁ దెలిసినదే అయినను వానికి బోధచేసి చూచెదను" అని చెప్పి తంజావూరుపోయి తన రెండవభార్య యగు తుకాబాయిని కుమారుఁడగువెంకోజిని వెంటఁ దీసికొని శివాజిని జూడ వెడలెను. తాను వచ్చుచున్నా నని శహాజీ శివాజికి వార్త యంపినందున శివాజి యేనుఁగును గుఱ్ఱములు పల్లకీలు మొదలయిన రాజచిహ్నములతోఁ దండ్రికి నెదురేగెను. ఒకరినొకరు చూచి యనేకసంవత్సరము లయినందున జేజూరి యను గ్రామముయొక్క దేవాలయములో నొకరినొకరు చూచుకొనిరి. అక్కడినుండి శివాజి యందలను సైన్యము దిగియున్న శిబిరములోనికిఁ దీసికొనిపోయెను శహాజీ పల్లకీలోఁ గూర్చుండఁగా శివాజి యాపల్లకిఁ బట్టుకొని కాలికి నేమియు లేకుండ వినయముతో నడచెను. శిబిరము చేరినతరువాత శహాజి కుమారుని నొద్దఁ గూర్చుండఁబెట్టుకొని "నాయనా శ్రీభవానిప్రసాదమువలనఁ గలిగినవాఁడవు. జగద్విఖ్యాతమైన పరాక్రమముఁ జూపితివి మతరక్షకుఁడ వనిపించుకొంటివి మావంశము పవిత్రమాయె" ననియె. అక్కడ ననేకముగా దానధర్మము బ్రాహ్మణ భోజనము మొదలయిన ధర్మకృత్యములను జేసి తండ్రికుమారులందఱు పూనాపట్టణమునకుఁ బోయిరి అక్కడ రెండు నెలలుండిన తరువాత శివాజి తండ్రిని వెంటఁబెట్టుకొని రాజగడము, ప్రతాపగడము మొదలైన తన కోటలను అఫ్జుల్‌ఖానుని వధస్థలము నూతనరాజమందిరములు

మొదలైన తన వైభవమంతయుఁజూపించెను. వారిద్దఱు రామదాసస్వామి దర్శనము చేసికొని పన్హాళదుర్గముపైన గుటుంబములోని యితరబంధువుల నందఱను గలిసికొనిరి. అక్కడఁ గొన్నిరోజు లుండి శహాజి తంజావూరికిఁ బయనమై వెళ్ళునప్పుడు కుమారుని నేకాంతమునకుఁ బిలిచి నీవు స్వరాజ్యము సంపాదించినందులకు నా కెంతయు సంతోషమే కాని యిఁక మీఁద నాబొందిలోఁ బ్రాణంబులుండు వఱకు నీకును నాయజమానుఁడైన విజాపూరు నవాబునకును స్నేహ ముండవలయు నని నాయిచ్ఛ. నీవలన నాతనికి నెంతమాత్రము బాధ కలుగఁ గూడదు నీకాతఁడు ఈ చేతఁగాక పోయినను ఆచేత నయినను (అనఁగా నేదో యొక మార్గముగా) ఏమైన ముట్టఁజెప్పక మానఁడు ఇందులకు శివాజి "నేను మీ ఆజ్ఞను మించు వాఁడను గాను" అని యుత్తరముచెప్పి సులతానున కిచ్చుటకై రత్నములు దుస్తులు గుఱ్ఱములు ఏనుఁగులు మొదలయినవి తండ్రితోఁ బంపెను శహాజి విజాపురమునకు వచ్చి కుమారుఁడు పంపిన వస్తువులన్నియు నవాబునకిచ్చి శివాజికిని నవాబునకును సంధికుదిర్చి తంజావూరికిఁబోయెను.

(క్రీ శ ౧౬౬౨) క్రీ శ ౧౬౪౬ వ సంవత్సరములోఁ దొరణా దుర్గము గొని శివాజి మహారాష్ట్ర రాజ్యస్థాపన యను మహాకార్యమునకుఁ దోరణము గట్టినప్పటినుండియు నేఁటి (క్రీ శ ౧౬౬౨) వఱకుఁ బదునాఱు సంవత్సరము లయ్యెను ఈ పదునాఱు సంవత్సరములును శివాజి విజాపూరు నవాబుతో నవ్యాహతముగాఁ బోరాడుచునే యుండి సాధారణముగా నెల్లప్పుడును గెలుపొందుచుండుటకు నవాబు ప్రార్థనవలననే యాతనితో సంధి చేసికొనెను. ఈ కాలమువఱకుఁ గొంకణమంతయుఁ బర్వత ప్రదేశము లన్నియు తన స్వాధీనమయ్యెను ఆయన రాజ్యమునకు నిప్పటికి దక్షిణోత్తరసీమ గోవా కల్యాణములును పూర్వ

పశ్చిమసీమ నుపా జించిరాలును అయియుండెను. అతనియొద్ద నేఁబది వేల కాల్బలము ఏడువేల గుఱ్ఱపుసైన్యము కూడియుండెను రాయరీ యను కోట తానుండుటకుఁ దగినది యని తెలిసికొని కొండయొక్క మూలలన్నియుఁ జెక్కించి కొండయంతయు నునుపుగాను శత్రువు లెక్కుటకు దుస్సాధ్యముగాను జేయించి కోటపైని గొప్పరాజ్యభవనములు మంత్రులకొలువుకై మేడలును సైన్యాదులకునై శిబిరంబులును దివాణంబుల నిమిత్తమై విశాల మందిరంబులును నిర్మించి యచ్చటఁ దానెల్లప్పుడును నుండుచు నా దుర్గంబును రాజధానిగాఁ జేసెను.

# ఎనిమిదవ ప్రకరణము

## మొగలులతో యుద్ధము

క్రిందటి ప్రకరణములో వర్ణింపబడినటుల విజాపూరు నవాబుతోఁ బోరాడుట మాని సంధిచేసికొని పిదప శివాజి ఢిల్లీశ్వరుఁడైన ఔరంగజేబుతో యుద్ధమునకుఁ బూనుకొనెను. ఔరంగజేబు దక్షిణము(Deccan), నుండి ఢిల్లీకిఁ బోయినప్పుడు వానికిని శివాజికిని జరిగిన సంధిప్రసంగము వెనుక నొకప్రకరణములో వర్ణింపఁబడినది. ఒకరితో నొకరు సంధి చేయ నిచ్చగలవారుగాఁ బైకి వారప్పుడు (క్రీ. శ. ౧౬౬౭ సంవత్సరములో) నటించుచున్నను ప్రసంగము వచ్చినప్పుడొకరిని నొకరు సాధింపవలయు నని యుద్ధమును దలంచుచుండిరి. క్రీ. శ. ౧౬౬౮ వ సంవత్సరము నుండి ౧౬౭౦ వఱకుఁ దనసార్వభౌమత్వమును స్థిర పఱుచుకొను ప్రయత్నములో మునిఁగియున్నందున ఔరంగజేబును విజాపూరు సులతానుతోను జంజిరాహబషీలతోను ఇంక నితరులతోను బోరాడు చున్నందున శివాజియు రమారమి నాలుగు సంవత్సరముల వఱకు నొకరితో నొకరు వైరమును మానియుండిరి. కాని శివాజి దీక్షకిగలుగుటకు నొక సంవత్సరము పూర్వము ఔరంగజేబు తనపన్నులన్నియుఁ దీర్చుకొని శివాజి పైని దనకుఁ గల కసి తీర్చుకొనుటకు నిశ్చయించెను. ఎవరికిఁ దెలియకుండఁ దనసైన్యము నెకాయకి పంపి కాల్యాణ్, భివండీ యను గ్రామములను దనస్వాధీన పఱుచుకొనెను (క్రీ. శ. ౧౬౭౦ మేనెల). విజాపూరువారితో సంధియగువఱకు శివాజి యూరకయుండి ఔరంగజేబు చేయు దౌర్త్యమంతయు సహించుచుండెను. ఇది సమయము కాదని కొన్నిరోజులు వేచియుండి యిటు సంధియైనతోడనే మొగలులతోఁ బోరాట సాగించెను. కాల్బలమంతయు మోరోపంతుపింగళేకును, గుఱ్ఱపు సైన్యమంతయు నేతాజిపాలకరునకు నిచ్చి వారిని మొగలుల

రాజ్యములోనికి దండువంపెను. వారా రాజ్యమునంతను దోచుకొని కొల్ల గొట్టసాగిరి. జున్నర్ అనుపట్టణమునకు నుత్తరమున నున్న యనేక దుర్గములను మోరోపంతుపింగళే సాధించెను. నేతాజిపాల్కర్ దేశము నంతను గాల్చుచుఁ బేల్చుచుఁ గొల్లగొట్టుచు నప్పనంబులఁ గొనుచు ఔరంగబాదు పట్టణము వఱకుఁ దనపేరు గర్భనిర్భేద మగునటులఁజేయ సాగెను. ఇట్లు సర్వదిశలయందుఁ జానేయై యసంఖ్యధనము నార్జించి శత్రువులచేతఁ జిక్కక పూణే (పూనా) పట్టణమునకుఁజేరెను (౧౬౬౦)

ఇట్లు డిల్లీశ్వరునకును మహారాష్ట్రేశ్వరునకును ఘోరకలహము సంప్రాప్తమైన సమయమున ఔరంగజేబు బాదుషహాకు మేనమామ యైన శాహిస్తేఖాన్ దక్షిణము (Deccan)నకు సుబేదార్ (Governor)గా నుండెను. ఆతనికి అమీర్ ఉల్ఉమరా (సామంతశ్రేష్ఠుఁడు) అను గొప్ప పదవి యుండెను. అతనికి ఔరంగజేబు "మీరు వెంటనే యీ మరాఠా వారినిఁ గఠినముగా దండించి వారు మరలఁ దలయెత్తకుండఁ జేసి శివాజీ రాజ్యములోని కోట లన్నియు స్వాధీనపఱచుకొనవలసినది." అని యాజ్ఞ వంపెను వెంటనే శాహిస్తేఖానుఁడు గొప్పసైన్యము వెంటఁదీసి కొని అహమ్మదునగరు పట్టణము మీఁదినుండి పూనాపట్టనమునకుఁ బోవ సాగెను, పూనాకు వెళ్ళుచు నాతఁడు పింగళేఁడు దేశముఖు పైన జాధవ రావును గొంతసైన్య మిచ్చి సుపే యనుగ్రామము సాధించుటకై పంపెను. ఆ గ్రామము సాధించిన తరువాత చుట్టుపట్టు గ్రామము లన్నియుఁ గాపాడుచు శత్రుసైన్యము రాకుండఁ జూచుచుండవలసినది యని యాత నికి వాజ్ఞాపించెను. శాహిస్తేఖానుఁడు పూనాకుఁబోయి యాపట్టణమును స్వాధీనపఱచుకొని యచ్చట విడిసెను. పూనాకు వచ్చుటకు శాత్రవు కనుమును శివాపూరు అనురెండు త్రోవలు, ఆరెండు త్రోవలలోనుండి శత్రులు రాకుండఁ గొంత సిబ్బందిని నచ్చట నునిచెను. ఆ ప్రాంతమున నున్న కోటల రహస్యములను గనుఁగొనుటకై యనేకజారులఁ బంపెను. శానుఁడు దండువచ్చిన సమాచారము తెలిసి శివాజీ రాజుగడను నుండి బయలుదేరి సింహగడముమీఁదికిఁ బోయెను.

శాహిస్తేఖానుఁడు మొట్టమొదట చాకణ్ అనుదుర్గమును సాధింప నిశ్చయించెను. ఈ దుర్గము ఒకటు జున్నరుకును పూనాకును నడుమ నున్నందున ఈ రెండు చోటుల నున్న మొగలాయిలసైన్యములకు ఈ దుర్గము వారివలన మిగుల బాధలుకలుగుచుండెను ఈ దుర్గము క్రీ శ ౧౬౪౭లో శివాజి ఫిరంగోజీ నరసాళా అను వానికిచ్చెను అప్పటినుండి యిదివరకు (16 సంవత్సరములు) వాఁడు దుర్గమునకు నధికారిగానుండి శివాజియాజ్ఞలో నుండెను. శాహిస్తేఖానుఁడు ప్రచండసైన్యము తీసికొని దుర్గమును ముట్టడించెను ఇంత గొప్పసేనను జూచియే భయపడి దుర్గాధిపతి దుర్గమును దనస్వాధీన పఱుచునని ఖానుఁ డనుకొనెను కాని ఫిరంగోజీనరసాళా మొగలాయిల సేనకు భయపడక రమారమి రెండు నెలలవఱకును శత్రువులతోఁ బోరాడుచుండెను మొగలాయిలు దుర్గమును ముట్టడించిన యేఁబదియారవ రోజున దుర్గముయొక్క యీశాన్యభాగమందలి బురుజుక్రింద నొకసొరంగముచేసి మొగలాయిలందులోఁ దుపాకిమందు నింపి యగ్ని ముట్టించి కోటగోడను గొంత పడవైచి త్రోవ చేసికొనిరి. సొరంగములోని మందువలనఁ గోటలోని సైనికు లనేకులు హతులైరి. మొగలాయిలు వెంటనే యా త్రోవనుండి లోపలికిఁ బోవఁజొచ్చిరి కాని దుర్గాధిపతి మిగిలిన సైనికులను వెంటఁదీసికొని మొగలాయిలతో ఘోరముగాఁ బోరాడి రాత్రియంతయు శత్రువులను లోనికిఁ జొరనియ్యఁడయ్యె. ఇంకఁ బోరాడినఁ బ్రయోజనములేదని తెలిసికొని శివాజి ప్రాతఃకాలమున దుర్గాధిపతియైన ఫిరంగోజీనరసాళాకు దుర్గము శత్రుస్వాధీనము చేయుమని వార్తనంపఁగా వాఁడు నావచ్చటినుండి వెడలి దుర్గము మొగలాయిలకు నిచ్చివేసెను. ఫిరంగోజీయొక్క యమితపరాక్రమమును స్వామిభక్తియుఁ జూచి శాహిస్తేఖానుఁ డతని నెంతయుఁ గొనియాడి ఔరంగజేబుతోఁ జెప్పి గొప్పయుద్యోగ మిప్పించెద నని యాశచూపి యాతనిని దనవైపునకు రమ్మనెను. కాని యాతఁ డందునకు నొప్పుకొనక తన సైనికులతో శివాజియొద్దకుఁ బోయెను. శివాజియు నా యప్రతిమరాజభక్తుని మిగుల గౌరవించి భూపాలగడ దుర్గమునకు నధిపతిఁ జేసెను.

చాకణ్‌వంటి యొకచిన్న దుర్గము సాధించుటకు ఖానుఁడు రమారమి వేయిమంది సైనికులను కోలుపోయెను కాన వాఁడు మిగులవధైర్య పడి మరాటవారి కోటలు సాధించుట యాటలుకాదని తలఁచి వాఁడాసమాచారము ఔరంగజేబునకుఁ దెలిపి తనకుఁ దోడుగ నధిక సైన్యములఁబంపుమని కోరెను అందుపై నౌరంగజేబునకు వచ్చుటకు నాలస్య మైనందున నంతవఱకు శాహిస్తేఖానుఁడు పూనాలోనే విడిసియుండెను ఇటు నేతాజి పాల్కారుఁడు క్రిందటి సంవత్సరమువలెనే అహమ్మదనగరు ఔరంగాబాదు మొదలయిన ప్రాంతములు కొల్లగొట్టి యమితధనము వోగుచేసెను (1663) ఇంతలో యశవంతసింగు ఉత్తరమునుండి వచ్చి చేరినందున శాహిస్తేఖానుఁడు నేతాజిపాల్కారును నెదిరించుటకై కొంతసైన్యము పంపెను ఆ సైన్యము నేతాజి వెంటఁ దగిలి యాతని సైనికులననేకులఁ జంపి యాతనిని గాయపఱిచెను ఇంతలో వానకాలము ప్రారంభమైనందున మొగలుల సైనికులు యుద్ధముల మాని విడుదలలోనికిఁ బోయిరి.

శాహిస్తేఖానుఁడు పూనాపట్టణమునందు శివాజీ కొఱకు గట్టఁబడిన మందిరములోనే మిక్కిలిజాగ్రత్తతో విడిసియుండెను ఎంతమాత్రమును మోసము జరుగఁగూడ దని యాతఁడు తన సైన్యములో నదివఱ కున్న మరాటవారినిఁ దప్ప నితర మరాఠాల నెవరిని సైన్యములోఁ జేర్చుకొనలేదు గ్రామములో నే మరాటావారును దనయాజ్ఞలేక శస్త్రమును ధరింపఁగూడదని యాజ్ఞాపించెను. ఇన్ని కట్టుదిట్టము లేర్పఱుచుకొనినప్పటికీ శివాజీ తన యప్రతిమయుక్తిచే నాతనిని మోసపుచ్చెను: శివాజీ తనయొద్ద నున్న యిద్దఱు గుమస్తాలను బంపి ఖానుని సైన్యములోని యొకమరాట సిపాయిని వశపఱుచుకొనెను వాఁడు ఖానునితో "నాయింట నేఁడు వివాహకార్యమున్నది కాన మంగళ వాద్యముతోఁ బట్టణములో నూరేగింపు చేయుటకు నాజ్ఞ కావలయుననిచెప్పి యట్టియనుజ్ఞవడసెను సాయంకాల సమయమున శివాజీ కొంతసైన్యముతో సింహగడము దిగి క్రిందికి వచ్చెను అక్కడ నుండి బయలుదేఱి త్రోవలో నక్కడక్కడ కొందఱు సైనికుల నుంచుచు పూనాపట్టణమునకు వచ్చిచేరెను

తాను జేయవలసిన పని చేసి తిరిగి వెళ్ళునప్పుడు శత్రుసైనికులు తనవెంటఁ దఱిమికొని రాకుండ నాతఁడు మొట్టమొదటనే యొకయేర్పాటు చేసియుండెను. సింహగడముత్రోవ కాక మఱియొక త్రోవను దానుదన సైనికులును బోయిరని శత్రువులకు భ్రమ కలుగవలయు నని కాత్రజు పర్వతములకుఁ బోవుదారి వైపున నచ్చటచ్చట వృక్షములకును ఎద్దుల కొమ్ములకును గుడ్డలుకట్టి సిద్ధముగా నుంచి యేర్పాటుప్రకారము శార్ఙ్గ ధ్వని కాఁగానే కొలఁదిసైనికు లాగుడ్డలకు విప్పుముట్టించి శంఖశార్ఙ్గనాద ములు చేయుచు దమతమతావులకుఁ బాఱిపోవునటుల నేర్పాటు చేసెను. ఇట్లు సిద్ధముచేసి శివాజి తన వెంట తానాజి మాలసురే ఏసాజికంక్ డాదాశీబాపూజీ దేశపాండే మొదలైన విశ్వాసపాత్రులును రణరంగభీము లును నైన యిరువదియైదుగురు సరదారులను వెంటఁ దీసికొని తాను వశ పఱచుకొనిన సిపాయియొక్క యూరేగింపులోని పెండ్లివారివలెనటించుచు గ్రామములోనికిఁ జేరెను.

అర్ధరాత్రివేళ గ్రామ మంతయు నిద్దురవోఁగా శివాజియు నాతని సరదార్లును పూనా పట్టణములోని దొంగత్రోవ లన్నియు నెఱిఁగినవా రగుటచే శాహిస్తేఖానుఁ దేర్పఱచిన కావలివారి నందఱను దప్పించుకొని ఖానుఁడున్న మందిరముయొక్క యావరణములోనికిఁ జేరిరి. అక్కడ నొక గవాక్షముద్వారా పైయంతస్తుపైకి నెక్కిరి. కాని యింతలోఁ గొంచెము శబ్దమైనందున స్త్రీలు మేల్కొని యేమో మోస మున్నది యని భీతి నొంది ఖానుఁడు నిద్రించుచున్న గదిలోనికిఁబోయి యాతనిలేపిరి. ఇఁకఁ దాను దప్పక చచ్చెదనని తలఁచి ఖానుఁ డొక గవాక్షములో నుండి క్రిందికిదుమికి పాఱిపోయెను. కాని యాతఁడు దుముకుసమయమున శివాజీ వెంటనున్న వారిలోని యొకవీరుఁడు కత్తితో వేయఁగా ఖానునిచేతివ్రే లొకటి తెగెను. వ్రేలు పోయినను ఖానుఁడు ప్రాణముదక్కించుకొనెను. కాని యింకొకగదిలో నున్న యాతనికుమారుఁడు శివాజి చేతిలోఁ బడి

పృశ్యుఁ డయ్యెను శిబిరములో నంతట శివాజీవచ్చెనన్న కలకలధ్వని పుట్టి సైనికులందఱు భయభ్రాంతు లైరి. ఇంతలో సంకేతానుసారము కాత్రజా గుట్టలవైపు నుండి గుడ్డల ముట్టించిన వెలుతురును † కొమ్ముల మ్రోఁతము రాఁగా మొగలులు శివాజీ యటుపోవుచున్నాఁ డనుకొని సింహగడముత్రోవ విడిచి యటువైపులకే పోవసాగిరి కాని కొంత దూరము వెళ్ళినపిదప శివాజీ చేసిన మోసము వారికి గోచర మయ్యెను

ఇటు శివాజీ తనయుక్తిచేతను సాహసముచేతను శత్రువులను బూర్తిగాఁ బరాభవించి తన సైన్యముతో సింహగడమునకు వెళ్లెను (1663 ఏప్రిల్)

ప్రాతఃకాలమున మొగలుల సైన్యము మహాకోపముతో శంఖభేరీ రవములు చేయుచు సింహగడముపైకి నెత్తివచ్చెను శివాజీ యాసైన్యములు వెంటనే యెదిరింపక వాని నన్నింటిని బూర్తిగా దుర్గముక్రిందికి రానిచ్చెను. తురకసైన్యములు ఫిరంగిదెబ్బ తగులునంత సమీపమునకు వచ్చిన తోడనే యొక్కసారి సైన్యములపై ఫిరంగుల వర్షము కురియింప సాగెను సహింపలేని యా దెబ్బలకు శత్రువుల యేనుఁగులు పీనుఁగు లయ్యె పతాకాలు క్రిందఁగూలె సైనికులు భయభ్రాంతులై చెల్లాచెదరైరి. ఇంతలో నచ్చటదాఁగియున్న కడతాజీగుజర్ నేతాజీపాల్కర్ ఈమరాటా వీరులు తమసైన్యములతో మొగలులపైఁ బడి యుదివఱకే భయభ్రాంతమయిన యా తురకసైన్యమును బూర్తిగా నోడించి పాఱఁద్రోలిరి. ఇట్లు మరాఠావారిచే మొగలులు సంపూర్తిగాఁ బరాభూతులయిరి

† హ్యానిబాల్ అను కార్థేజ్ సైన్యాధీశ్వరుఁ డిటులనే యెద్దుల కొమ్ములకు గుడ్డలుకట్టి ముట్టించి రోమన్ జనులను మోసపుచ్చెనని రోమక చరిత్రమునం దున్నది.

జరిగిన పరాభవమువలనను పుత్రవధవలనను శాహిస్తేఖానుం డత్యంత విషాదహృదయుం డయ్యె. యశవంతసింగుని యొక్క పరాకు వలన వింత పుట్టె నని యాతని నిందింపసాగె "సైన్యముతో సైనిక భావము నాజ్ఞాధారకతయు లేదు. యశవంతసింగు శివాజీకి వశుండయి యున్నాఁడు" అని ఔరంగజేబునకు వ్రాసి పంపెను ఔరంగజేబు అప్పుడు గొప్పరుగ్ణతనుండి లేచి స్థానాంతరము చేయునలయు ననిన యుద్దేశముతోఁ గాశ్మీరమునకు వెళ్ళుటకు సిద్ధముగా నుండెను ఇంతలో దక్షిణము నుండి యావార్తపోఁగానే యాతఁడు శాహిస్తేఖానుని మాటలు నమ్మక యాతఁడే చేతగానివాఁడని తలచి యాతని బంగళా సుబేదారుగా మార్చి యాతనికి బదులుగాఁ దనపుత్రుఁడైన సుల్తాన్ మోఅజీమ్ అను వాని దక్షిణమునకు సుబేదారుగాఁ బంపెను శాహిస్తేఖానుఁడు వెడలి పోయినతరువాత యశవంతసింగు సైన్యములను దీసికొని ఔరంగా బాదులో విడిసి యుండెను.

ఇట్లు శివాజి కల్యాణపట్టణమునొద్ద నొకటియు ధుండీ రాజపురము నొద్ద నొకటియు, నిట్లు రెండు ప్రచండ సైన్యముల బోగుచేసెను ఒక సైన్యముతో పోర్చుగీజ్ వారి వసయీ పైని దండెత్తెద ననియు రెండవ సైన్యముతో జింజిరా సిద్దీని సాధించెదననియు వదంతులు శివాజి శత్రువు లను మోసపుచ్చుటకు నై ప్రచురింపఁ జేసెను కాని గుజరాతు దేశము లోని పట్టణములలో నత్యంతధనముగలది యైన సురత్ (Surat) పట్టణముపై దండెత్తిపోవుట శివాజియొక్క రహస్యోద్దేశమై యుండెను. బహిర్జీ నాయక్ అనువాని ముందుఁ బంపి యాపట్టణము కొల్లఁగొట్టు నుపాయంబు లన్నియుఁ బూర్తిగా విచారించి యుంచెను. కావలసిన సిద్ధత యంతయు నైనపిదప నాసికపట్టణమునకు దేవదర్శనార్థ మనియు పేష్వాయైన మోరోపంతు పింగళేగారు అటువైపులఁ గ్రొత్తగా సంపా దించిన దుర్గములను జూడవలననియు మిష పెట్టుకొని శివాజి నాసికకుఁ

బోయెను లోపలండఱు శివాజి నాసికక్షేత్రములో నున్నాఁ డనుకొనుచుండ నాతఁడు నకస్మాత్ నాలుగువేల గుఱ్ఱములతో సూరతుపట్టణము పైఁబడెను ఆఱురోజులవఱకు నాపట్టణము యథేష్టముగాఁ గొల్లగొట్టి శివాజి అచ్చటి సుబెదారునకు వర్తమాన మంపి యాతఁడు వచ్చువఱకే యక్కడ సంపాదించిన యపారధనమంతయు రాయగడము చేర్చెను. ఈ తూరి శివాజికిఁ గోట్లకొలఁది ధనము దొరికినది యని చరిత్రకారులు వ్రాసియున్నారు ఆకాలమున సూరతుపట్టణములో డచ్ వారి యొక్కయు ఇంగ్లీషు వారి యొక్కయు దుకాణము లుండెను కాని శివాజి వాని జోలికిఁ బోయినవాఁడు కాఁడు. (౫ వ జాన్యూఅరి ౧౬౬౪)

సూరతుపట్టణమునుండి తిరిగి వచ్చినతోడనే శివాజి తనతండ్రి యైన శహాజియొక్క మృత్యువార్త వినెను. శహాజి వేఁటాడునప్పుడు గుఱ్ఱముమీఁది నుండి పడి బసవపట్టణములో మృతుఁడయ్యెను తండ్రి మరణమునకు దుఃఖించి లక్షలకొలఁది ధనము ఖర్చుచేసి యాతనియుత్తర క్రియలు మహోవైభవముతో సింహగడములోఁ జేసెను. శహాజి మరణానంతరము శివాజి "రాజా" యనుబిరుదు తాను గైకొనెను తన పేరిట నాణెములు బోయసాగెను.

క్రిందటి రెండు సంవత్సరములవలే నీ సంవత్సరమును నేతాజి పాల్కరుఁడు వర్షాకాలమునకుఁ బూర్వము మోగలుల రాజ్యము కాల్పఁ బేల్పం దొడఁగెఁ గాని వాని నెదుర్కొనువారు మోగలులలో నెవ్వరు లేరైరి అటు సముద్రము మీఁదను మరాటావారి శౌర్యం బసహ్యం బయ్యె మక్కా యాత్రకుఁ బోవు ననేకతురుష్కులతో నిండియున్న మోగలుల యోడలన్నియుఁ బట్టుకొని నా యాత్రికులయొద్దనుండి యప్పనంబులు తీసికొని గాని వారిని మరాటావారు విడువరైరి ఆగస్టు (౧౬౬౦) నెలలో శివాజి స్వయముగా దాడికిపోయి అహమ్మదు నగరమును దోఁచుకొని ఔరంగాబాదువఱకు దేశమునంతను జీకాకుపఱచెను శివాజి మోగలులతోఁ బోరాడుచున్నందునఁ దాము బోఁగొట్టుకొనిన కొంకణప్రాంతము మరల సంపాదించుకొనుట కదియే మంచిసమయమని

తలంచి చేసిన సంధికి విరుద్ధముగా విజాపూరునవారు కొంకణముపైకి సైన్యములఁ బంపెను గాని శివాజి సవ్యసాచిత్వమును వహించి యెప్పటఁ జూచినను దానె యై యుద్ధముశత్రువులను జర్జరితులఁ జేసెను. శివాజి యనువాఁ డొకఁడా, లేక పదిమందా? యని శత్రువులకు భయముకలుగు నటులఁ బ్రవర్తించె. ఎవరికిఁ దెలియకుండ నొక్కసారి కొంకణమునకు వచ్చి విజాపూరుసైన్యముల నెదిరించి వాని నోడించెను. ఆ యుద్ధమున నాలువేల సైనికులు నిహతులైరి. ఆ యుద్ధసమయమున వేంగర్లే యను గ్రామనివాసులు శివాజిని నెదిరించినందున నాతం డాగ్రామమును గాల్చి వేసెను. ఇంతపని చేసి వెంటనే యాశూరుండు సింహగడమునకు మోగలుల నెదిరించుటకునై వచ్చెను గాని యిప్పుడు మోగలులు తమ రాజ్యములోనే యుండి యగ్రేసరులై యుద్ధమునకు రాక పోయిరి.

ఇట్లు మోగలులు ప్రస్తుతము నిద్రించి యున్నారని చూచి శివాజి కొంతసైన్యము విజాపూరువారి రాజ్యములోనికిఁ బంపి కొంతభాగము కొల్లగొట్టించెను. తాను స్వయముగా మోగలుల సైన్యముపై నర్ధరాత్రమున పడెద ననినవదంతి యొకటి పుట్టించి యెవ్వరికి సంశయము రాకుండ సముద్రములోఁ బడవల నన్నింటినిఁ బోగుచేసికొని సముద్రప్రయాణము చేసి యొక్కసారి బసనూర్ (బారసిలోర్) పట్టణముపైఁ బడెను. సురత్ పట్టణమువలెనే యాపట్టణమును కొల్లగొట్టి యసంఖ్యధనము సంపాదించి శివాజి గోకర్ణమునకుఁ బోయెను. అక్కడఁ గొంత దానధర్మము చేసి చుట్టుపట్లనున్న గొప్పపట్టణములఁ గొల్లగొట్టెను. కారవార్ పట్టణము వారు శివాజీని నెదిరించిరి. కాని తుదకు వారును కప్పమియ్యవలసిన వారైరి. ఆ పట్టణములో ఇంగ్లీషువారి దుకాణముండెను. వారు శివాజికి వేయిరూపాయి లప్పన మిచ్చిరి (1665 ఫిబ్రేవరి) అక్కడినుండి భూమార్గమున సైన్యమునుబంపి తాను జలమార్గమున రాయగడమునకు బయలుదేఱెను. కాని యెదురుగాలి యైనందున నోడలు మరల గిందికి వచ్చి యాయాసపడి కొంతనష్టము బొందెను. సముద్ర ప్రయాణమువలన లాభములేదని తలఁచి యా తరువాత శివాజి యెన్నఁడును స్వయముగా సముద్రప్రయాణము చేసినవాఁడుకాఁడు.

శివాజి సముద్రయానమునకుఁ బోయినప్పుడు ఔరంగజేబు యస వంతసింగును తనకుమారుఁ డయిన సుల్తాన్ మొఅజిమ్ అనువానిని (వీరిద్దఱును దక్షిణములోని సైన్యాధిపతులు) తనయొద్దకుఁ బిలిపించు కొని వారికి బదులుగా జయపూరురాజయిన జయసింగును దిలేర్‌ఖాన్ పరాన్ అను తురుష్కుని దక్షిణమునకు శివాజిపైకిఁ బంపెను.

రాజాజయసింగును దిలేర్‌ఖానుఁడును నర్మదానది దాఁటి శివాజి సముద్రప్రవాసములో నున్నప్పుడు తమ సైన్యములతో దక్షిణమునకు వచ్చి చేరిరి. జయసింగు ఏప్రిల్‌నెలలో పూనాపట్టణములో విడిసెను. అతఁడెంతమాత్రమును నాలస్యము చేయక వెంటనే పురందరదుర్గమును ముట్టడించి యాముట్టడి పనిని దిలేర్‌ఖానుని కప్పఁజెప్పి తానుస్వయముగా సింహగడమును ముట్టడించి విడిసెను. కొంతసైన్యమును రాయగడము వైపునకును బంపెను శివాజి నేతాజిపాల్కరును రాజ్యములో నుంచి పోయెను. గానివాఁడు శత్రువులతోఁ బోరాడక యితరదేశములు కొల్ల గొట్టుటకై పోయెను కడతాజి యను గుఱ్ఱపురౌతుల యధిపతి యొక్కఁ డుండెను గాని మొగలుల ప్రచండసైన్యమును నెదుర్కొను నంతబలంబు వానియొద్ద లేదయ్యె కాన మొగలులసైన్యము అడ్డములేక మరాటావారి కోటలను నుద్దండతతో నాక్రమింపఁ జొచ్చెను

ఇట్లు పరసైన్యము లన్నియుఁ దనరాజ్యములో విచ్చలవిడిగాఁ దిరుగుచున్న సమయమున శివాజి సముద్రయానము నుండి తిరిగివచ్చెను. వెంటనే రాయగడమునకుఁ బోయి తన సరదార్లందఱను బిలిపించి పెద్ద సభ చేసి మొగలుల నెదుర్కొను మార్గం బెయ్యది యని యాలోచింపఁ దొడఁగిరి కాని శత్రుసైన్యమమిత మైనందునను జయసింగు అనమాన పరాక్రమవంతుఁడై నందునను నాతని నెదిరించు నుపాయంబేమియు నెవ్వ రికిఁ దోపఁదయ్యె ఆలోచన లనేకములు చేసిరి, కాని యొక్కటియుఁ గొనసాగు మార్గము లేకపోయెను. అప్పుడు సమయజ్ఞుఁడైన శివాజి జయ సింగునితో యుద్ధము చేసిన లాభములేదని తెలిసికొని సంధిచేయుటయే హిత మని నిశ్చయించెను.

పురందరుదుర్గమును ముట్టడించిన దిలేర్‌ఖాన్ అవిశ్రాంతముగా దుర్గమును స్వాధీనపఱచుకొను ప్రయత్నంబు చేయుచుండెను కాని వీని ప్రయత్నములన్నియు దుర్గాధిపతి యగు మురార్ బాజీదేశపాండే యను వాఁడు నిష్ఫలము చేయుచుండెను మొగలులే దిక్కునుండి పైకినెక్క ప్రయత్నించిరో నా దిక్కునుండి వారిపై బాణపరంపరలు గురిపించి వారిని చెదరఁగొట్టుచుండెను ఆ దుర్గములో నున్న రెండువేల వీరులు శత్రువులతో ఘోరముగాఁ బోరుచుండిరి తుదకు దిలేర్‌ఖాన్ కొందఱు మరాటా వీరులను వెనుకకు నెట్టి దుర్గముయొక్క యొక బురుజుక్రింద సొరంగము చేయఁజొచ్చెను మరాటావీరులుపెట్టు బాధ కెట్టులైననోర్చి కొని యా సొరంగము పూర్తిచేసి యందు మందునింపి నిప్పు ముట్టించి కొంత భాగము కూల్చి మొగలుల సైన్యములు లోపలికిఁ జొరఁబడెను చొరఁబడు సమయమున మొగలులు గొంత తొందరపాటుపడి యవ్యవస్థితు లయినందున నిదియే సమయమని తలఁచి మరాటావీరులు పైనుండి ఫిరంగి దెబ్బలతో శత్రువులను చెదరఁగొట్టిరి వాండ్రు పాఱిపోవునప్పుడు వారివెంటఁ దగిలి దుర్గాధీశుఁడు రెండువేల మొగలు సైనికుల నఱకెను. కడమ సైనికు లందఱుఁ బాఱిపోయిరి. దిలేర్‌ఖానుఁడు ఏనుఁగుమీఁద గూర్చుండి యుద్ధమంతయుఁ జూచుచుండెను తన సైనికులు పాఱిపోవుట చూచి వారి నందఱ మరలఁబోగుచేసికొని పంబిన కోపముతో దుర్గాధిపతియైన మురార్‌బాజీ పోరాడుచున్నచోటికిఁ బోయెను గాని మరాటా (మావళా) వీరులు విజృంభించి పోరాడునప్పు డెట్టి శత్రువులనైన లక్ష్యపెట్టువారు కారు ఇట్లు ఉభయ సైన్యములు ఘోరముగాఁ బోరుచుండ దిలేరుఖానుఁడు సూటిగా బాణమువేసి దుర్గాధిపుఁడైన మురార్ బాజీని పడవైచెను. తమ నాయకుఁడు పడుట చూచి మావళే వీరులు భీతిఁజెంది పై కోటమీఁదికిఁ బోయిరి. మొగలులు మరలఁ గ్రింది బురుజును నాక్రమించుకొనిరి కాని పైనుండి వచ్చు ఫిరంగి గుండుల కోర్వలేక యా బురుజునుగూడ వారు మరల విడువవలసినవారైరి.

ఇట్లు పురందరు దుర్గము ఉత్తర దిక్కునుండి సాధించుట యసాధ్యమని తలఁచి దిలేర్ ఖానుఁడు పురందరమునకుఁ నీశాన్యమున నున్న

వజీర్‌గడ మను కోటను ముట్టడించి సాధించెను. కోటమీఁద ఫిరంగు లుంచి యక్కడినుండి పురందరము యొక్క పై కోటమీఁద గుండ్లు వేయఁజొచ్చెను కాని యప్పుడు వర్షాకాలము వచ్చినందునను మోగలుల యొద్ద యుద్ధ సామగ్రి పూర్తిగా లేనందునను ఆ గుండ్లవలన పురందరు కోటలోని వారి కేమియు హాని కలిగినది కాదు అయినను పురందరులోని వీరు లందఱు హతాశులై సందునఁ బోరాడినందున లాభములేదని తలఁచి వారు దుర్గమె శత్రుస్వాధీనము చేయుటకు సిద్ధపడిరి కాని తాను వర్తమాన మంపువఱకును దుర్గము వదలవలదని శివాజి యాజ్ఞాపించినందున ఆ యాజ్ఞకు లోఁబడవలసిన వారైరి

ఇఁకఁ బురందరు కోట శత్రువుల చేతిలోఁ బడకుండ నుండ నేరదు, అది శత్రువులచేతఁ జిక్కనేని కడమదుర్గము లన్నియు సుల భముగాఁ జిక్కును ఇఁక మోగలులతోఁ ద్వరగా సంధి చేయుటయే మేలు కోట లన్నియు శత్రువుల చేతిలోఁ జిక్కిన తరువాత సంధికి నొడఁబడుట మేలుకాదు అని తలఁచి శివాజి సంధి మాటలు మాటలాడు టకై జయసింగు నొద్దకు రఘునాథ భట్‌పండితరావ్ అనువానిఁబంపెను. జయసింగుఁ డా రాయబారిని మిగుల గౌరవించి యాతఁడు చెప్పు మాట లన్నియు శ్రద్ధతో వినెను శివాజి మనలను మోసపుచ్చవలయు నని యీ యుక్తి చేసె నేమో యని మొట్టమొదట జయసింగుఁడు తలఁచెను గాని రాయబారి ప్రమాణపూర్వకముగా నిజస్థితిఁ దెలిపిన తరువాత జయసిం గుఁడు సంధికి నిష్టపడి శివాజికి నిట్లు వర్తమాన మంపెను. "ఔరంగ జేబు" బాదుషహా సార్వభౌముఁడు, బలవంతుఁడు. అతనితో సఖ్యము చేయుట నీకు మంచిది, అతనితోఁ గలహించి నీవు బ్రతుకనేరవు. నేను హిందూరాజను, నీవును గొప్ప వంశములోని వాఁడవు నీవు హిందూమత సంస్థాపన చేయుచున్నా వని నాకు సమ్మతమే నీవు ఢిల్లీశ్వరుని శరణు జొచ్చిన నాతఁడు నిన్ను క్షమించునట్లును నీకుఁ గొంత జాగీరు ఇచ్చు నట్లును నేను జేయఁగలను" ఇట్లు శివాజికి రాయబారివలన జయసింగు మనోభీష్టము తెలియఁగా నాతఁడు జయసింగును జూచి స్వయముగా

మాటలాడుటకు సింహగడమునొద్దకువచ్చెను జయసింగుడు స్వయముగా శివాజికి నెదురుగాఁ బోయి యాతనిని గౌఁగిలించుకొని గౌరవించి తనకుఁ గుడిపైపునఁ గూర్చుండఁ బెట్టుకొని మిక్కిలి ప్రేమతో సంధి మాటలు ముచ్చటించెను తరువాత శివాజివెంటఁ దన మేనమామ యైన సుభాన సింగును నిచ్చి పురందరులో నున్న దిలేరుఖానుని యొద్దకుఁ బంపెను. ఆ ఖానుఁడును శివాజి వేఁడిన సంధికి నొప్పుకొనెను వారందఱుఁ గూడి సింహగడమునకుఁ దిరిగి వచ్చిరి ఇట్లు కొన్ని రోజు లాలోచనలు జరిగి తుదకు రాజా జయసింగు ఔరంగజేబున కుత్తరము వ్రాసి తనకును శివాజికిని జరిగిన యొడంబడిక లాతనికిఁ దెలుపవలయుననియు, ఆతనియొద్ద నుండి జబాబు వచ్చినతరువాత సంధి స్థిరపఱుపఁబడు ననియు నిర్ణయించిరి. ఆ యొడంబడిక లెవ్వియన :—"ఢిల్లీశ్వరుని రాజ్యములోనివి యై శివాజిచే నాక్రమింపఁ బడినవియు నాతనిచే నూతనముగా నిర్మింపఁబడి నవియు నయిన ముప్పదిరెండు దుర్గములలో పురందరు, సింహగడము, మఱి పదునెనిమిది దుర్గములు గలిసి ౨౦ దుర్గములను, వానిచుట్టుపట్టుల నున్న ప్రదేశమును శివాజి జయసింగునకు స్వాధీనపరుపవలయును కడమ పండ్రెండు దుర్గములును, వాని చుట్టునున్న లక్ష హొనుల ప్రాంతమును, నిదివఱకు నాతఁడు ప్రభుత్వము చేయుచున్న యితర ప్రాంతమును,శివాజి తనకొఱకై యుంచుకొని యది బాదుషహా వలన నియ్యఁబడిన జాగీరుగా నెంచవలసినది. శివాజీ కుమారుఁడైన యెనిమిది యేండ్ల సంభాజికి బాదుషహావలన నైదువేల గుఱ్ఱపు సవార్ల మనసబు దొరకవలయును ప్రస్తుతము శివాజీ బాదుషహా కిచ్చుచున్న దుర్గములకు మాఱుగాను, నిదివఱ కాతనికి అహమ్మదు నగరము రాజ్యములో నున్న దేశముఖు హక్కులకుఁ గాను, విజాపూరు రాజ్యములో చౌధ్ (నాలుగవ వంతు) సర్‌దేశముఖి హక్కులు బాదుషా శివాజీ కియ్యవలెను ఈ హక్కుక్రిందవచ్చు ధనము స్వయముగా శివాజి వసూలుచేసికో వచ్చును ఈ హక్కు లిచ్చినందులకు ఔరంగజేబుకు శివాజి పేష్కషు క్రింద ౪౦ లక్షల హొనులు, సంవత్స

ధమునకు మూడు లక్షల చొప్పునఁ జెల్లింపవలయును పని పడ్డప్పుడు సైన్యములఁ బంపి బాదుషహాకు సాయము చేయవలయును.”

పైని వర్ణింపఁబడిన యొడంబడిక లన్నియు నొప్పుకుని ఔరంగజేబు శివాజి కొక పెద్ద యుత్తరము పంపెను అందుపై వీరికిని వారికిని స్నేహభావము కుదిరి సంధి యయ్యెను అంతట జయసింగు, విజాపూరు నవాబు ఢిల్లీశ్వరుని ధిక్కరించి కరభార మియ్యనందున నాతనిపైకి దండెత్తి వెడలెను ఈ యుద్ధమునందు శివాజి రెండువేల యశ్వబలముతోను ఎనిమిదివేల కాల్బలముతోను, జయసింగునకు సాయము చేయుచుండెను మరాటావారి సాయమువలన జయసింగుఁ డనేక గ్రామములను సాధించెను.

# తొమ్మిదవ ప్రకరణము

## డిల్లీ ప్రయాణము

విజాపూరువారితోఁ బోరాడునపుడు తన సైన్యములకు శివాజి సహాయము చేసినాఁడనియుఁ దనకొఱకు ననేకదుర్గముల సాధించినాఁడనియు విని ఔరంగజేబు సంతసించి, తన సంతోషమును వెల్లడిచేయుటకై ప్రశంసించుచు శివాజి కొక యుత్తరము వ్రాసి యందుతోఁ గొన్ని కానుకలను బంపెను తరువాతఁ గొన్నిరోజులకు మఱియొక జాబు పంపి యందు "నీవొకసారి దిల్లికి వచ్చి మమ్మును జూచి పోవలసినది. నీ విక్కడికి వచ్చిన యెడల నిన్ను గొప్ప సరదారునుజేసి గొప్పరాజకీయ కార్యములపై నియుక్తునిఁజేసెదము—" అని వ్రాసెను-ఈ యుత్తరము శివాజి జయసింగునకుఁ జూపి యతని యభిప్రాయ మడుగఁగా వెళ్ళవలసినదియే యని యాతఁడు సలహా చెప్పెను. అందుపైఁదాను రాఁగలనని బాదుషాకుఁజెప్పుటకై తన వకీలగు రఘునాథబల్లాళకోండే యనువాని ముందుగా దిల్లీకిఁ బంపెను ఆతఁడు దిల్లీకిఁబోయి, అక్కడి రాజకీయస్థితి యంతయు, అచ్చట సరదార్ల ప్రవర్తనము, మొదలగు సంగతులన్నియు రహస్యముగాఁ గనుఁగొని తనకుఁ దెలియజేయవలయు నని యేర్పాటు చేసెను తాను దిల్లీకిఁ బోవునప్పుడు తన రాజ్యముయొక్క పరిపాలన చక్కఁగా జరగవలయు నని రాజ్యతంత్రములన్నియు మోరోపంతు పింగళే, ఆబాజిసోనదేవుఁడు, అణ్ణాజీదత్తో అను ముగ్గురు సరదారుల చేతికిచ్చి, వారియాజ్ఞను దనయాజ్ఞగాఁ జూచుచుండవలయు నని యందఱు సేవకులకు నాజ్ఞాపించెను. బయలుదేఱుటకుఁ బూర్వము శివాజీ స్వయముగాఁ దనదుర్గముల నన్నింటిని బరీక్షించి చూచెను.

తనవెంట నైదునూర్ల యశ్వసైనికులను, వేయిమంది మావళే వీరులను దీసికొని, తన కుమారుఁడయిన సంభాజితోఁగూడ శివాజి క్రీ శ ౧౬౬౬ వ సంవత్సరపు మార్చినెలలో దిల్లీకి బయలుదేఱెను నర్మదానది దాఁటి మధురాబృందావన క్షేత్రములను దర్శించి వారందఱు దిల్లీచేరిరి. జయసింగు కుమారుఁడగు రామసింగును మఱికొందరు చిన్న సరదార్లు తప్ప నెవరును శివాజికి నెదురుగా వచ్చినవారుకారు ఉత్తరము వ్రాసి నన్నుఁ బిలిపించి గొప్పవారినెవరిని నాకు నెదురుగాఁ బంపక పోయెనని శివాజికిఁ గొంత మనస్తాపము గలిగెను తరువాతఁ పేరోలగమున ఔరంగజేబును చూడఁబోయినప్పుడును దగిన సన్మానంబు జరుగదయ్యె ఔరంగజేబు నిండిన సభలోఁ గొలువుండఁగా శివాజి వెళ్లి, జోహారువేసి తాను దెచ్చిన కానుక లొసంగఁగా "ఎప్పుడు వచ్చితి"రని యడిగి తన కుడివైపున నిలువఁబడియున్న రాజపుత్రులలో నిలువఁబడుమని కనుసంజ్ఞ చేసెను డిల్లీశ్వరుఁడు తన్ను గొప్పసరదార్లలోఁ గూర్చుండఁ బెట్టి గౌరవించునని తలఁచి వెళ్ళిన శివాజి యటులఁగాక తన్ను నిలువఁబెట్టినందులకు నెంతయుఁ గోపించె, ఔరంగజేబు మనస్సునకుఁ దగులునట్టి కొన్నిమాటలు యనెను తరువాత శివాజి తాను దిగిన బసకుఁ బోఁగా "రేపటినుండి నీవు పేరోలగమునకు రానక్కఱలేదు. ఏమి మాటలాడవలసియున్నను రాయబారి ద్వారా మాటలాడవచ్చును" అని ఔరంగజేబు శివాజికి వార్తపంపెను. అందుపై శివాజి తాను దిల్లీకి వచ్చి మోసపోయితినని తెలిసికొని యిఁక ముందు బాదుషా యేమి చేయఁ దలఁచినాఁడో తెలిసికొనుటకై యాతనియొద్దకుఁ దనవకీలును బంపి "మీరు రమ్మని జాబు లంపినందున మేమిక్కడికి వచ్చినారము మేము మా చేతనైనంత మీసేవ చేసినారము అందులకు మీరు చౌథ్ (నాలుగవ భాగము) సర్దేశముఖి హక్కులను గుఱించి మాకు సనదులియ్యవలసియది దక్షిణములోని గోలకొండ విజాపూరు రాజ్యములను సాధించుటకు మీకు మేమెంతయైన సాహాయ్యముచేయఁ గలవారము అయినను ఆ సాహాయ్యము మీ కక్కఱ లేనియెడల మాదేశమునకుఁ బోవుటకు మాకు

సెలవిప్పింపవలసినది ఇచ్చటి నీళ్ళు మాకును మా పరిజనంబులకును గిట్టవు గాన మాకు వెళ్ళుటకు సెలవిప్పింప వలసినది" అని విన్నవించు కొనెను. అందులకుఁ దగిన ప్రత్యుత్తరం బియ్యక ఔరంజేబు ఊరికొత్వా లగు పౌలాద్ ఖానునిఁ బిలిచి "శివాజీ దగిన బసకుఁజుట్టును పహారా యుంచి, అతఁ డెక్కడికివెళ్ళినను నాతనివెంట మనజంత్రోతుల నుంచుచు నాతఁ డెక్కడికిని పాఱిపోకుండఁ జూచుచుండవలయు"నని యాజ్ఞా పించెను

ఇట్లు తన్ను ఖైదుచేసినందునఁ దన్నౌరంగజేబు ఏవేళ నేమి చేయునో యని చింతించు నా మహాసంకటములో నుండి బయటఁబడు టకు నుపాయంబు యోజించుచుండెను కొన్ని రోజులయిన తరువాత "మాదేశమునకుఁ బోవుటకు నకు సెలవిచ్చుటకు పీలు లేదేని మాసైని కుల కైనను సెలవిప్పించునది ఇక్కడి నీరు పడక వాండ్రలో ననేకులు రోగగ్రస్తులై యున్నారు' అని శివాజి రామసింగుద్వారా ఔరంగజేబుతో విన్నవించెను సైన్యము లన్నియు వెడలిపోయిన తరువాత శివాజి యొక్కఁడే తనచేతఁ జిక్కుననిన యాశచే స్వదేశమునకు వెళ్లుటకు శివాజి సైన్యముల కన్నింటికి ఔరంగజేబు అజ్ఞయిచ్చెను వెంటనే శివాజి సైన్యము లన్నింటిని నింటికిఁ బంపి యత్యంత విశ్వాసపాత్రు లయిన కొలఁది సేవకులను మాత్రము తనయొద్ద నుంచుకొనెను ఇట్లు సైన్యము లన్నింటిని బంపి తాము కొలఁదిమంది యున్నందున నక్కడినుండి యెట్లయినను దప్పించుకొని పోఁగల నవిన ధైర్యము శివాజికిఁ గలిగెను

చెఱలోనుండి తప్పించుకొని పోవుటకు ... వన్నిన యుక్తి యత్యద్భుతంబు అందువలన నతని కల్పనాకౌశలంబు ను సమ్యక సాహ సంబును వ్యక్త మగును దిల్లీ పట్టణములో నున్న సామంతరాజుల యొక్కయు సరదారులయొక్కయు గొప్ప రాజకీయోద్యోగములలోనున్న వారియొక్కయు, స్నేహభావములు శివాజి క్రొత్తగా సంపాదించుకొను చుండెను వారి యందఱయింటికి ఫలాదులను మిఠాయి మొదలయిన ద్రవ్య ములను బుట్టలలోనించి బహుమతిగాఁ బంపుచుండెను ఆ బుట్టలలో

నేమి యుండునో యని మొట్టమొదట పహరామీఁది సంరక్షకభటు లాబుట్టలను విప్పించి చూచుచుండిరి. కాని యట్టిబుట్టలు రోజు ననేకము వచ్చుచుఁ బోవుచు నున్నందున భటులు నిశ్శంకులై పరీక్షింపకయె బుట్ట లను బోనిచ్చుచుండిరి అంతట శివాజీ తనయొద్ద నున్న విశ్వాసపాత్రు లగు సేవకుల నందఱను నొకొ్కక్క నెపముచేఁ దనయొద్దనుండి వెడలఁ గొట్టెను వారు మారువేసములు వేసికొని యా పట్టణములోనె శివాజీ రాకకు నెదురుచూచు చుండిరి ఇంత సిద్ధతయైన పిదపఁ దనకు శరీరము నెమ్మదిగా లేదని నటించుచుం గొన్నిరోజులు శివాజీ యిల్లు వెడలకుం డెను ఒక్కరోజు సాయంకాలము శివాజియు సంభాజియు నొకొ్కక బుట్టలోఁగూర్చుండి మిఠాయిబుట్ట లనునెపమున పహరాలోనుండి తప్పిం చుకొని పోయిరి.

తాము వెళ్ళినతోడనే యాసంగతి యచ్చటిభటులకుఁ దెలిసిన యెడల భటులు తమ్మువెంబడింతు రని తలఁచి యటులఁగాక పాఱిపోవు టకుఁ దమకు వీలు చిక్కవలయు నని శిబిరము వెడలునపుడు శివాజి యొకయుక్తి పన్ని పోయెను తాను శయనించు మంచముపైఁ దనయొద్ద నున్న యొకసేవకుని బరుండఁబెట్టి తాను గప్పుకొనుశాలువ యాతనికిఁ గప్పి యొక్క కుఱ్ఱవానిని వానికిఁపాదము లొత్తుచుండునటుల నియ మించెను శివాజి పాఱిపోయిన కొంతకాలమునకు నొక సంరక్షభటుఁడు వచ్చి శివాజికి నేఁడు శరీర మెట్లున్నది యని యడుగఁగా నాకుఱ్ఱవాఁడు "నేఁడు యజమానులవారికి శిరోబాధ యత్యధికముగా నున్నది గాన మీ రెవ్వరును నిక్కడికివచ్చి బాధఁ బెట్టవలదు" అని చెప్పెను. అందుపై ఆ రాత్రియంతయు నచ్చటి కెవ్వరు వచ్చినవారు కారు తెల్లవాఱిన తరువాత నా సేవకుఁడు యజమానికి మందు తెచ్చెదననియు నాకుఱ్ఱ వాఁడు మఱియొకనెపమునను వెలువడిరి ఇట్లు శివాజికొంతతనచాతుర్యము వలనను గొంత మొగలుల తెలివితక్కువ వలనను ఔరంగజేబు వలలో నుండి తప్పించుకొనెను

రెండవరోజు రెండు జాములవఱకును వేచియుండి శిబిరములో

నెవ్వరున్న జాడ కానక భటులు శిబిరములోనికిఁ జొచ్చిచూడఁగా శివాజి తమ్ము మోసపుచ్చి పాఱిపోయినాఁడని వారికిఁ దెలిసెను. ఆ వార్త వారు కొత్వాలునకుఁ దెలుపగాఁ వాఁడు భయపడుచు నా సంగతి బాదుషహాతోఁ జెప్పెను అందుపయి నాతఁడు కొత్వాలునిపై మిగులఁ గోపించి యాతని మనసబు తీసివేసి శివాజీని వెదకుటకయి గ్రామమునం దంతటను చారులను బంపెను కాని శివాజి కానరానందున నాతనిఁ బట్టి కొనుటకుఁ దాలూకాదారుల కందఱకును నుత్తర్వు లంపెను.

శివాజి దిల్లీనుండి వెలువడిన తరువాత బైరాగివేషము వేసికొని, వచ్చిన త్రోవనే మరలఁ దన దేశమునకుఁ బోయిన యెడల బాదుషహా యొక్క మనుష్యులు తన్నుఁ బట్టుకొని యెద రేమో యని తలఁచి కాశి గయ ప్రయాగ మొదలయిన క్షేత్రములకుఁ దినుండి వెళ్ళ నిశ్చయించెను. మొట్టమొదట మథురాపట్టణమునకుఁ బోయి చిన్నవాఁడైన తన కుమారుఁడు తనవెంట నిడుమలు పడఁజాలఁ డని యచ్చట మోరో పంతు పింగళే యొక్క బావమఱఁది యుండఁగా నాతనియొద్ద సంభాజి నుంచి తీర్థయాత్రలు సేవించుచు నెవ్వరిచేతఁ బడకుండ బయలుదేఱిన తొమ్మిది నెలలకు శివాజి రాయగడకోటఁజేరెను (౧౬౬౬, డిసెంబరు) సురక్షితముగాఁ జేరినందులకు శివాజి గొప్ప యుత్సవము చేసెను శర్కర పంచిపెట్టిరి, ఫిరంగులు కాల్చిరి. తాను జేరినతరువాత మనుష్యులనుబంపి శివాజి తన కుమారునిఁ బిలిపించుకొనెను.

శివాజి దిల్లీకిఁ బోయివచ్చు నప్పటికి దక్షిణమున శివాజికి ననుకూలము లయిన సంగతు లనేకము జరగెను శివాజి వెళ్ళినతరువాత జయసింగొక్కఁడే విజాపూరు నవాబుతోఁబోరాడుచుండెను విజాపూరువారికి సహాయముగా గోలకొండవారును సైన్యములు పంపిరి వర్షములు తక్కువైనందున మొగలుల సైన్యమునకుఁ జాలినంత నీరు లేకపోయెను. జయసింగునకు సహాయముచేయుటకు ఔరంగజేబు సైన్యము లేమియుఁబంపిన వాఁడు కాఁడు. ఇందువలన శత్రువులు జయసింగును మిగుల బాధపెట్ట సాగిరి. తాను హిందు వయినందునఁ దనసైన్యము లన్నియు నశించినను

ఔరంగజేబున కెంతమాత్రమును జింతకలుగనేరదని తలఁచి, జయసింగు విజాపూరి వారితోఁ బోరాట మాని అహమ్మదు నగరము చేరెను తాను ఢిల్లీశ్వరుని కొఱకై సాధించిన కోటలనన్నింటిని రక్షించునంత సైన్యము జయసింగునొద్ద లేనందున నాతఁడు కొన్ని గొప్ప కోటలపై మాత్రము తన సైనికులనుంచి కడమకోటల నన్నింటిని, శత్రువులకుఁబనికిరాకుండ జెఱచివేసెను ఇంతలో శివాజి ఢిల్లీనుండి పాఱిపోఁగా జయసింగుకుమారుఁడైన రామసింగు సాహాయ్యమువలన నాతఁడు పారిపోయినాఁడని సంశయించి ఔరఁగజేబు రామసింగును రాజసభకురావలదని నియమించి ఆతని తండ్రియైన జయసింగును దక్షిణము సుబేదారినుండి తొఁగించి, మరలఁ దన కుమారుఁడైన మొఅజీమ్ అనువానిని, యశవంతసింగును దక్షిణమునకుఁబంపెను తన యోగ్యత ఔరంగజేబు కనుఁగొనకపోయెనే యనిన చింతచేత జయసింగు ఉత్తరహిందూదేశమునకుఁ బోవుచుఁ ద్రోవలో మృతిఁజెందెను. జయసింగు మృతిఁజెందిన పిదప డిలేర్ ఖానునిఁ గూడ ఔరంగజేబు దక్షిణమునుండి మార్చి మాళవాకుఁ బంపెను. (౧౬౬౭)

ఇట్లు ఘనత వహించిన యిద్దరు సేనాధిపతులఁ బనినుండి తొలఁగించి ఔరంగజేబు వారి స్థానమం దిద్దఱు సామాన్యులయిన సరదారుల నియమించినందున శివాజికి లాభమయ్యెను. ఇప్పుడు వచ్చిన యశవంతసింగు జోధపురపు రాజు ఈతఁడు వయస్సునందుఁగొంత పెద్దవాఁడును సంభావిత ప్రవర్తన గలవాఁడును అయియుండెను శివాజి ఢిల్లీలో నున్నప్పు డీతనితో స్నేహముచేసి యితని లోభ స్వభావమును గనుఁగొనియుండెను. ఈ రాజు హిందూధర్మమునం దత్యంతాభిమానము గలవాఁడై జిజియా యను హిందువులపై నున్న పన్నును గుఱించి యొక పెద్ద ఉత్తరము ఔరంగజేబునకు వ్రాసియుండెను. ఈ యుత్తరము శివాజి ప్రేరణచేతనే వ్రాసెనని కొందఱు చెప్పెదరు. ప్రస్తుతము దక్షిణమునకు సుబేదారుగా వచ్చిన సుల్తాన్ మొఅజీమ్ అనుఁవాడు ఔరంగజేబునకు రెండవ కుమారుఁడు సుస్వభావము గలవాఁడు ఆతఁడు

శౌర్యౌదార్యములను గుఱించి విశేష విఖ్యాతిఁజెందె తండ్రివలె నెవ్వరిని నమ్మకయుండువాఁడు కాఁడు కాని వానియందు విలాసలోలుపత అమిత వ్యయము, పరీక్షింపక యందఱను నమ్ముట, అను మూఁడు దుర్గుణంబు లుండెను

ఏ రిరువురు వచ్చుటకుఁ బూర్వమే మోరోపంతు పింగళే జయ సింగుచే విడువఁబడిన కోట లన్నింటిని నాక్రమించి మరల బాగుగాఁ గట్టించి తన సైన్యములను వానియం దుంచెను శివాజి ఢిల్లీనుండి వచ్చు వఱకే యీ మంత్రశిఖామణి కల్యాణ ప్రాంతమంతయు మొగలుల యొద్ద నుండి సాధించియుండెను కాని క్రొత్తగా వచ్చిన యిద్దఱు సేనాధిపతుల స్వభావమును శివాజియెఱిఁగి యున్నందునఁ బ్రస్తుతము పరాక్రమముకంటె ధనము వలననే యధిక లాభ మగునని నిశ్చయించెను రాజపుత్రునకును యశవంతసింగునకును గావలసినంత ధనం బొసంగి వరిని శివాజి వశ పఱచుకొనెను శివాజి "మాకును బాదుషహాకును సంధి కుదర్చవలసినది బాదుషహా మా వలన సేన తీసికొనినవాఁడు కాఁడు అయినను వారి సేవ చేయవలయునని మాకు నిచ్ఛ కలదు" అని రాజపుత్రుని కొక యర్జి పంపు కొనెను ఆతండు తన యనుకూలాభిప్రాయముతో ఆ యర్జి బాదుషహా యొద్దకుఁ బంపఁగా నాతనికి నుత్తరమున విశేషావశ్యకములైన పను లున్నందున నాతఁడు శివాజితో నిప్పుడు పోరుపెట్టుకొనుట మంచిదికాదని తలఁచి యాతని విన్నపమును స్వీకరించి యాతనికి "రాజా" యను బిరు దొసంగి పూనా, చాకన్ సుపే మొదలైన ప్రాంతము లాతనిని యాతని కిచ్చివేసెను. సంభాజికి ౫౦౦౦ గుఱ్ఱపు రౌతుల మన్సబునాని యిచ్చెను. అహమ్మదునగరు రాజ్యములో శివాజికిఁ గల హక్కులనకు మాఱుగా నాత నికి వర్హాడు ( Berars ) ప్రాంతము జాగీరుగా నిచ్చెను పూర్వ మొప్పుకొనినట్లు విజాపూరు రాజ్యములోని చౌథ్, దేశముఖి హక్కు లును శివాజీకి నొసంగె శివాజీ మనస్సులోనున్న కోపము పోవుటకై ఔరంగజేబు తన కుమారునిద్వారా శివాజీకిట్లు వార్త పంపెను. "మిమ్మును చాల గౌరవించి మీ హక్కులను గుఱించి మీకు సనదులు వ్రాసి యిచ్చి,

మహాకార్యంబులు చేయ మిమ్ము నియమించి మీకు సెల వియ్యవలయు నని క్షేమము తలఁచి యుంటిమిగాని మీరు మాకుఁ జెప్పకయే వెడలిపోయి తిరి అయినను చింత లేదు. ఇద్దఱము స్నేహ భావముతో నుండ వచ్చును

మొగలులకును విజాపురమువారికిని జరుగుచున్న యుద్ధము వలన నుభయులకును నెంతమాత్రము లాభము లేనందున వా రిద్దఱును విసివి ౧౬౬౮ సంవత్సరములో సంధి చేసికొనిరి. వీరికిఁ దోడై తన్ను ఆ రాజ్యములోని దవచౌథ్, సర్‌దేశముఖి హక్కులను రాఁబట్టుకొననియ్య రేమోయని భయపడి శివాజీ రాజపుత్రుని, యశవంతసింగును జూచి వారికిఁ గొంత ద్రవ్యమిచ్చి వారిని వశపఱచుకొని తన హక్కు వసూలు చేయుటకు విజాపూరు రాజ్యముపైకి దండెత్తిపోయెను అందులకు విజాపూరువారు భయపడి శివాజికిఁ బ్రతి సంవత్సరము మూఁడు లక్షల రూపాయ లిచ్చునటుల నొప్పుకొని యాతనితో సంధిచేసికొనిరి. విజాపూరు నవాబువలెనే గోలకొండ నవాబు గూడ శివాజీ తన రాజ్యముపైకి దండు రాకుండుటకై యాతనికి సంవత్సరమునకు నైదు లక్ష లిచ్చునటుల నొప్పుకొనెను (౧౬౬౮)

# పదియవ ప్రకరణము

## రాజ్యవ్యవస్థ

శివాజి మహారాష్ట్రరాజ్యము సంస్థాపించుటకునై యత్నము ప్రారంభించి క్రీ శ ౧౬౪౬లో మొట్టమొదట తోరణాదుర్గము సాధించి నప్పటి నుండియు నేఁటివఱకు కనఁగా క్రీ శ ౧౬౬౮లో విజాపూరు గోలకొండ నవాబులు శివాజికి పేష్కషు చెల్లించుటకు నొప్పుకొనునప్పటికి యిరువది రెండు సంవత్సరముల కాలము గడచెను ఇంతకాలములో డిల్లీపతియు సార్వభౌముఁడును నగు ఔరంగజేబుతోనేమి తనకంటె నధికబలాఢ్యుఁడైన విజాపూరునవాబుతో నేమి తనకు విరోధులైన యితర మరాఠాలతో నేమి తురకలతోనేమి హోరాహోరిగాఁ బోరి శివాజి యనేకసీమలను సంపాదించెను ఆతని రాజ్యము కొంకణ ప్రాంత మంతయు వ్యాపించి యుండి జున్నర్, చాకణ్ పట్టణముల వఱకును బ్రవరించి యుండెను ఇదియుఁగాక బాదుషావలన శివాజికిఁ గ్రొత్తగా వర్హాడ్ (Berars) అను రాజ్యము ప్రాప్తమయ్యెను దక్షిణమునోని యిద్దఱు బలవంతులైన నవాబులు కరభార మిచ్చుటకు నొప్పుకొనిరి. ఇంత గొప్పరాజ్యము సంపాదించిన మాత్రముచేత లాభము లేదనియు, సంపాదించిన దానిని కాపాడుటయు, స్వరాజ్యమునోని ప్రజలకు సుఖము కలుగునటులఁ జేయుటయును నవియుఁ దలఁచి శివాజి రెండు సంవత్సరముల (౧౬౬౮-౧౬౭౦) వఱకు నితరరాజులతో యుద్ధము లెంత మాత్రమును జేయక రాజ్యముయొక్క యంతర్వ్యవస్థ చేయుచుండెను. ఈ వ్యవస్థయంతయుఁ జూడఁగా శివాజియందు యుద్ధకౌశల్యమునకుఁ దోడుగా రాజ్యాంగేలు చాతుర్యంబును నుండెనని తోఁపక మానదు. అతఁడు

స్వయముగా నేర్పఱచిన కట్టుదిట్టముల ననుసరించియే తరువాతి మరాఠా వారు గొప్పపరాక్రమవంతులై దిల్లీశ్వరులను గూడఁ దమచేతిలో నుంచు కొనఁగలవార లైరి. ఎట్టి యేర్పాటులు చేసిన నవి పుత్రపౌత్రపరంపరగా జరుగునో, తన రాజ్యములోని ప్రజలు సుఖులై పరరాజ్యముపైకిఁ బోవు నుపాయంబులు తమ కెట్లు సిద్ధించునో, మొదలైన సంగతులను గుఱించి పురాణాదులలో రాజ్యనీతులు చదివి యున్నవాఁడు గావున నంతర్వ్యవస్థ చేయుటలో శివాజి మిగుల దూరాలోచనపరుఁడై వర్తించెను. అట్టి వ్యవస్థ రాజ్యారంభకాలము నుండియు నాతఁడు చేయుచున్నను నది యీ రెండు సంవత్సరముల వ్యవధిలోఁ బూర్తియయ్యెను గాన నా రాజ్యవ్యవస్థ ఈ ప్రకరణమున సంగ్రహముగా వర్ణించెద.

రాజ్యము పాలించుట యందును యుద్ధములు చేయుటయందును దనకు సహాయకులుగా నుండుటకునై శివాజి యష్ట ప్రధానుల నేర్పఱ చెను వా రెవ్వరనిన —

1 పేషవా లేక ముఖ్యప్రధానుఁడు—రాజ్యములో రాజు తర్వాత రాజంతవాఁ డీతఁడు. ఈతనికి సర్వాధికారములుండెను ఈ యధికారము మీఁద మోరో తిరుమల పింగళే యుండెను.

2 ముజుమ్దార్ —ఈ ప్రధాని రాజ్యముయొక్క యాదాయమునకు నుత్తరదాతయై యుండెను వచ్చెడి యాదాయమున కంతటికిని నాతని యొద్ద లెక్క యుండును అతనిచేతిక్రింద మున్నూఱుగురు గుమాస్తా లుండిరి. కల్యాణ ప్రాంతమునకు సుబేదారు (Govenror)గా నున్న ఆబాజిసోనదేవుఁ డను సరదారును నియమించెను

3. సుర్‌నీస్:—రాజ్యసంబంధమైన యుత్తరప్రత్యుత్తరంబులను సర్కారు దస్తరంబును నీతని స్వాధీనతలో నుండెను లోకులకు రాజు వలన నీయఁబడినయీనాము మొదలయిన హక్కులను గుఱించిన శాశన పత్రములు (సనదులు) చూచి, యవి తగిన రీతిని వ్రాయఁబడినవి యని

షరహా వ్రాసి దస్కతుచేయు నధికారంబును నీతనిదే ఈ యధికారముపై అణ్ణాజిదత్తో యనువాఁ డుండెను.

4 వాకనీస్ —రాజుగారి స్వకీయోత్తరప్రత్యుత్తరంబు లన్నియు నీతని స్వాధీనములో నుండెను శివాజియొక్క దినచర్య యనఁగా నాతఁడు రోజు చేయు పనులన్నియు నీతఁడు వ్రాయుచుండెను. శివాజి యొక్క స్వంత సేవకుల జీతములు మొదలయిన స్వంత పనులన్నియు నీతఁడే చూచు చుండెను ఇందులకు దత్తాజి యనువాని నధికారిగా నేర్పఱిచెను

5 సర్నోబత్ —ఈతఁడు సైన్యాధిపతి కాల్బలములకు ఏసాజి కంక్ అను వాఁడును, అశ్వసైనికులకు ప్రతాపరావుగుజర్ అనువాఁడును సర్నోబతులుగా నుండిరి

6 దబీర్ —ఈతడు పరరాజ్యమును గుఱించిన ప్రతి వ్యవహారము నకు నధికారి. ఇతరరాజుల యొద్దనుండి వచ్చిన యుత్తరములను వారికి వ్రాయఁబడిన ప్రత్యుత్తరములను బరరాజులతోఁ జేసిన సంధి పద్ధతులను నీతనికిఁ దప్ప నితరులకుఁ దెలియకుండ నుంచుచుండెను. మీతనిది సోమనాథపంతి అనువాఁ డీయధికార పదస్థుఁడయి యుండెను

7 న్యాయాధీశుఁడు —ప్రజలు తమలోఁ దాము పోరాడుకొనఁగా నిదమిత్థ మని చెప్పునధికారి యీతఁడు ఇట్టి యధికారులు నిరాజీరావ్జీ, గోమాజినాయిక్ అను వార లిద్దఱుండిరి.

8 న్యాయశాస్త్రి—ఈతఁడు ధర్మాధికారి సాంబ ఉపాధ్యేఅను వాఁడు మొదటను,తరువాత రఘునాథపంత్ అనువాఁడును యీ యధికారారూఢులైరి

ఈ యష్టప్రధానులు గాక ఖజీన్దార్ చిటణిస్ ఫడణవీస్ పారస్ నీస్ మొదలైన యధికారులు శివాజియొద్ద నుండిరి ఈ యధికారములలో మొదట మూఁడింటి మీఁదను నను క్రమముగ శామ్జినాయిక్ బాళాజీ ఆవ్జీ బాళకృష్ణపంతుజు వంతే యనువా రుండిరి

పైన వర్ణింపఁబడిన యష్టప్రధానులలోఁ దద సున్న యిద్దఱకుఁ దప్ప కడమవారి కందఱకును సైన్యాధిపత్యము లుండెను. వీరు యుద్ధము లకుఁ బోయినప్పుడు వీరిపనులకు వీరి చేతిక్రింద నన్నుముతాలిక్ అను నధికారు లుండిరి ఈ ముతాలికులు గాక ప్రతిప్రధాని చేతిక్రిందను మజుమ్‌దార్, ఫడనవీస్, సబ్‌నవీస్, కారఖానీస్, చిటణీస్, జామదార్, పోత్నీస్ అను నేడుగురు అధికారులుండిరి వీరందఱు నా యా ప్రధానికి మంత్రిగను, లెక్కసదారుగను దస్తరము లుంచువాఁడు (rercod-keeper) గను సహాయు లగుచుండిరి

శివాజియొక్క రాజ్యము క్రొత్తగా సంపాదింపఁబడి నందున దాని రక్షణ యంతయు సైన్యముచేఁ గావలసి యుండెను కాన శివాజి తన సైన్యముల వ్యవస్థ యధికదక్షతతోఁ జేయుచుండెను అతని సైన్యము నందుఁ గాల్బలమే విశేషముగా నుండి యాశ్వసైన్యము తక్కువగా నుండెను కాల్బలమును గుఱించి యాతఁడు చేసిన యేర్పాటులు పదిబం ట్లపై నధికారినాయకుఁడు, ఏఁబది మందిపైవాఁడు హవాల్ దారుఁడు. మూఱుగురమీఁది యధికారుఁడు జుమ్లెదార్, వేయివీరుల నాయకుఁడు హజారి, అయిదుగురు హజారీలకు నధిపతి పంచహజారీ, పంచహజారీల పైవాఁడు సర్‌నోబత్. ఈతఁడే పైని సైదవప్రధానిగా వర్ణింపఁబడియె. కాల్బలములోని శిపాయీ లిరుదెఱఁగులవారై యుండిరి ౧. మావళేలు ౨ హేటకరీ యనువాండ్రు. మావళే యనువారు పర్వతశిఖరములపై నుండువారు హేటకరీ యనువాండ్రు కొంకణప్రాంతమున నుండువారు పర్వతముల నెన్నఁడెఱుఁగక బూప్రదేశములయందే యుండువారివలెఁ గాక వీ రుభయులును పర్వతములపై వానరములవలె నధిక తత్పరతతో నెక్కుచుండిరి వాలు, డాలు, కమటము (విల్లంబులు), చిన్నికత్తి,తుపాకి ఇవి వారి శస్త్రాస్త్రంబులు శత్రువులను సమీపించి వారిపైఁ బడి వాలును డాలును దీసికొని శత్రుసంహారము చేయుటయందు మావళేవారు దక్షులై యుండిరి లక్ష్యము తప్పక తుపాకిదెబ్బ వేయుటలో హేటకరీ యను వాండ్రు ప్రవీణులై యుండిరి. పదిబంట్లలో నొక్కనియొద్దం దుపాకి

యుండెను కడమ తొమ్మిదిమందియొద్ద నితరశస్త్రంబులుండె శస్త్రా స్త్రంబు లన్నియు బంటులవియే మందు గుండు మాత్రము సైన్యాధిపతు లిచ్చుచుండిరి తలకు పాగా, శరీరమునకు అంగి, కాళ్ళకులాగు, నడుమునకు బిగియించు వస్త్రము ఇది యాపీరుల వేషమై యుండెను క్రొత్తగా వీరిని సైన్యములోనికిఁ జేర్చుకొనునప్పుడు వీరికి జీతముక్రింద నెలకింత ధాన్య మని యేర్పాటు చేయుచుండిరి కాని వారి తెలివితేటలను ననుసరించి వారికి నొక హూను (రమారమి మూఁడున్నర రూపాయి) మొదలుకొని మూఁడు హూనులవఱకును నెలజీతము లేర్పఱచు చుండిరి సంవత్స రమునకు జుమలేదారునకు నూఱు హోనులు, హజారీకి నైదు వందల హోనులు జీతముండెను పంచహజారీ యను నధికారికి సంవత్సరమునకు రెండువేల యైదువందలు జీతము ఇ యుఁగాక యాతనికి నాందోళికాది గౌరవవాహనములు సర్కారువారి ఖర్చుతోనే యిచ్చుచుండిరి

గుఱ్ఱపు బలముయొక్క వ్యవస్థయుఁ గాల్బలమువలెనే యుండును గాని దానికిఁ దగునటులఁ గొన్ని మార్పులు గల్పింపఁబడియె ఇరువది యైదుగురు గుఱ్ఱపురౌతులపై యధికారి హవాల్దారుఁడు, నూట యిరువది యైదుగుర పైవాఁడు జుమలేదారుఁడు ఆఱువందల యిరువదియైదుగుర పై నుండు నధికారి సుబేదారుఁడు, పదిమంది సుబేదారులు చేతి కిందఁ గల వాఁడు పంచహజారి, పంచహజారి పైవాఁడు అష్టప్రధానులలో నైదవ వాఁడగు సర్‌నోబత్ అనునధికారి ప్రతి సుబేదారుని చేతిక్రిందను నిద్దరు గుమస్తాలుండిరి ఒకఁడు లెక్కలు వ్రాయుటకు, మఱియొకఁడా లెక్కను దిద్దుటకు, పంచహజారీ చేతిక్రిందఁ బై పనులు చేయుటకు నై ముజుమ్ దార్ అనియు అమీన్ అనియు నిద్ద ఱధికారు లుండిరి ఇట్టి వ్రాతఁపని చేయు గుమస్తా లందరును బ్రాహ్మణజాతివారును పరభూ జాతివారును నై యుండిరి గుఱ్ఱపు సైనికులలోను రెండు దెఱఁగులవా రుండిరి ౧ శిలేదారులు ౨. బార్గిరు శిలేదార్లు మంచిస్థితి కలవారలు వాండ్ర యొద్ద వారి సొంత గుఱ్ఱములు శస్త్రాస్త్రములు మందుగుండు నుండును సంవత్సరమునకుఁ గొంత ధనము పుచ్చుకొని వీండ్రు యుద్ధమునకుఁ

బోవుచుండిరి సంవత్సరమునకు నేర్పరచిన ధనము తక్క వీరికి మఱి యేమియు నిచ్చుటలేదు కొందఱు మహాధనికులైన శిలేదార్లు వేలకొలఁది గుఱ్ఱముల వెంటఁ దీసికొని యుద్ధమునకుఁ బోవుచుండిరి. బార్‌గీర్ అను వాండ్రు సైన్యమునం దెప్పు డుండునటుల శివాజిచే నేర్పఱుపఁ బడిన సైనికులు వారికి గుఱ్ఱములును శస్త్రాస్త్రంబులును శివాజివలన దొఱకు చుండెను ఇది శివాజియొక్క సొంత సైన్యము, శివాజి యీ సైన్యమునే విశేషముగా నమ్మియుండెను. శిలేదారుల సైన్యములోఁ గలిపి కొందఱ బార్‌గీర్‌లను శివాజి యుంచుచుండెను ఇందుచే శిలేదార్లెమైన దురుద్దేశ ముతో రాజద్రోహముఁ జేయ నెంచినయెడల వెంటనే యా సమాచారము శివాజికిఁ దెలియుచుండెను వాలు డాలు బల్లెము—ఇవి వీరి యాయుధ ములు కొందఱయొద్ద తుపాకులును ఉండెను గుఱ్ఱపుసవారి చేయుటయం దును బల్లెముతో దూరపు శత్రువునైన వేయుటయందును నీ యాశ్వ సైనికు లసమాన ప్రజ్ఞ గలవారు. వీరి వేషము కాల్బలములోని బంటుల వేషమువలెనే యుండెనుగాని తలకుఁ బాగా చుట్టునప్పుడు నది గుఱ్ఱము మీఁద గూర్చున్నప్పుడు గ్రిందఁ బడఁగూడదని గడ్డము క్రిందినుండి త్రిప్పి కట్టుచుండిరి నడు మొక వస్త్రముచే బిగియించి కట్టి కత్తి నడు మున వ్రేలాడునటులఁ గట్టుచుండిరి. శిలేదారులకు నెలకు నాలుహూణ నుల మొదలు పండ్రెండు హొనులవరకు జీతముండెను బారగీర్లకునైదు హొనులు మొదలు పది హొనులవఱకుండెను సంవత్సరమునకు జుమలే దారునకు రెండువందల యేఁబది హూణులను సుబేదారునకు నాలుగువం దల హూణులును జీతముండెను శత్రుసైన్యములలో వృత్తాంతములు గనుఁ గొని వచ్చుటకుఁ బ్రతి యధికారియొద్దను చారు లుండిరి ఈ చారుల కందరకు బేహర్‌జినాయిక్ అనువాఁడు నాయకుఁడుగా నుండెను వార్తలు దెచ్చుటయందు వీఁ డసమాన ప్రజ్ఞ కలవాఁ డయినందున వీఁడు శివాజికి బ్రీతిపాత్రుఁడై యుండెను "వార్త నిర్వహింపవలయుఁ బతికి" నవిన భారతోపదేశముయొక్క మాహాత్మ్యము శివాజికిఁ జక్కఁగాఁ దెలిసియుండె ననుటకు సందియము లేదు

సమయము దప్పకుండ సైన్యమునకు జీతములు పంచిపెట్టుటను గుఱించి శివాజి యెంతయు దక్షుఁడై యుండెను. ప్రతి సంవత్సరము యుద్ధమునకు వెళ్ళి వచ్చినతోడనే లెక్కలన్నియుఁ బూర్తిచేయించి ఎవ్వరెవ్వంకి నెంతెంత బాకీలు తేలునో యంతంత వారి వారికి నిచ్చివేయు చుండెను బొక్కసములో డబ్బు లేనియెడలఁ బ్రాంతాధిపతులైన సుబేదార్ల పేరిట నంత ధన మియ్యుమని యుత్తరము లిచ్చుచుండునే గాని సైన్యాధిపతులు స్వయముగా గ్రామాదులలోనికిఁ బోయి తమ జీతముల ధనము వసూలుచేసుకొనుటకు శివాజి యెన్నఁడును నొప్పఁడయ్యె ప్రాంతాధికార మంతయు సుబేదారునిదే సైన్యములకు నచ్చట నెంతమాత్రమును నధికారము లేదు. ఇందువలన రాజ్యములోని రయితులకు సేనల వలన నెంతమాత్రమును బాధ కలుగక వాండ్రు సుఖముగా నుండిరి వారి వారి యోగ్యతల ననుసరించి సైన్యములోనివారికి శివాజి జీతములు గాక వివాహాదికార్యములకు నై ధన సహాయము చేయుచుండెను గాని సైన్యములోని యేబంటయినను ననావశ్యకముగా నాదాయముకంటె నధికవ్యయము చేసి యప్పులపా లయిన యెడల వానిని శివాజి వెంటనే యుద్యోగమునుండి తొలఁగించు చుండెను సైన్యములు విడిచినచోటికి స్త్రీలుగాని మత్తు గలుకజేయునట్టి పదార్థముల దుకాణములుగాని రాఁగూడదని యుగ్ర శాసనము చేసెను క్రొత్తఁగా బంటును సైన్యములోనికిఁ జేర్చుకొను నప్పుడు శివాజి స్వయముగాఁ జూచి యాతని సామర్థ్యమును బరీక్షించి యాతఁడు స్వామిభక్తితో సేవచేయునని తన సైన్యములోని యొకానొక ప్రాఁత సైనికునివలన జామీను పుచ్చుకొని వానికిఁ బని యిచ్చుచుండెను జుమేదార్, హజారీ మొదలయిన పై యధికారులను నియమించునపుడు వారి కుల శీలములను బాగుగఁ గనుఁగొనును

శత్రువులపై దాడి వెడలుటను గుఱించియు శత్రు రాజ్యమునుండి ధనమును దెచ్చుటను గుఱించియు శివాజియొక్క యేర్పాటు లిట్లుండెను వర్షాకాలము పోయినతరువాత విజయదశమి (దసరా) రోజున సామంతులు, సరదార్లు, శిలేదార్లు మొదలైన వారందఱును శివాజిని దర్శించుటకై

వచ్చుచుండిరి ఆ రోజు గొప్ప దర్బారు జరిగి వచ్చినవారి క్షేమసమాచారములను రాజుగారు (ఇఁకమీఁద రాజుగారనఁగా శివాజి యనియర్థము) గనుఁగొనుచుండిరి అటుమీఁద దండయాత్రకు సంబంధించిన ప్రయత్నము సాగును ఏ యే సైనికునియొద్ద నే యే గుఱ్ఱము శస్త్రాస్త్రములు నున్నవి కనుఁగొని లేనివారల కిప్పించి, చెడిపోయినవాని బాగుచేయించి, వాని కన్నిటికి నొక జాబితా వ్రాయఁబడును ఈసైన్యము లన్నియు దండయాత్రనుండి యింటికిఁ దిరిగి వచ్చినప్పు డీ జాబితాను బట్టి లెక్కలు సరిచూచుచుండిరి శత్రు దేశములు గొల్లగొట్టునప్పుడు బ్రాహ్మణుఁడు, గోవు, కాఁపు (పొలము దున్నుకొని జీవనము చేయువాఁడు) స్త్రీ మొదలగువారిని నెంతమాత్రము బాధపెట్టఁగూడదని తన సైనికులను నాజ్ఞాపించి యుండెను ధనవంతు లగు తురకలను దప్ప మఱి యెవరిని చెఱఁబట్టఁ గూడదనియు నాజ్ఞాపించెను దోఁపిడిలో దొరకిన సొత్తంతయు రాజుగారి స్వాధీనము చేయవలెను సొత్తు తెచ్చిన వానికి వాఁడు తెచ్చిన సొత్తు ననుసరించి బహుమానము దొరకును గాని చేతఁ జిక్కిన సొత్తులోఁ గొంత యే సైనికుఁడైన దాఁచినాఁడని గాని దొంగిలించినాఁడని గాని తెలిసిన రాజుగా రాతని దండించి యుద్యోగము నుండి తొలఁగించుచుండిరి యుద్ధ సమయములలోఁ బరాక్రమము చూపిన వారికి సత్కరించుటకై యొక గొప్ప సభచేసి యందులో నందఱు చూడఁగా రాజుగా రాశూరుల సత్కరించుచుండెను. యుద్ధములలో గాయపడినవారికి వస్త్ర వాహనాది పదార్థముల బహుమానముగా నిచ్చి సంతోషపెట్టును యుద్ధములలో హతులైనవారి కుమారులకుఁగాని తమ్ములకుఁ గాని తగిన యుద్యోగము లొసఁగి వారిని బరామర్శించునుగాని యుద్ధము నుండి పాఱిపోయినవారిని, ధనము దాఁచినవారిని దయలేక శిక్షించును. శివాజి దక్షుఁడై చారులవలన రహస్యము లన్నియుఁ గనుఁగొనుటవలన సైనికు లెవ్వరును నాతని మోసపుచ్చలేరైరి

పర్వత దుర్గములు శివాజియొక్క ముఖ్యబలస్థానములని ఇదివరకు వర్ణింపఁబడిన చరిత్రభాగమువలన చదువరు లూహించియే యుందురు.

ఒక్క దుర్గము స్వాధీనమయినచో దానిచుట్టుపట్టున నుండు ప్రదేశమంతయు స్వాధీనమయినదియె. శత్రువులను గొల్లఁగొట్టి తెచ్చినధనమంతయు నొక్కసారి కోటమీఁదికిఁ జేర్చిన నది పరుల కభేద్య మగుచుండెను. ఇట్లు దుర్గములనేకకార్యములకు నుపయోగకరము లయినందున వాని సంరక్షణమునందు శివాజి మిక్కిలి దక్షుఁడయి ప్రవర్తించుచుండెను. దుర్గములను గుఱించి యాతఁడు మిగుల నుగ్రశాసనుఁడై యుండెను. దుర్గసంబంధమై యాతఁ డేర్పఱచిన నియమములలో నొక్కదానికైన వ్యతిరేకముగాఁ బ్రవర్తించినవాఁ డెవ్వఁడయినను నాతని కఠినముగా శిక్షించుచుండెను. కోటపయి నుండు నధికారిపేరు హవాల్‌దార్. దుర్గములోని వారికిఁ గావలసిన జీతబత్తెములు, మందు, గుండు మొదలయిన వానిఁ దెప్పించుటయు, దుర్గమును సర్వవిధముల రక్షించుటయు నాతని పనియై యుండెను. సాయంకాలము కోటతలుపుల యొద్దకు స్వయముగా వెళ్ళి మూయించి తాళపుఁజెవి తన యొద్ద నుంచుకొని ప్రాతఃకాలమున తలుపులు తెఱపించుట హవాల్‌దారుని పని. కోటసంబంధమయిన యుత్తరప్రత్యుత్తరము లన్నియు హవాల్‌దారుని పేరిట నాతనిమొహరుతో జరుగుచుండెను. అతని చేతిక్రింద సర్‌నోబత్ అనునధికారు లుండిరి. పురందర్ రాయగడ్, పనవాళ, మొదలయిన గొప్పదుర్గములమీఁద నొక్కొక్క త్రోవకు నొక్కొక సర్‌నోబత్ ఉండెను. వీరుగాక హవాల్‌దారు చేతిక్రింద సబునీస్ అను బ్రాహ్మణ యధికారియు, కార్ఖానవీస్ అను పరభూయధికారియు నుండిరి. ప్రతిదినము దుర్గములోనిభటులను గుఱించిన లెక్కలు వ్రాయుట సబునీసుని పని. ధాన్యము, యుద్ధసామగ్రి మొదలయినవి తెప్పించి వానిలెక్కలు వ్రాయుట కారఖానవీసుని పని. ఈసిబ్బంది కాక ప్రతికోటమీఁద వంశపరంపరగా వచ్చెడి గుమాస్తా బ్రాహ్మణులును, మరాఠాసిపాయీలును రామోషి‡ మహర్‌మాలు, మాపెగలు మొదలయిన వెట్టి

‡ రామోషీ యన మన దేశములోని యెఱుకు, ఏనాదుల వంటి దొంగ కులము. వీండ్లను జీతమునకు నేర్పఱచిన దొంగలకు గురువులై యజమానునికి చాల సహాయము చేయుదురు.

వాం(డ్రును నుండిరి. వీరికందఱకు దుర్గముక్రింద మాన్యము లుండెను రామోషీలు చారులపని చేయుచుండిరి శత్రుసమాచారము తెచ్చుట, శత్రు చారులు తమ రాజ్యములోనికి వచ్చినయెడల వారిని మోసపుచ్చి వెడలఁ గొట్టుట, వారు వెడలరేని వీలుకొలఁదిఁ జంపుట, మొదలయిన పనులు చేయుచుండిరి. దుర్గముమీఁద నుండువారి కందఱకు గడకరీ లని పేరు. గడకరులకు వంశపరంపర వచ్చుమాన్యము లుండినందున వారు దుర్గ మునకయి ప్రాణములఁ గూడఁ బరిత్యజించుటకు సిద్ధులయియుండిరి. దుర్గములోని యే యే పని యెవ్వరెవ్వ రెట్లెట్లు చేయవలయునో యావిధి యంతయు శివాజి మిక్కిలి కౌశలముతో నిర్ణయించి యుండెను దుర్గ ములో ననావశ్యక మయినఖర్చు జరగకుండు నటుల నియమించెను.

యుద్ధసంబంధమయిన గుఱ్ఱములు, ఏనుఁగులు, లొట్టిపిట్టలు, ఆవులు, మొదలయిన పశువుల సంరక్షణ నిమిత్తమై తగిన యేర్పాటులు చేయఁబడెను దాడివెడలిన యెనిమిది నెలలు గుఱ్ఱములమేఁత మొదలయి నవి ఖర్చు లేకయే శత్రువుల దేశములో దొరకుచుండెను. వర్షాకాలము దాడినుండి యింటికి వచ్చినప్పుడు పశువుల పోషణ చక్కఁగా జరగ వలయు నని యక్కడక్కడ నిలిపి యుంచిన గడ్డిబీళ్ళయొద్ద గుఱ్ఱముల నిలిపియుంచును ఇదియుఁ గాక కొందఱు సేవకులు పశువులు దాడినుండి తిరిగివచ్చువఱకు గడ్డివాములు దాణామొదలయినవి సిద్ధముగానుంపుదురు. ఈ పనికయి వారికిఁ గొన్నిమాన్యము లియ్యఁబడును. గుఱ్ఱములకుఁ బది యైదుదినముల కొకసారి నాడెలు కట్టింపఁబడును. ప్రతిగుఱ్ఱమును గుఱిం చిన లెక్క చక్కఁగా నుంచుటకు వీలు కలుగవలయు నని ప్రతిగుఱ్ఱ మున కొకసంఖ్య యేర్పాటుచేసి యాసంఖ్య యాగుఱ్ఱము కాలుపై ముద్రిం పఁబడును గుఱ్ఱములవలెనే యేనుఁగులు మొదలయినవి సంరక్షింపఁ బడును. శివాజియొక్క గజశాలలో మున్నూటయేఁబది గజము లుండెను. బంటులసంఖ్య ౧౨౦౦ లను మించియుండెను, అందుఁ గొందఱు యుద్ధమున కయి మఱికొందఱు టప్పానిమిత్తమై యుపయోగించు

చుండిరి ఫిరంగులు మందుగుండ్లు మొదలయినవి మోయుటకై మిక్కిలి బలముగల యెద్దులు సైన్యములో నుండెను

ఇట్లు సైన్యము, దుర్గములు, డాడి మొదలయినవానిఁ గుఱించి శివాజి చేసిన యేర్పాటు వర్ణించి, యాతఁడు సొంత రాజ్యములో భూమిని గుఱించి చేసిన కట్టుదిట్టములను వర్ణించెద మొట్టమొదట భూమికొల్పించి తర మేర్పఱుచుచు నుండెను తరమేర్పఱుచుటయందు దాదోజి కొండ దేవుఁడు చేసిన నియమములనే శివాజి యనుసరించుచుండెను పండిన పంటలో రెండువంతులు తాను దీసికొని మూఁడువంతులు భూమిస్వామి కిచ్చును. క్రొత్తదేశము తనకు లోఁబడినతోడనే యచ్చటి రయితుల నేమియు బాధపెట్టక తన రయితులవలె నెంచుకొని వారియొద్ద నుండి భూమసిస్తు మాత్రము గయికొనుచుండెను శిస్తు వసూలుచేయుపని సైన్యములోనివారికి నెన్నఁడుఁ జెప్పడు ఆ పనికొఱకయి వేఱు అదికారుల నియమించును ప్రతి గ్రామమునకు నొకపటేలు ఒకకరణము నుండిరి పాటీలు (పటేల్) మరారాజాతివాఁడు-కరణము బ్రాహ్మణుఁడు రెండు మూఁడు గ్రామములకు నొక కారకూన్ అధికారిగా నుండును కొందఱు కారకూనుల పయిని తాలూకుదారుఁ డుండెను, ఈతఁడు బ్రాహ్మణుఁడయి నను పరభూజాతివాఁడయినను అయియుండును. ఈతనికి సహాయముగా మరారాజాతివాఁడయిన హవాల్దారుఁ డుండును వీరిద్దఱ పయివాఁడు సుబేదారుఁడు ఈతనికే మామిలేదారుఁ డని పేరు ఇతని చేతిక్రింద రెండు, మూడు దుర్గములుండును వచ్చిన ధనమంతయు నీతఁడా దుర్గము లలో సురక్షితముగా నుంచును ఈ యధికారులందఱుఁ బ్రజలను నన్యాయముగాఁ గష్టపెట్టెదరేమో యని శివాజి మిగుల దక్షుఁడై పరీక్షించు చుండును ఈ యధికారులందఱకు నెలజీతములే కాని మడిమాన్యము లేమియు నియ్యఁడయ్యె అట్లు మాన్యములిచ్చినయెడల నధికారులు బలిసి ప్రజలను బాధపెట్టెద రనియు విజాపూరురాజ్యములోఁ జేసినటుల రాజ ద్రోహముఁ జేసెద రనియు నాతని యభిప్రాయము.

దేశముఖ దేశపాండ్యాలు తమ హక్కుధనము రయితులయొద్ద నుండి స్వయముగా వసూలుచేసిన యెడల రయితులకు మిగుల బాధ కలుగఁగలదని యెఱిఁగి శివాజి, దేశముఖు దేశపాండ్యాలు తమకు రావల సిన ధనము రయితులయొద్ద నుండి వసూలుచేయఁ గూడదనియు, ఆ ధనముతాలూకాదారుల యొద్దనుండి తీసికొనవలయు ననియు నాజ్ఞాపిం చెను అక్కడక్కడ దేశముఖ దేశపాండ్యాలు కట్టించిన ఘట్టకోటలను బడఁగొట్టించి క్రొత్తవి కట్టవల దని యాజ్ఞాపించెను. ఇట్లు వారిని బల హీనులఁ జేసెను ఇట్లు చేసినందులకు వారు తనమీఁదఁ దిరుగఁబడ కుండ వారికి దనసైన్యములో గొప్ప యుద్యోగము లిచ్చి సత్కరించు చుండెను.

రాజ్యములోని న్యాయవిచారణ యంతయు న్యాయాధీశుఁ డను నధికారి చేయుచుండెనని వెనుకనే వ్రాసియున్నాము గ్రామములోని దివాని (Civil వ్యవహార సంబంధమైన)వ్యాజ్యము లన్నియు గ్రామము లోనే పంచాయతి యనఁబడు పూర్వపద్ధతి ననుసరించి నిర్ణయింపఁబడు చుండెను ఫౌజుదారి (Criminal అపరాధ సంబంధమైన)వ్యాజ్యములు న్యాయాధీశుఁడు స్వయముగా విచారించి యపరాధులకు హిందూధర్మశాస్త్ర మునందు విధించిన శిక్షలనే విధించు చుండెను. అయినను తురకల ప్రభు త్వమునందు నేర్పడి రూఢములయిన పద్ధతులు మాత్రము మార్చినవాఁడు కాఁడు.

తురుష్కులచే నుచ్ఛేదింపఁబడినట్టియు, హిందూమతమునకు నాద్యము లయినట్టియు వేదాదివిద్యల నభివృద్ధి చేయవలయు నని కృత నిశ్చయుండైన శివాజి యొకయష్టకముంజదివిన బ్రాహ్మణునకు నొక మడుఁగుధాన్య మిచ్చెద ననియు, రెండష్టకములు చదివినవారికి రెండు మడుఁగుల ధాన్య మిచ్చెననియుఁ నెనిమిదిజదివినవారికి నెనిమిది నిచ్చెద ననియుఁ బ్రతిజ్ఞఁజేసెను. ధాన్యము నిచ్చుటకుఁ బూర్వము విద్యను [illegible] పరీక్షించెను. [illegible] బ్రాహ్మణులు [illegible] దేశస్థు [illegible] యయినయెడల వారికి నేఁబది మొదలు [illegible]

వైదికవిద్యవలెనే శాస్త్రవిద్య నభివృద్ధిఁ జేయుచుండెను ఇట్లు రాజసాహాయ్యముచేఁ బురాతన విద్యలన్నియు నభివృద్ధిఁ జెందసాగెను. శివాజి విద్వాంసులను సత్కరించినటులనే లలితకళల యందుఁ బ్రవీణులయిన వారినింగూడ సత్కరించుచుండెను ఆ రాజసభయందు సంగీతపారకులు, వాద్యవిద్యావిశారదులు, కవులు మొదలయిన వారందఱును మన్నన నడయుచుండిరి భూషణుఁ డనువాఁడు ఆస్థానకవీశ్వరుఁడుగా నుండెను. కాని మహారాష్ట్రకవి యొక్కఁడును నాస్థానమునందు లేఁడయ్యె ఇందులకుఁ గారణ మప్పటి తుకారాము, రామదాసు మొదలయిన కవులందఱును నైహికచింతలేని విరక్తసాధువు లయి యుండుటయె గొప్పమహారాష్ట్రకవు లెవరును సభలో లేకపోయినను పోవాడా అనుకవిత్వముఁ జెప్పు భట్టురాజులవంటి కవులు కొంద ఱుండిరి పోవాడా అనగాఁ దెనుంగుసీమలోఁ బాడఁబడు బొబ్బిలికథవంటి వీరచరిత్ర వర్ణనపరమగు గీతవిశేషము. అఫజల్‌ఖానునివధ ఢిల్లీప్రయాణము మొదలయిన ప్రసంగములను గుఱించి మరాఠీభాషలో ననేకపోవాడా లయియున్నవి. ఇవి వీరరసపరిప్లుతములు ఇట్టి యుత్తమోత్తమ గీతములను వాకయాంగ్లేయుఁ డెంతయుఁ గొనియాడి ఇట్టి యనేకగీతములను బ్రోగుచేసి ప్రచురపఱిచి యున్నాఁడు శివాజికాలమున నిర్మింపఁబడిన యీ పోవాడా గీతములు క్రమముగా వృద్ధిఁజెంది వేలకొలఁదియై మహారాష్ట్రులకు వారి పూర్వుల శౌర్యచరిత్రము నిత్యమును వినిపించుచున్నవి

# పదునొకండవ ప్రకరణము

## మొగలులతో మరల యుద్ధము

సుల్తాన్ మొఅజీమ్‌ద్వారా ఔరంగజేబుతో శివాజి క్రీ.శ.౧౬౬౮లోఁ జేసిన సంధి ననుసరించి రెండు సంవత్సరముల వఱకు మొగలులు మరాటావారితో యుద్ధము చేయకయుండిరి ఈ వ్యవధికాలములో శివాజి పైని వర్ణింపఁబడి నటులఁ దనరాజ్యములోని యంతర్వ్యవస్థ చక్కఁ బఱుచు కొనెను శివాజితో సంధిచేయుట ఔరంగజేబు పాదుషహాకు నిష్టములేక పోయినను దప్పని సరియని యాతఁడు రెండు సంవత్సరముల వఱకును మరాటావారితోఁ బోరాట మానియుండెను శివాజి విజాపూరురాజ్యములో ననేకముగా దోఁచుకొనుచు కోటలను సాధించుచుఁ దనకు నేమియు నియ్యఁడనియుఁ దనకుమారుఁడైన నవాబ్ మొఅజీమ్, యశవంతసింగు శివాజిని దమవలలో జేసికొనక తామె యతని వలలోఁ బడియుండెద రనియు నాతఁడు మందుచుండెను ఇట్టి తలంపుతో ఔరంగజేబు సులతాన్ మొఅజీమున కిట్లు వార్తనంపెను "నీవు శివాజిని ఆతని సరదారుఁ డయిన ప్రతాపరావుగుజరను ఇంక నితర మరాటసరదార్లను నొక్కసారి చెఱపట్టి వారిస్వాధీనములో నున్న దుర్గములను రాజ్యమును స్వాధీనపఱుచుకొనవలసినది ఇట్లు చేయనియెడల నీవు మా నిగ్రహమునకుఁ బాత్రుఁడవయ్యెదవు సుల్తాన్ మొఅజీమ్ తండ్రియగు ఔరంగజేబునివలె మోసగాఁడు కానందున ఈ యాజ్ఞ యతనికి రుచించినదికాదు ఢిల్లీలో జరగు వృత్తాంతము లన్నియుఁ దెలుపు చారులు రాజపుత్రుని (మోఅజిమ్) యొద్ద నున్నందునఁ బైనివర్ణించినయాజ్ఞ వచ్చి చేరక మునుపే యిట్టియుత్తరువులు వచ్చుచున్న వని యాతనికిఁ దెలిసెను సంధి నియమముల ననుసరించి తనకు సాయము చేయుటకై తనయొద్దనున్న

మహారాష్ట్రసైన్యాధిపతుల రహస్యముగాఁ బిలిపించి మోఆజిమ్ వారితో నిట్లని చెప్పెను "మిమ్ముఁను జెఱఁబట్టుమని బాదుషహాగారి యుత్తరువులు వచ్చుచున్నవి అవి రెపోమాపో వచ్చి చేరఁగలవు. ఉత్తరువులు వచ్చిన తరువాత మేము మిమ్ము విడుచుటకు వీలులేదు కాన వీలోగా మీరు ఏదో యొకసాకు చెప్పి మీ మీ విలయములకుఁ బొండు" ఈ వార్త విన గానే సర్నోబత్, పండితరాయ యను మరాటావీరు లేవియో సాకులు కల్పించుకొని తమ సైన్యములతో మోగలుల శిబిరము వెడిలిరి వారు వెడలిన తరువాత రెండుమూఁడు దినములకు దిల్లీనుండి యుత్తరువులు వచ్చెను రాఁగానే రాజపుత్రుఁడు తన సైన్యములతో మరాటావారి సైన్య ములు వెంటఁబడి నట్టుల నటించెఁగాని యింతలో వారు సురక్షితముగా పూనాపట్టణము చేరిరి

క్రీ శ. ౧౬౬౮-౧౬౬౯ ఈ రెండు సంవత్సరములు శివాజి యుద్ధము లేవియు జేయక యే వైపులను దాడి వెడలకయున్నందున జను లందఱు శివాజియొక్క పరాక్రమమునకిదియే సీమ యనియు విఁక మీఁద మోగలులతోఁ బోరాడుట దుర్లభ మని తలఁచి శివాజి తన పర్వత ప్రదేశము వెడలిరాఁడనియు వింతవింతలుగా ననుకొన సాగిరి కాని యీకల్పనలన్నియు నసత్యము లని చూపుప్రసంగ మిప్పుడు వచ్చెను ఇట్టి ప్రసంగము సంధినిపాటింపక మిత్రద్రోహముచేసిన ఔరంగజేబు వల్లనే కలిగినందున శివాజి యొక్క ‡ భవానిఖడ్గముమిగులఁ బ్రకాశింపఁజొచ్చె

శివాజియొక్క రాజ్యములోని సింహగడము, రాయగడము అను రెండు ముఖ్యదుర్గములు జయసింగుఁడు జయించినప్పటినుండియు మోగ లుల స్వాధీనములోనే యుండెను, అందువే చాకణ్ దుర్గమునుండి పూనాకు వచ్చునప్పుడు శివాజికి మిక్కిలి యిబ్బంది కలుగుచుండెను. అందుచే వానిని సాధింపవలె నని యెంచి శివాజి యొకరోజు గొప్ప సభ చేసి తన సరదారుల నందఱను బిలిపించి "సింహగడ మెవ్వరు గెల్చెదరు?" అని

‡ శివాజి చేతిలోని ఖడ్గమునకు "భవాని" యని నామము.

యడుగఁగా తానాజీమాలసురే యనుశూరాగ్రేసరుఁడు "నేను సింహగడమును సాధించెదను" అని ప్రతిజ్ఞ చెసెను అప్పు డాతనికిఁ దాంబూల వస్త్రాభరణంబులను వేయి మావళేభటులను నిచ్చి శివాజి యుద్ధమునకుఁ బంపు సిద్ధమైన తన కుమారుని వివాహము మానుకొని యా తానాజి యను నప్రతిమ స్వామిభక్తుఁడు, "నేను బ్రతికివచ్చిన నేనే వివాహము చేయఁగలను నేను యుద్ధమునో హతుఁడ నగుదునేని మీరే నాకుమారుని వివాహము చేయవలయును అని శివాజితో విన్నవించి మాఘబహుళ నవమి (ఫిబ్రవరి)రోజున బయలుదేఱెను

సింహగడ మతి భయంకరమైన పర్వత శిఖరముపై నున్నదుర్గము దాని సాధించుట సాధారణముగా నసాధ్య మనియే చెప్పవచ్చును. పర్వతము గగన చుంబితముగా నత్యంతౌన్నత్యము కలదియై దాని పూర్వ పశ్చిమ దిక్కుల ప్రచండమైన పురందర పర్వత మున్నది దక్షిణోత్తర దిశలందు నరమైలు ఉన్నతము గల శిలలు పెట్టిన నున్నటి గోడవలె నున్నవి ఇది యెక్కి పైకిఁ బోయిన నలుబది యంగుళముల యెత్తుగల కృష్ణశిలామయ మైన ప్రచండప్రదేశము కలదు దానిచుట్టు రాతితో గోడ పెట్టఁబడి త్రికోణాకృతిగా దుర్గము నిర్మింపబడినది కోణ కోణమునకు గొప్ప బురుజులు కలవు. దుర్గముయొక్క చుట్టుపరిఘ కొల్చి చూచినఁ గ్రోసు మించి యుండును దాని బాహ్య స్వరూప మత్యంత భయంకరమై దుర్గ ద్వారము తప్ప వేఱు మార్గమే లేనటులఁ గానిపించును. దుర్గముపై నుండి చూచినఁ దూర్పున నిర్మల జలపూరితమై విశాలముగాఁ [illegible] మైనందున నిచ్చటనుండి శత్రువు లెన్నఁడును రారని తలఁచి కోటమీఁది వారా వైపున నంతగాఁ గాపుదల చేయరైరి. కనుక అచ్చటినుంచి వేయి జనముతో నెంతయుఁ గష్టమున కోర్చి కొంతపైకి వచ్చి యచ్చట సైన్యమును నైదైదు వందల భటులుగా రెండుభాగములు చేసి యొక భాగమునకుఁ దన తమ్ముఁడైన సూర్యాజీని నధిపతిని జేసి వారిని నక్కడనే యుండ నియమించి, తాను నైదువందల భటులతోఁ బైకి నెక్కెద

నవియుఁ దనకు సాయంబు గావలసినయెడలఁ గ్రిందివారు పైకి రావలసిన దవియుఁ జెప్పెను. ఒక వీరుఁడు మిక్కిలి కష్టముతోఁ బైకిఁ బ్రాఁకి యక్కడినుండి యొక గొప్పమోకుక్రిందికి దిగవిడచెను దానినిఁ బట్టి కొని తానాజియుఁ దత్సైన్యంబులును బైకెక్కసాగిరి. ఎక్కినవారు కోటసీమలోనికి వెళ్ళి చప్పుడు చేయక చీఁకటిలోఁ గ్రిందఁ బరుండి యుండిరి మూఁడువందల సైనికులు పైకి నెక్కినతరువాత నేదియో పదార్థము క్రిందఁబడి ధ్వనియైనందునఁ గోటమీఁద సైనికులలో నొక్కఁ డది యేమి యైనది కనుఁగొనుటకు వచ్చి శత్రువులచే హతుఁడయ్యెను. అది చూచి రాజపుత్రవీరు లందఱును నడుములు బిగించి యుద్ధసన్నద్ధు లైరి ఈ సంగతిచూచి తానాజి మిగిలిన సైన్యము వచ్చుటకుఁ బూర్వమే తన వెంట నున్న మున్నూఱు సైన్యముతోనే కోటను సాధింప నెంచి మొట్టమొదటఁ దానే శత్రువులపైఁ బడెను ఉభయసైన్యములును ఘోర ముగాఁ బోరాడఁ దొడఁగె మరాటాసైన్యము పూర్తిగాఁ బైకి రాక పోయినను వారు వారికంటె నెన్నియో రెట్లధికముగా నున్న రాజపుత్ర సైన్యముతో సమానముగాఁ బోరాడు చుండిరి ప్రాణములపై నాశవిడిచి మరాటాలు పోరాడుచున్నందునఁ ద్వరలోనే కోట మరాటావారి చేతఁ బడునని యందఱకుఁ దోఁచసాగె కాని యింతలోఁ దానాజీ గాయపడి కీర్తిశేషుఁడయ్యె। † సైన్యాధిపుని గతియట్టులగుట చూచి మరాటా వీరులందఱు భయమంది నలుదిక్కులకుఁ బాఱజొచ్చిరి కాని యింత లోఁ గ్రిందనున్న సైనికు లందఱును దీసికొని సూర్యాజీ (తానాజీ తమ్ముఁడు) పైకి వచ్చి చేరెను తనయన్న పడుటచే సైనికులు భీతులై పాఱిపోవుచున్నారని చూచి వారికి "నోడకుఁ డోడకుఁడ' అని ధైర్యము చెప్పి యెలుంగెత్తి యిట్లనియె "రణ హతుల విట్లిచ్చట విడచి పోవుట మీకు ధర్మమే। వారి పవిత్ర దేహములఁ దురకలు మాదిగలచే సీడ్పింపరే।

† క్విబెల్ యుద్ధములో జనరల్ ఊల్ఫు ఈప్రకారమె రాత్రి దొంగలవ ముగాఁ బైకెక్కి యుద్ధము జయించి యుద్ధములోఁ బడెను

మీరెచ్చటికిఁ బాఱిపోయెదరు? నేను బైకి వచ్చినతోడనే మోకులన్నియుఁ దెగఁగోయించినాఁడను ఇఁక శత్రువుల నెదిరించి శివాజీ మహారాజు నొక్కయు మీ యొక్కయుఁ గీర్తి రక్షించు కొనుటకంటె నొండు మార్గంబు లేదు" సూర్యాజిచే నుచ్చరింపఁబడిన యీ మాటలువిని కొంత ధైర్యము తెచ్చుకొని సైనికులు తిరిగి శత్రువులతో ఘోరముగాఁ బోర సాగిరి రెండు గడియలవఱకు రామరావణయుద్ధమయ్యె రాజపుత్ర సైన్యములు విఱిగె రమారమి యేనూర్గురు రాజపుత్రసైనికులును వారి నాయకుఁడైన ఉదేభానుఁడును బడిరి అసంఖ్యజనము పాఱిపోవుసమ యంబునఁ గలజాఱి కొండక్రిందఁబడి హతమయ్యె. అనేకు లక్కడక్కడ రాలక్రింద దాఁగియుండి ప్రాతఃకాల మైనతరువాత శరణుఁ జొచ్చిరి. మరాటావీరులలో మున్నూఱుగురు సైనికులు హతులైరి. కోట స్వాధీన మైనవెంటనే పూర్వసంకేతానుసారముగా నొక పెద్దమంట పెట్టి జయ వార్తకొఱకు రాయగడములో సింహగడము వైపుననే దృష్టి చాచి చూచుచున్న శివాజికి నావార్త తెలిపిరి (౧౬౭౦)

గెలిచినార మనిన సంతోషముతో రెండవరోజు మరాఠాసైన్యము జయఘోషచేయుచు రాయగడమునకు వచ్చెను కాని శివాజీ యాసైన్యము లలోఁ దనసేనానాయకునిఁ గానఁడయ్యె. తానాజి యెక్కడనున్నాఁ డని యడుగఁగా నాతఁడు వీరమరణముఁ జెందె ననియు నాతనిప్రేతమును సూర్యాజి పల్లకిలో వేసికొని వచ్చుచున్నాఁ డనియుఁ దెలిపెను. తానాజి పడె ననినతోడనే దుర్గము సాధించిన సంతోష మంతయుఁ బోయి మిక్కిలి దుఃఖముతో జయించి వచ్చిన వీరులను జూచి "సింహగడము లోని సింహముపోయి కేవలగడము మనచేతఁ జిక్కినది సుమా," యని పలికెను. తనకుఁ గుడిచేయివలెనున్న తానాజి మృతిచెందినందులకు శివాజి మిక్కిలి దుఃఖించె అఫ్జుల్ఖానుని వధసమయమందును, దిల్లీప్రయాణ సమయమందును తానాజి శివాజివెంటనే యుండి యెన్నియో కష్టముల కోర్చి స్వామిసేవ చేసెను అందుచే నాతని మరణమువలన శివాజికి నమితదుఃఖము కలుగుట యాశ్చర్యముకాదు, సూర్యాజిని బిలిచి "శౌర్య

మున అన్న పేరు విలిపితి"వవి కొనియాడి యాతఁడు గెలిచిన దుర్గము నకు నాతని నధిపతిఁజేసెను సింహగడము సాధించిన నెలరోజులకు పురందరదుర్గంబును మరాటాల స్వాదీన మయ్యెను ఈకోటను సాధించినవాఁడు సూర్యాజియే (౧౬౭౦ మార్చి)

కొంకణములో మోరోపంతుపింగళే పేష్వా మాహులీ యను కోటను ముట్టడించెను. కోటలోనివారు హోరాహోరిగాఁ బోరాడి వేయి మంది మరాటావీరులఁ బడవైచి వారినిఁ బాఱఁదఱిమిరి పేష్వామరలఁ దనసైన్యములఁ గూర్చుకొని కోటమీఁదికివచ్చి మరలఁ దఱుమఁబడియె అయినను పేష్వా యా కోటను ముట్టడించి రెండు నెలలవఱకు విడిసి యున్నందునను దుర్గములోనివారి కెక్కడినుండియు సాయమురానందునఁ గోటలోనివారు కోట పేష్వాల కిచ్చివేసి వెడలిపోవలసినవారైరి తరువాత పేష్వా కరనాళా యనుదుర్గమును సాధించెను. ఇట్లు జూన్ నెల అఖరు వఱకు కొంకణములోని కళ్యాణప్రాంత మంతయు మరాటావారికి లోఁబడియె.

జింజిరా యనుదుర్గమును సాధింపవలయు నని ౧౬౬౫ వ సంవత్సరము నుండి శివాజి యాలోచన చేయుచు డెను ప్రతి సంవత్సరము నా దుర్గమును ముట్టడించి కోటలోని శిద్దివాఁడు నేఁడు శరణువచ్చును, రేపు శరణువచ్చు ననుకొనుచునె కాలము గడిపెను గాని శిద్ది స్వాధీనము కాఁడయ్యె. ౧౬౭౦ వ సంవత్సరములో శివాజి శిద్దీని నెట్లయిన సాధింప వలయు నని యాతనిపయి గొప్పసైన్యమంపెను నీవు మమ్ము శరణుఁ జొచ్చిన నీ కిదియిచ్చెద నది యిచ్చెద నని యాశయుఁజూపెను తుదకు దుర్గాధిపతియైన ఫత్తేఖానుఁడు మరాటాలకు దుర్గమిచ్చి వేయుటకు సిద్ధపడెను. కాని యాతని చేతిక్రింది ముగ్గురు సైన్యాధిపతులీమాటకు నొప్పుకొనక, దుర్గము శత్రువుల కిచ్చి వేయునేమో యను భయముచేత ఫత్తేఖానునిఁ జెఱఁబట్టి మఱియొకని నధిపతిగా నేర్పఱుచుకొని ఔరంగజేబున కిట్లు వర్తమాన మంపిరి "జింజిరామీకు విచ్చివేసెదము. ఇదివఱకు విజాపూరివారి చేతిక్రింద సామంతులుగా నున్నటుల నింకమీఁద మీయొద

సామంతులముగా నుండుదుము. మా సముద్ర సైన్యమును మీసేనలోనే యుంచుకొనవలసినది " ఔరంగజేబు వారిమాటలు అంగీకరించి యా దుర్గమును స్వాధీనపఱుచుకొనెను. ఇట్లు మరాటీవా రెంతయత్నము చేసినను జింజిరా వారిస్వాధీనము కాక మొగలులస్వాధీనమయ్యెను. ఇటు లనే శివాజి జన్మస్థానమైన శివనేరదుర్గము సాధించుటకు నెంతయో ప్రయత్నము చేసియు మరాటావారు విఫలమనోరథులు గావలసినవారైరి.

క్రీ. శ. ౧౬౭౦ వ అక్టోబరు నెలలో శివాజి ధనముచే వి॥ లువీఁగి యున్న సూరత్ పట్టణము రెండవసారి దోఁచికొనెను పదునైదువేల మహారాష్ట్రవీరులతో శివాజి సూరత్పట్టణమునకు వెళ్ళునప్పటికి నచ్చట నెదిరించుటకు వేయిభటు లయినను లేకయుండిరి. అందుచే మరాటా దండు భయమువిడిచి నెమ్మదిగా మూఁడుదినములవఱకుఁ బట్టణమును గొల్లగొట్టెను అచ్చటనున్న యిరోపీయవర్తకులలో నింగ్లీషు వర్తకులు మాత్రము స్వసంరక్షణము చేసికొనిరి డచ్చివారి వర్తకశాల దూరముగా నున్నందున మరాటావారు వారిజోలికిఁ బోరయిరి ఫరాసు లనఁబడు ఫ్రెంచివారు మరాటావారికి త్రోవ యిచ్చి క్రొత్తగా మక్కానుండి వచ్చి యా పట్టణములో విడిసియున్న కాస్కరుపట్టణపు పదభ్రష్టుఁడైన యొక రాజు నిడిదికిఁ బోనిచ్చినందున వారివర్తకశాల బందిపోటువారి పాలు కాదయ్యె ఆ పట్టణములో శివాజికి నమితధనము దొరకెనని చదువరులు గ్రహించియే యుందురు.

బర్హాణపురమునుండి తన మీఁదికి నొక్క ప్రచండమైన మొగల సైన్యము వచ్చుచున్నదని మూఁడవరోజు శివాజికిఁ దెలిసినందున నాతఁడు తన సైన్యములను దీసికొని తనరాజ్యమునకుఁ బయలుదేరెను. బయలుదేరునప్పుడాతఁడు సూరత్పట్టణవాసుల కిట్లు వర్తమానమంపెను. "మీరు ప్రతి సంవత్సరము పండ్రెండులక్షల రూపాయలు కప్పము కట్టు చుండవలసినది లేనియెడల మేము ప్రతి సంవత్సర మెప్పుడో యొక సారి మీ పటణ మిట్టులనే కొల్లకొట్టుచుండెదము" శివాజి దొరకినసొత్తం

తయుఁ దీసికొని కంచనమంచన మనఁబడు పర్వతము మీఁదినుండిపోవుచుండఁగా, దాఊద్‌ఖాన్ అను మొగలు సరదారుఁ డైదువేల సైన్యముతో దనవెనుక వచ్చుచున్నాఁడనియుఁ గొంకణదేశములోనికి దిగునప్పుడు నాసిక పట్టణమునొద్దఁ దగులు కనమలయొద్ద మరియొక మొగలుల గొప్పసైన్యము విడిసి యున్నదనియు వినెను. సూరత్పట్టణములో సంపాదించిన యపార ధన మీ యుభయ సైన్యముల చేతులఁ బడకుండఁ దప్పించుకొనుట కేద్ది యుపాయంబని యోజించి శివాజి తన సైన్యమును నాలుగయిదు భాగములుగ విభజించి యొక భాగమున శత్రువుల గొప్ప సైన్యముతోఁ బోరాడుచు వీలు కానప్పుడుఁ బాఱిపోవుచు శత్రువులకుఁ బని కల్పించుచుండునట్లును మఱి రెండు భాగము లిటునుండి కొంత సేపు, నటునుండి కొంత సేపు, శత్రువులపైఁ బడునటుల నటించుచు శత్రుసైన్యములను నిటునటు తొలఁగించు చుండునట్లును, ఇంకొక భాగము ధనమంతయుఁ దీసికొని యెవరికిఁ దెలియకుండఁ దాఁటునట్లును నియమించెను. ఇట్లు తన యసామాన్య ప్రజ్ఞచేత ధనమంతయు ముందు తన దేశము చేరునట్లుచేసి శివాజి వెనుక చిక్కిన సైన్యములతో వచ్చుచుండఁగా మొగల సరదారుఁ డగు దావూద్‌ఖాను అతనిని సమీపించెను. కాని శివాజి అకస్మాత్తుగా వెనుకకుఁ దిరిగి శత్రుసైన్యములపైఁ బిడుగు పడునటులఁ బడినతోడనే యాతఁడు వెనుకకుఁ బాఱవలసినవాఁ డాయెను. తరువాత శివాజి తన సైన్యముల నన్నిటిని గూర్చుకొని కొంతదూరము పోయి తనతోఁ బోరాడుటకై పిలిచి యున్న మొగలుల సైన్యముపైఁ బడెను. ఉభయ సైన్యములు ఘోరముగాఁ బోరాడె. తుదకు మొగలులకే యపజయము ప్రాప్తించె. ఈ యుద్ధములో మాహూర్ పట్టణమునకు దేశముఖియైన రాయగాబీణ్ అను శూరవనిత మొగలుల పక్షావలంబనముచేసి శివాజితోఁ బోరాడెను. తుదకు నా బిడ శరణుజొచ్చినందున నామెను సన్మానించి శివాజి యామె గ్రామమునకుఁ బంపెను.

శివాజి స్వస్థానమునకు వచ్చిచేరిన తరువాత ప్రతాపరావుగుజర్ అను వానికిఁ బదివేల గుఱ్ఱంబులను, పేష్వాయైన మోరోపంతుపింగళేకు

ఇరువదివేల కాల్బలమును ఇచ్చి వారిని నుత్తరమునకుఁబంపెను మొదట సముద్రతీరమున నున్న భరోచ్ పట్టణమును దోఁపవలయు నని వారి యభిప్రాయమై యుండెను సముద్రముమీఁది నుండియుఁ బట్టణమునకు భీతికలుగఁ జేయవలయునని శివాజీ తన నూట యిరువది యోడలను ఆ పట్టణము వైపునకుఁ బంపెను. కాని కొన్ని దినములకు నే హేతువు చేతనో గాని వారి యుద్దేశము మాని శివాజి తన యోడలను మరలఁ బిలి పించుకొనెను ఓడలు తిరిగివచ్చునప్పుడు దమణ్ అను రేవులోఁ గొన్ని పోర్చుగీజువారి యోడ లుండెను ఆ యోడలను బట్టి మరాటా యోడల వారు తీసికొనివచ్చిరి కాని దీనికి బదులుగా పోర్చుగీజువారు మరాటా వారి కొన్ని యోడలను బట్టుకొనిపోయిరి (౧౬౭౧)

భరోచ్ పట్టణమువైపున నున్న సైన్యములను బిలిపించి శివాజి వానిని ‡ ఖానదేశమునకుఁ బంపెను అటు మొగలుల సైన్యములు లేనం దున ప్రతాపరావు గుజర్ దేశమంతయుఁ గొల్లగొట్టుచు ప్రతి పట్టణము నుండి యప్పనంబులు గొనుచు విశేషముగా ధనార్జనము జేసెను. ప్రతి గ్రామపు పటేల్ కరణముల యొద్దనుండి మేము మొగలులకిచ్చు కిరఖార ములో నాల్గవ వంతు శివాజీకి నియ్యఁగలవార మని వ్రాయించుకొనెను. ఈనాల్గవ వంతిచ్చినవారికిఁ దాను రసీదిచ్చెద ననియు,ఎవరియొద్ద రశీదుం డునో వారిని మరాటావారు బాధపెట్ట రనియు గ్రామస్థులతోఁ జెప్పుచు వచ్చెను మొగలుల రాజ్యములో మరాటావారు చౌథ్ అను పన్నువసూలు జేయుటకుఁ బ్రారంభించిన కాల మిదియె అటు మోరోపంతులుపేష్వా ఆవధా, పట్టా, సాలేర్ మొదలయిన దుర్గములను సాధించిరి. (౧౬౭౧ జ్యాను అరి)

ఇట్లు దక్షిణమున శివాజి మొగలరాజ్యమును గొల్లకొట్టుట విని

---

‡ బొంబాయి రాజధానిలోని కొంతభాగము

ఔరంగజేబు తన కుమారుఁ డయిన మోఆజిమ్ అనువాఁడును యశవంత సింగును శివాజిలోఁ గలిసి యున్నారని సంశయించి యశవంతసింగును నుత్తరమునకుఁ బిలిపించుకొని మోహబత్ ఖాన్ అనువానిని నలుబదివేల సైన్యముతో దక్షిణమునకుఁ బంపెను. మోహబత్ ఖానుఁడు రాజపుత్రుని లక్ష్యపెట్టక స్వతంత్రించి మరాఠావారితో యుద్ధములు చేయసాగెను. (౧౬౭౧) వర్షాకాలము వచ్చునఱకు నాతఁడు రెండు దుర్గములను సాధించెను. పూర్వమువలెనే దిలేర్ ఖానుఁడు సైన్యములో రెండవ యధికారియై యుండెను ఈతఁడు తన సైన్యములను రెండు భాగములుగ విభజించి యొక్క సైన్యముతో చాకణ్ దుర్గమును, మఱియొక సైన్యముతో సాలేర్ దుర్గమును ముట్టడించెను. సాలేరీ దుర్గమునకు ఖానదేశముయొక్క ద్వారమని పేరు ఆ సంవత్సరమునందు నీ దుర్గములో మరాఠావారు వలయునంత సామగ్రి సంగ్రహించి యుంచిరి. ఆ దుర్గమునకు సమీపమునం దుంపఁబడిన రెండువేల గుఱ్ఱములను దురుష్కు లొక్కసారి నాశనము జేసిరి. ఈ సమాచారము తెలిసినతోడనే శివాజి సాలేర్ దుర్గ సంరక్షణార్థమై యిరువదివేల గుఱ్ఱపు సిబ్బంది నిచ్చి ప్రతాపరావు గుజర్ను, పేష్వా మోరోపంతుపింగళేను బంపెను మరాఠాగుఱ్ఱము తమ మీఁదికి దండు వచ్చుచున్నదని విని వారిని త్రోవలోనే ఎదిరించుటకై తన సైన్యమంతయు నిచ్చి యఖలాసఖానుని బంపెను ప్రతాపరావు మరాటా సైన్యమునకు మొనగాఁడై నడచుచున్నందునఁ దురకల రాక చూచి వారిని మోసపుచ్చఁ దలంచి శత్రువులు పైఁబడినప్పుడు పాఱిపోయినటుల నటింపవలసినదని దన సైన్యములకుఁ జెప్పియుంచెను యఖలాసఖానుఁడు యుద్ధము ప్రారంభించిన వెంటనే మరాటావీరులు పాఱఁజూచిరి. తురకలు వారివెంటఁ దగిలి తఱుమునప్పుడు దట్టముగా నుండక యక్కడక్క డొక్కొక్కరుగా నిల్చిరి అదిచూచి పాఱిపోవు మరాటా సైనికులు మరలి శత్రువులపైఁ బడి చెండాడసాగిరి అటు ప్రతాపరావు సైన్యములు ఇటు పేష్వాల సైన్యము చెండాడఁగాఁ దురకల సైన్యములు తాళలేక పాఱఁబొచ్చెను. మొగల సైన్యాధిపతులు పాఱిపోవు సైనికులను

బోగుజేసి మరల మరల మరాటావారితోఁ బోరాడ యత్నించిరి. కాని మరాటావారి శౌర్యమునకుఁ దాళలేక చెదరి మోగలుల సేనానాయకు లల్లో నిరువది యుద్ధము హతులైరి కొందఱు గాయపడి మరాటావారి చేతఁ జిక్కిరి మరాటావారి సరదారు లనేకులు హతులైరి నిహతు లయినవారిలో సూరేరావ్ అనువాఁడు విశేష విఖ్యాతుఁడై యుండెను. యాతఁడు శివాజీకి బాల్యస్నేహితుఁడు. శివాజీచే నియమింపఁ బడిన పనుల చక్కఁగా నెఱవేర్చు చున్నందున పంచహజారీ యను పదవిఁ జెందియుండె గాయపడినవారును, నిహతులైనవారును గూడి యైదువందల మరాట వీరు లీ యుద్ధమునకు బలియైరి ఈ యుద్ధము బహు ఘోరముగా జరిగినదని చెప్పెదరు యుద్ధ స్థలమందుఁ గ్రోసెడు దూరమువఱకు ధూళి యెగిరి యెదుటి ఖడ్గుండు శత్రుఁడైనది మిత్రుఁడైనది వీరులకుఁ దెలియకుండె రక్తము వఱదలుగాఁ బాఱినది ఈ యుద్ధాంతమున మరాటావారికి నూటయిరువది యేనుఁగులును ఆఱు వేల యొంటెలును, ఆఱువేల గుఱ్ఱంబులును దొరకెను. ఇవిగాక నాణెము లును, రత్నములును, విలువఁగల బట్టలును అనేకముగా దొరకెను

గాయపడి మరాటావారిచేతఁ జిక్కిన తురక సరదారులను శివాజీ యొద్దకుఁ దీసికొనిపోఁగా నాతఁడు వారిని గౌరవించి వారికి నౌషధోప చారములు చేయించి బాగయిన పిదప వారిని వారివారి దేశములకుఁ బంపి వేసెను. వారిలో నిష్టమున్న కొందఱను దన సైన్యములో నుంచుకొనెను.

చాటులేని పటాంగణముమీఁద శత్రువులను నెదిరించి వారిని మరాటావారు పరాజయపఱచుట మొదట నీ యుద్ధమునందే యని చరిత్ర కారులు చెప్పెదరు. ఈ యుద్ధమైనప్పటినుండియు మరాటావారి శౌర్య విఖ్యాతి దిగంతవిశ్రాంత మయ్యెను

మరాటావారి వలనఁ దన సైన్యమున కిట్లు పరాభవము కలుగుట విని ఔరంగజేబు బాదుషహా తన కుమారుఁడయిన మొఅజీమును, మొహ

బత్ ఖానుని దక్షిణము నుండి ఢిల్లీకిఁ బిలిపించుకొని, గుజరాత్ దేశపు సుబేదారుఁడగు ఖాన్‌జహాన్ బహద్దర్ అనువానిని దక్షిణమునకు సుబేదారునిగాఁ బంపెను. కాని వానిచేతిక్రిందఁ బూర్వపు దిలేర్‌ఖానునే రెండవ యధికారిగా నుంచెను తనయొద్ద సైన్యము విశేషముగా లేనందున శత్రువుల రాజ్యములోనికి వెళ్ళి పోరాడుట మంచిదికాదనియు, శత్రువులు మన రాజ్యములోనికి రాకుండఁ గాపాడుకొనినఁ జాలుననియుఁ దలఁచి సుబేదారుఁడు మరాటావారు కొంకణమునుండి పయికి వచ్చు కనుమలన్నియు మఱి యుతర త్రోవ లన్నియు సంరక్షించుటకుఁ దనభటులను నియమించెను ఇట్లుఁ జేసిన లాభము లేదనియు, వారి దుర్గములను సాధించినఁ గాని శత్రువులు లొంగరనియు దిలేరఖాను డెంతచెప్పినను సుబేదారుఁడు వినఁడయ్యె ఇటు మరాటావారు కనుమల నుండి ఖానదేశమునకు వెళ్ళఁగా ఔరంగాబాదు మొదలయిన ప్రదేశములకు దాడివెళ్ళి గ్రామములు కొల్లగొట్టసాగిరి వారి నెదిరించుటకై యనేకదిక్కులనుండి యనేక స్వల్పసైన్యములను సుబేదారుఁ డంపెను కాని మరాటావారి యుద్దేశము తురకలతోఁ బోరాడుట కాక తురకలరాజ్యము గొల్లగొట్టి వీలయినంత ధనము తీసికొని పోవుటయే యైనందున వాండ్రు శత్రువులతోఁ బోరాట తప్పించుకొని పెక్కుసారులు పాఱిపోవుచుండిరి. కాని తమచేతఁ జిక్కిన ధనముమాత్రము శత్రువుల చేతిలో నెన్నఁడును దొరకనిచ్చినవారు కారు ఇంతలో వర్షాకాలము నారంభ మయినందున సుబేదారుఁడు యుద్ధము మాని భీమానదీ తీరమునం దున్న యొక గ్రామములో నాలుగు నెలలు విడియవలసిన వాఁడాయెను. అతఁ డక్కడ నొక దుర్గము నిర్మించి దానికిఁ దనపేరిట బహాదుర్‌గడ మని పేరుపెట్టెను అప్పటినుండి నలుబది సంవత్సరములవఱకును మొగలుల సైన్యమునకు బహాదుర్ గడమె ముఖ్యమైన విడిదియై యుండెను.

౧౬౭౭ లో శివాజీ గోలగొండపై దాడివెడలి యచ్చటి సుల్తాను నొద్దనుండి యనేకధనం బప్పనంబుగాఁ గొనియె. అటు శివాజీ వెళ్లుట

చూచి ఔరంగజేబు జింజీసిద్ది ఈయిద్దఱుహబ్షి పడవ లనేకములు పోగు చేసికొని సముద్రము మీఁదినుండి కొంకణదేశముపైకి వచ్చి శివాజి రాజ్యములోని యనేక గ్రామములను గాల్చి కొల్లఁగొట్టిరి. ధుండీరాజపుర ములో నున్న శివాజియొక్క సముద్రసైన్యమంతయు నాశముచేసిరి ఈ యుద్ధములో రాఘోబల్లాళుఁడను నొక వృద్ధమరాటవీరుఁడు పడెను

విజాపూరు నవాబు కాలముచేసి యచ్చటిమంత్రుల పరస్పర కల హములవలన నరాజక మైనందున సమయ మిదియే యని తలఁచి శివాజి సైన్యమును విశాల గడముపైఁ జేర్చి యందుఁగొందఱను పన్హాళాదుర్గము పైకిఁ బంపి దానిని సాధించెను కొందఱకు అణ్ణాజీదత్తో యను, సేనా నాయకునిగా నిచ్చి హుబలీ పట్టణముపైకిఁ బంపెను మరాటావా రాపట్ట ణమును ఁటఁచుకొని సూరత్ పట్టణములో దొరకిన ధనముకంటె నధిక ధనమును సంపాదించిరి అచ్చట ఇంగ్లీషు, ఫ్రెంచు, డచ్, మొదలైన పాశ్చాత్యుల దుకాణము లుండెను వారందఱయొద్ద నుండియు మరాటా వారు ధనముఁగైకొనిరి ఇంగ్లీషువారి దుకాణములలో ౭౮౯౪ వరహాలు మరాటావారికి దొఱకెను (౧౬౭౩ మార్చి)

ఇట్లు విజాపూరువారితో యుద్ధము పెట్టుకొన్నందున నిటు మొగ లులతో నటు విజాపూరివారితో నొక్కసారి పోరాడుట మిగుల కష్టమని తలఁచి శివాజి మొగలులతో "మేము మీరాజ్యములోనికి రాము. మీరు మా రాజ్యములోనికి రావలదు" అని సంధిచేసికొనెను

మరల సముద్రసైన్యముఁ గూర్చుకొని కార్వార్, అంకోలా మొదలైన సముద్ర తీరమునం దున్న విజాపూరువారి గ్రామములపైకి నాసైన్యమును బంపెను ఆ ప్రాంతప లోని దేశముఖి దేశపాండ్యాలను వశపఱుచుకొని వారు విజాపూరు వారిపైఁ దిరుగఁ బడునటుల జేసెను. తురకరాణేదార్ల నందఱను వెడలఁ గొట్టింపసాగెను. ఈ యాగమంతయుఁ జూచి పీదనూరు రాణా యధికారి భయపడి శివాజికి వశుఁడై ప్రతిసంవ త్సరము కప్పము కట్టుటకు నొప్పుకొనెను.

౧౬౭౩ లోనే పరళీ, సాతారా, చందనవందన్, పాండుగడ్, సాందగిరీ, టాథోరా మొదలైన శత్రుదుర్గములను శివాజి సాధించెను. ఇట్లు శివాజి విజాపూరివారి దేశములోని కోటలను నెదురులేక జయించుట చూచి విజాపూరువారు భయపడి అబ్దుల్‌కరీమ్, బహిలోల్ఖాన్ అనువానిని పండ్రెండువేల సైన్యముతోఁ బన్హాళా కోటవైపునకుఁ బంపిరి. ఆ ప్రాంతమునందు మరాటాలచే స్వాధీనపఱచుకొనఁబడిన కొన్ని దుర్గములను వాఁడు మరల సాధించెను. ఈ సంగతి తెలియఁగానే శివాజి గొప్ప సైన్యమిచ్చి ప్రతాపరావు సర్నోబత్ అనువానిని వారిమీఁదికిఁ బంపెను. ప్రతాపరావు విజాపూరు రాజ్యములోనికిఁ జొరఁబడి విజాపూరుపఱకు పట్టణములను గల్చిపేల్చి దోఁచుకొనసాగెను. అతని నెదిరించుటకై విజాపూరు సైన్యములు తిరిగి వచ్చుచుండఁగా ఉంబరాణి యొద్ద ఉభయసైన్యములు కలిసి రెండుజాములవఱకు హోరాహోరీగాఁ బోరాడెను. మరాటావారు తురకసైన్యములను నలుదిక్కులనుండి చుట్టుకొని వారికి త్రాగుటకు నీళ్లు దొరకకుండఁ జేసిరి. ఇంతలోఁ బ్రొద్దుగుంకె. అప్పుడు తురుష్కులు నిరుపాయులై మేమింక మీ రాజ్యములోనికి రాము మమ్మునిప్పుడు పోనియ్యవలసినది అని వేఁడుకొనిరి. ప్రతాపరావు సదయచిత్తుఁడయినందున శత్రుప్రార్థన నంగీకరించి వారిని బోనిచ్చెను. శత్రువులిట్లు చేతఁజిక్కినప్పుడు వారి నింత సులభముగా విడిచిపెట్టినందులకు శివాజి ప్రతాపరావును నిష్ఠూరములాడఁగా నాతఁడు కోపగించి దూరముగా విదర్భదేశమునకు దాడివెడలి పోయెను.

ప్రతాపరావు దూరదేశమునకు వెడలిపోవుట చూచి విజాపూరు సైన్యము పన్హాళాదుర్గమును సాధించుటకై తిరిగి వచ్చెను. శివాజి కీవర్తమానము తెలిసెను గాని ప్రతాపరావు దూరదేశమున నుండినందునను, వేఱుసైన్య మొద్దలేనందునను నాతఁడీతురుష్కసైన్యమును నెదిరింపలేక పోయెను. ఇంతలో నీవృత్తాంతమెట్టులనో తెలిసి ప్రతాపరావు పన్హాళా దుర్గమునకు వచ్చి తురుష్కుల నెదిరించెను. అప్పుడు శివాజి యాతని కిట్లు వర్తమాన మంపెను. "వెనుక నీ సైన్యములు మీచేతఁ

చిక్కినప్పుడు వీరిని నాశనము చేయక వదలినందులకు వీరిప్పుడు మరల మరల మనలను బాధపెట్టవచ్చినారు ఇఁకనయినను వీరినందరను నశింపఁ జేయక నాకు ముఖము చూప నక్కరలేదు" యుద్ధము చేయుటకు సిద్ధముగా నున్నప్పు డిట్టివార్త వచ్చినందున ప్రతాపరావు రోషద్వేషాంధుఁడయి తగినవ్యూహము నేర్పాటుచేసికొనక, తగిన కాలమును నపేక్షింపక యొక్కసారి శత్రుసైన్యముపైఁ బడెను అట్లవ్యవస్థగా యుద్ధమునకు వెడలినందున నాతఁడు ఘోరముగాఁ బోరాఁడినను రణరంగమునఁ దోడిభటులతోఁ దెగవలసినవాఁడాయెను సేనాధిపతి తెగినతోడనే ఇతర భటులు వారికి బుద్ధి చెప్పిరి ఇట్లు మరాటాబలములు వెనుతిరిగి పాఱుచుండ నక్కడికిఁ గొంతదూరమున నున్న హంసాజీమోహితే యను పంచ హజారీ సరదారుఁడు దేవునివలె నడ్డపడి, మరాటాలకు "ఓడకుఁడి ఓడకుఁడి" అని ధైర్యమిచ్చి అదివఱకు మరాటాలను దఱుముకొని వచ్చుచున్నందునఁ జెదరియున్న తురుష్క సైన్యముపైఁబడి చెండాడెను. అది చూచి పాఱిపోవుచున్న మరాటావీరులును దిరిగి తురుష్కులతో యుద్ధము చేయసాగిరి అందువలన మరాటాలను దఱుముచువచ్చిన తురుష్కులు మరాటాలచేఁ దఱుమఁబడి, వారైరి. ఈ యుద్ధము జేసరిగ్రామము నొద్ద జరిగెను ఈ యుద్ధవార్త తెలియఁగా ప్రతాపరావు తెగుటకు శివాజీ మిగులఁ జింతించి యాతని కుటుంబము రక్షించుభారము తానువహించి యతని కొమార్తెను దన రెండవ కుమారుఁ డయిన రాజారామునకు వివాహము జేసికొనెను. పరాజయమును జయముగా మార్చిన హంసాజీమోహితే యను వీరునికి హంబీరావు అను బిరుదు నొసంగి మృతిఁజెందిన ప్రతాపరావుయొక్క సర్‌నోబత్ అనునధికారము నిచ్చెను అటులనే సంతాజీ ఘోరపడే, ధనాజీజాదవ్ అను వీరు లీయుద్ధమునందు మిగుల శౌర్యమును చూపిరిగాన వారిని జుమ్లాదారు అను నధికారమునందియంతకు పైయధికారముగు సరదారుల వర్గములోఁ జేర్చెను (౧౬౭౪ ఫిబ్రేవరి)

# పంద్రెండవ ప్రకరణము

## రాజ్యాభిషేకమహోత్సవము

ఎవ్వఁడైనను రాజ్యాభిషేకవిధి జరగదేని "రాజ" పదమున కర్హుఁడు కానేరఁడనియు, ఆ విధి జరుగువఱకు నాఁడొకపాళెగారు లేక జమీఁదారుతో సమానుఁడనియు హిందూధర్మశాస్త్రముయొక్క యభిప్రాయమై యున్నది పూర్వపు మూర్ధాభిషిక్తులైన రాజులవలెనే శివాజి రాజ్యమునందు న్యాయవిచారణయు, అష్టప్రధానులును, చతురంగసేనయు, జలస్థల పర్వత దుర్గంబులును మొదలైన యన్ని రాజ్యాంగము లుండెను, గోలకొండ విజాపూరువారు లొంగి యప్పనంబు లిచ్చుచుండిరి ఢిల్లీశ్వరునితో సాటిదొరవలెఁ బోరుచుండె తన పేరిట నాణెములను దేశములోఁ జెల్లుచుండె ఇట్లు రాజలక్షణము లన్నియు నుండి ముఖ్యమైన మూర్ధాభిషేకము లేకపోవుట యశాస్త్రీయ మనియెంచి శివాజి యభిషేక విధియు, సింహాసనారూఢవిధియు సశాస్త్రీయముగాఁ జేయఁదలచె ఒక గొప్ప సభ చేసి తన సరదారులందఱును రావించి వారికిఁ దనమనోభీష్టము తెలియఁ జెప్పె వారందరును నందులకు సంతసించి సమ్మతించిరి రామదాస స్వాములవారును ననుజ్ఞయిచ్చిరి

గొప్ప విద్వాంసులను బండితులను బంపించి రాజ్యాభిషేక విధి యెట్టిదియో యని చర్చింపఁజొచ్చిరి ఒకరొక విధముగాను మఱియొకరు మఱియొక విధముగాను జెప్పసాగిరి హిందూరాజ్యము, సింహాసనము ఛత్త్రచామరములు అభిషేకవిధి మొదలైన సంగతు లన్నియు విదివఱకే నాలుగువందల సంవత్సరములు పూర్వము లోపించినందున దాని గుఱించిన శాస్త్రములును లోపించియుండె. అందుచే నప్పటి పండితులకు రాజ్యాభిషేకం బనఁబునః సృష్టియయ్యె. అప్పు డప్పటిపండితులు చెప్పఁగా

నాలుగువేదములను షట్శాస్త్రములను బూర్తిగాఁ జూచిన గాగాభట్టను బ్రాహ్మణుని గాశినుండి మఱికొందఱు పండితులతోఁ బిలిపించిరి. వారందఱును నొకసభచేసి శాస్త్రోక్తముగా రాజ్యాభిషేకవిధి యంతయు నిర్ణయించిరి. అభిషేక ముహూర్తము ఆనందనామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ త్రయోదశీ గురువారమునాఁ డేర్పఱచిరి (౧౬౭౪ జూన్ ౬)

సిద్ధత యంతయు నైనపిదప బ్రాహ్మణులకు నొక సంశయము కలిగెను. మూర్ధాభిషేకము క్షత్రియులకేగాని యితరులకు లేదు. శివాజీ క్షత్రియవంశ సంజాతుఁడని నిశ్చయముగాఁ దెలిసినఁగాని యభిషేకము చేయుటకు వీలు లేదని వృద్ధగాగా భట్టువారు స్పష్టముగాఁ జెప్పిరి. అప్పుడు శివాజీ ఉదయపురమునకుఁ జారులఁ బంపి యచ్చటివంశవృక్షములను దెప్పించి యచ్చటి రాజపుత్రులను దాను నొక్కవంశమువార మని నిర్ణయించి గాగాభట్టను మెప్పించెను. ఇట్టి సంశయము తీఱిన తరువాత మఱియొక సంశయము కలిగెను. శివాజీ కప్పటికి నిద్దఱు పుత్రులుగలిగి నలుబది యేడు సంవత్సరముల వయస్సుండెను. బ్రాహ్మణునకుఁ బదునాఱు సంవత్సరముల వఱకును క్షత్రియులకు నిరువది నాలుగేండ్ల వఱకును ఉపనయనము కానియెడల వారు వర్ణభ్రష్టులై వ్రాత్యు లనఁ బడుదురు. అందుచే నుపనయనమున పడియుటకు లేని శివాజీ ధర్మశాస్త్రానుసారము వ్రాత్యుఁ డయ్యెను. వ్రాత్యునకు మూర్ధాభిషేక మెక్కడిది? అప్పుడు పండితులు శాస్త్రములను వెదకి శివాజీచేత వ్రాత్యస్తోమ యజ్ఞమును చేయించి యాతని వ్రాత్యత్వదోషమును బాపి యాతనికి నలుబది యేడవ యేఁట మౌంజీబంధనము చేసిరి. జ్యేష్ఠ శుద్ధమందు చవితికి నుపనయన మైనపిదప షష్ఠినాఁటి వఱకు సంబంధవిధి పూర్తియై ముఖ్య యజ్ఞమునకు ప్రారంభమాయెను. ఆ యజ్ఞ మేడు దినములవఱకు జరిగెను. నిత్యము నేఁబదివేల బ్రాహ్మణులకు నన్నదానము జరుగుచుండెను

శివాజియు ఋత్విజులును మాత్రము ఘృతము, పయస్సు, ఫలములు భక్షించుచు నేడు దినముల వఱకు వ్రతస్థులయి యుండిరి

పట్టాభిషేక రోజున శివాజి మంగళస్నానము లాచరించి భవానీ దేవి, తల్లి, కులగురువు, ఋత్విజులు మొదలయిన వారి కందఱకు నమస్కరించి యనుజ్ఞాతుఁ డయి యభిషేకముఁ జేయించుకొనుటకు సువర్ణాతనమున సింహాసన మెక్కెను. భార్య బిడ్డలును బట్టబంధన మాచరించి పట్టమహిషులుగా నభిషిక్త లగుటకు శివాజి యొద్దకు వచ్చి కూర్చుండిరి కొమాళ్లిద్దఱును వచ్చి మఱియొకప్రక్కఁ గూర్చుండిరి ఎనిమిది దిక్కులను అష్టప్రధానులు నొక్కరు ఛత్త్రిమును, నొక్కరు చామరమును, నొక్కరు సువర్ణ కలశమును, నొక్కరు రౌప్యకలశమును బట్టుకొని సింహాసనమునకుఁ జుట్టు నిలిచియుండిరి వైదిక బృందమంతయు వేదఘోషచేయుచు మంత్రోదకములను రాజుపైఁ జల్లుచు నిలిచిరి. మంగళ వాద్యములు, భేరీ మృదంగములు,నృత్యగానములు, వందిమాగధ జయశబ్దంబులు, ఫిరంగిమ్రోతలు మొదలయిన వానితో నలుదిక్కులు ఘూర్ణిల్లె అప్పుడు మూర్ధాభిషిక్తుఁ డయినరాజు తులాపురుష దానముచేసి పదునాఱువేల వరహాలు బ్రాహ్మణులకుఁ బంచిపెట్టెను గాగాభట్టునకు లక్షరూపాయల దక్షిణ యొసంగె ఋత్విజుల కొక్కొక్కనికి నయిదు వేల రూపాయలు సంభావనగానిచ్చెను ఇతర విద్వాంసుల వారివారి యోగ్యతానుసారము గౌరవించె తన మంత్రులకు నితర సేవకులకు నేనుంగులు, గుఱ్ఱంబులు, పల్లకులు, బంగారు కింకెలు బహుమతిగా నొసంగె. రాజ్యాభిషేక సమయమున శివాజి తన యష్ట ప్రధానులకు నది వఱకున్న తురుష్క నామములను దీసి సంస్కృత నామములుగా మార్చెను పూర్వము సర్ నౌబత్, న్యాయాధీశుఁడు అను పేరుగల అధికారులిద్దఱుండిరి వారిని నొక్కొక్కరిగా మార్చెను

అష్టప్రధానుల వార్షిక వేతనములను వృద్ధిచేసెను.

| అధికారి పేరు. | అధికారముయొక్క పూర్వపు పేరు | క్రొత్తగాఁబెట్టఁబడిన పేరు | వేతనము హోనులు |
|---|---|---|---|
| ౧ మోరోపంతుపింగళే | పేషవా | ముఖ్యప్రధాన్ | 15000 |
| ౨ రామచంద్రపంత్ | ముజుందార్ | పంత్ అమాత్య | 12000 |
| ౩ అణ్ణాజిదత్తో | సురవీస్ | పంత్ సచీవు | 10000 |
| ౪ దత్తాజిపంత్ | వాకవీస్ | మంత్రి | 10000 |
| ౫ హంబీరరావుమోహితే | సర్ నోబత్ | సేనాపతి | 10000 |
| ౬ జనార్దనపంత్ | డబీర్ | సుమంత్ | 10000 |
| ౭ బాళాజిపంత్ | న్యాయాధీశుఁడు | న్యాయాధీశుఁడు | 10000 |
| ౮ రఘునాథపంత్ | న్యాయశాస్త్రి | పండితరావు | 10000 |

రాజ్యాభిషేక మయినప్పటి నుండియు శివాజి రాజ్యాభిషేకవశమని తన పేరిట క్రొత్తశకమును ప్రారంభించెను అన్ని వ్యవహారములందును దన్ను "క్షత్రియ కులావతంస శ్రీ రాజా శివచ్ఛత్రపతి" అని సంబోధించవలయునని యాజ్ఞాపించెను

ఈ రాజ్యాభిషేక మహోత్సవమునకు గోలకొండ నవాబు తన మంత్రులను బంపి ధన కనక వస్తు వాహనంబు లనేకములు శివాజికి గానుక యిచ్చెను. ఇతర మాండలిక రాజులును, పాళెగారులును, ఇంగ్లీషు, పోర్చుగీజు మొదలయిన పరదేశీయ వర్తకులును ఈ మహోత్సవ సమయమున శివాజికి ననేక కట్నంబు లిచ్చిరి ఇంగ్లీషువారు శివాజితో సంధి చేయుట కయి పంపిన హెన్రి ఆక్సెండేన్ అను దూత ఈ యుత్సవ సమయమున రాయుగడము మీఁదనే యుండెను. ఇంగ్లీషువారెట్లు శివాజితో సంధి చేయఁదలఁచిరో యటులనే శివాజియు ఇంగ్లీషువారితో సంధి చేయ నొప్పుకునెను. రాజాపూరు పట్టణము ౧౬౬౧లో శివాజి దోఁచి

నప్పుడు ఇంగ్లీషువారి యొద్దనుండి పదివేల హోనుల వెలగల వస్తువులు తీసికొనెను ఆ ధనము త్రిప్పియిమ్మని ఇంగ్లీషు వారడుగుచుండిరి మీరు నాకు జింజిరా సాధించుటకు సహాయము చేసిన మీ ధనము మెకిచ్చెదనని చెప్పుచుండెను అప్పుడింగ్లీషువారు కేవల వర్తకు లయినందున యుద్ధము చేయనొల్లక మాకు యుద్ధములతోఁ బ్రయోజనము లేదని తప్పించుకొనుచుండిరి ఇట్లుభయులకును గొన్ని రోజులు సంధి విషయక చర్చ జరిగి రాజ్యాభిషేకమునకుఁ గొన్నిరోజుల పూర్వము వారికిట్లు సంధి కలిగెను —

1 రాజాపురములోని ఇంగ్లీషువారి దుకాణములోఁ దీసికొనిన సొత్తంతయు శివాజి ఇంగ్లీషువారికిఁ ద్రిప్పి యియ్యవలయును రాజాపురము, దాభోళ్, కళ్యాణ్, పట్టణములలో వర్తకమున కయి ఇంగ్లీషువారి దుకాణము లుంచుకొన వచ్చును

2. శివాజీ రాజ్యములో నిష్టము వచ్చినచోట నిష్టము వచ్చిన ధరలకు ఇంగ్లీషువర్తకులు సరకు లమ్ముకొనవచ్చును.

3. ఇంగ్లీషువారు శివాజికి నూటికి రెండు రూపాయల చొప్పున పన్ను నియ్యవలయును.

4. ఉభయుల నాణెములు భయుల రాజ్యములలోఁ జెల్లవలయును'

. ఇంగ్లీషువారి యోడలు పగిలి రేవునకు వచ్చిన యెడల నందలి సరకులను నపహరించక ఇంగ్లీషువారికిఁ ద్రిప్పి యియ్యవలయును.

రాజ్యాభిషేకమయిన పదునైదుదినములకు శివాజి తల్లియైన జిజాబాయి పరలోకగత యయ్యెను. తనులారఁ గొమారుని పట్టాభిషేకముఁ జూచి యావీరమాత సంతోషముతో దేహమును త్యజియించె ధన్యాత్మలగు వీరమాతలలో నీమె యొకర్తె యనుటకు సందేహములేదు.

# పదమూఁడవ ప్రకరణము

## కర్ణాటద్రావిడ దేశములపై దాడివెడలుట

మొగలాయి మరాటావారితోఁ జేసినసంధికి విరుద్ధముగా శివాజి యొక్క రాజ్యములోని కొన్ని గ్రామములు కొల్లగొట్టినందున మొగలుల తోఁ బోరాడుటకు శివాజికి నెలవు దొరకెను ముఖ్య ప్రధానియైన మోరో పంత్‌పింగళే మొగలుల రెండు దుర్గములను సాధించెను. శివాజి జన్మ భూమి యయిన శివనేరీ దుర్గము సాధింప యత్నించెను గాని విఫలప్రయ త్నుఁడయ్యె హంబీర్‌రావు సూరత్‌పట్టణమునొద్ద నున్న కనుమలద్వారా ఉత్తరదేశమునకు వెళ్లి తన గుఱ్ఱపురౌతులను నలుదిక్కులకుఁ బంపి బరహాణపురము వఱకు దేశమును కొల్లగొట్టెను. భడోచ్ పరగణా లోనికిఁ జొరఁబడి అక్కడివారిచే నప్పనముగొనియె మఱాటావారు నర్మదానది దాఁటి యుత్తర హిందూ దేశమునకు దాడివెడలిన ప్రథమ ప్రసంగ మిదియె మొగలులు హంబీరావు సైన్యమును తఱుముకొని వచ్చిరి గాని మరాటావారు వారిచేతఁ జిక్కక నర్మదానది దాఁటి తమ దేశమునకు సంపాదించిన ధనమంతయుఁ గొని పోయిరి ఇందులకు బదులుగా మొగలులు శివాజియొక్క కల్యాణ ప్రాంతమును గొల్లకొట్టిరి. (౧౬౭౫)

శివాజికిఁ గొంకణదేశములో నున్న రెండు రాజ్యములకు నడుమ "ఫోండ" అను మొగలుల దుర్గమొకటి యుండెను ఆ దుర్గమును సాధిం చుట యత్యావశ్యక మైనందున మరాటావారు మూఁడు సంవత్సరముల వఱకు దానిని సాధింప యత్నించిరి సూరతు పట్టణములో నున్న ఫ్రేంచువారి యొద్దనుండి యందు కొఱకు శివాజి కొన్ని ఫిరంగులును మందుగుండును గొనెను గాని ఫిరంగిదెబ్బ లక్ష్యమునకు సూటిగాఁ

దగుల నందున గుండ్లు దుర్గముపైఁ బడవయ్యె అప్పుడు శివాజి వ్యయ
ముగా దాడివెడలి దుర్గసమీపమున నున్నదేశము గెలిచి దుర్గమును నలు
దిక్కులఁ జుట్టుకొని యుద్ధము చేసెను దుర్గముయొక్క యొకబురుజుకు
సొరంగముచేసి యందు తుపాకిమందు నింపి విస్ఫోటింపించి
దానిని పడవైచి త్రోవచేసికొని లోపలికిఁ బోయెను మూఁడు సంవత్సర
ముల వఱకును శౌర్యముతోఁ బోరాడి తుదకు విధిలేక దుర్గములోని
వారంద్రు దుర్గమును శత్రుస్వాధీనము చేసిరి ఇట్లు దుర్గమును సాధించి
శత్రురాజ్యమును దోఁచుకొని యపరిమిత ధనముతో శివాజి రాయగడము
చేరెను.(౧౬౭౫)

పన్హాళా దుర్గమునొద్దనున్న తనరాజ్యమునకు విజాపూరివారి వలన
మిగుల నష్టము కలుగుచున్నందున నటుపైపుల శివాజి వర్ధనగడము,
భూషణగడము, సదాశివగడము, మచ్ఛిందరగడము అను నాలుగు దుర్గ
ముల నిర్మించెను. ఈ దుర్గనిర్మాణ సమయమున శివాజికి గొప్ప వ్యాధి
సంభవించెను అనేక మాసములవఱకును శివాజి వ్యాధిగ్రస్తుఁడై సాతారా
దుర్గములోనే యుండెను ఇట్టి వ్యాధిలో నుండిన కాలముననే శివాజి
దక్షిణ దిగ్విజయమునకుఁ గావలసిన సిద్ధతయంతయుఁ జేసెను

శివాజి తండ్రియైన శహాజికి తంజావూరులో జాగీరున్న సంగతి
చదువరులకు జ్ఞాపకముండవచ్చును నారోపంతు హనుమంతే యను
బ్రాహ్మణుఁడు శహాజియొద్ద మంత్రిగా నుండి యాజాగీరు పని చూచు
చుండె అతడు ౧౬౫౩ లో గతింపఁగా నాతని కుమారుఁడైన రఘునాథ
నారాయణ అనువాఁడు మంత్రిత్వమును వహించె ఈతఁడు వైదికలౌకిక
వ్యవహారములందుఁ బ్రవీణుఁడు శహాజి మరణానంతరము ఆతనిద్వితీయ
భార్యపుత్రుఁడైన వెంకాజియను నాతఁడాజాగీరునకు నధిపతియయ్యెను
గాని శివాజివలె నాతని తమ్ముఁడైన వెంకాజి తెలివి తేటలు గలవాఁడు
కానందునను నీచులమాటలు విని ప్రమత్తుఁడై యుండువాఁ డైనందునను

మంత్రియైన రఘునాథ నారాయణునకును నాతనికిని మనస్పర్థ కలిగెను మంత్రి చెప్పిన మంచి యాలోచనలు వినక రాజాతని నవమానపఱచు చున్నందున నవమానమును సహింపలేని బ్రాహ్మణతేజస్సు గల యా మంత్రి రాజుపైఁ బగసాధింప నిశ్చయించెను కాని చుట్టుపట్టున నున్న పాళేగారుల నాశ్రయించి వారిచేఁ దనదొరను భంగపఱిపించినది స్వామి ద్రోహమగు నని యెంచి తనరాజునకు నన్నయైన శివాజిని నాశ్రయించి యాతనిచేఁ దమ్మునికి బుద్ధి చెప్పింపవలయునని నిశ్చయించెను. తన వంటి సరదారుఁడు శివాజివంటి మహారాజును జూడఁబోవునప్పుడు రిక్త హస్తములతో వెళ్ళఁగూడ దని తలఁచి జింజీమొదలైన కొన్ని దుర్గము లుల యధిపతులతో శివాజీకిఁ బోరాటగలుగు కారణంబులఁ గొన్నిటిని యోచించుకొని గోలకొండకుఁ బోయె అప్పుడక్కడ నాంధ్రదేశంబునఁ దమ యుజ్జ్వలకీర్తి శాశ్వతముగా నిలిపినవారును ఇంగ్లీషు, ఫ్రెంచు మొదలయిన పరదేశస్థు లప్పనంబులతోఁ దమ్ము నాశ్రయించు నంత యోగ్యత గలవారును అశ్వినేయులవలె నెల్లప్పుడును దంటగా నామ ముచ్చరింపఁబడు నద్వితీయానుకరణీయులును నన్నదమ్ములును నగు అక్కన్న మాదన్నగార్లు ముఖ్యమంత్రిత్వమును వహించి యుండిరి

గోలకొండ నవాబు ౧౬౭౨ లో గతింపఁగా నాతని యల్లుఁడైన అబూహుసేన్ † అనువాఁడు నవాబయ్యెను. పూర్వవయస్సునం దీతఁడు సత్ప్రవర్తన దప్పినవాఁ డయినను రాజ్యము వచ్చినప్పటినుండియు జన్మాంతర మైత్రినటుల సజ్జనుఁడయ్యెను తనయొద్దనున్న వారి గుణమును పరీక్షించుటయందు నీతఁడు ప్రజ్ఞానిధి యైనందున దుర్మార్గ ప్రవర్తనగల వారిని తొలగించి బుద్ధియందు బృహస్పతిఁబోలిన అక్కన్న మాదన్న గార్లకు మంత్రిత్వమిచ్చె. సాధారణముగా నుభయులపేర్లు వాడుకలో

† ఈతనికే 'తానీషహా' అని నామాంతరము "తానీషా" అని ఆంధ్ర దేశమున వాడుక

షవన్నను మాదన్నవంటివారే ముఖ్యప్రధాని యై యుండె ఆయన మాట "శానీషా" జవదాటఁడయ్యె

తంజాపూరు నుండి బయలుదేఱి గోలకొండకువచ్చి రఘునాథ నారాయణ అను మంత్రిపుంగవుఁడు మాదన్నగారిని చూచి, తన యప్ర తిమ పాండిత్యమును అసమాన రాజ్యతంత్రచాతుర్యమునఁజూపి యాతనిని వశపఱచుకొనియె శివాజియు గోలకొండ నవాబును గలసి దాడివెడలినఁ గర్ణాట ద్రావిడదేశములోని షజాపూరువారి రాజ్య మంతయు సాధింప వచ్చునని యక్కన్నగారికి నమ్మికపుట్టునటులఁ జెప్పి యాతనిచేత నవా బునకుఁ జెప్పించె అందులకు సమ్మతించి నవాబు రఘునాథనారాయణుని తనసభకు రావించి గౌరవించి కర్ణాటముపై శివాజితో దాడివెడలుటకుఁ దన కిష్టమున్నది యని తెలిపెను ఇట్లు రఘునాథనారాయణుఁడు యుద్ధము చేసి రాజ్యము గెలిచెదవు రమ్మని శివాజిని పిలుచుటయే గాక గోలకొండ సైన్యముల నీకు సహాయమిచ్చెద నట్టు మనుచు శివాజి యొద్దకు వచ్చెను. అందులచే నాతని యసామాన్య ప్రజ్ఞకు మెచ్చి శివాజి యాతఁడు రాయ గడమునకు రాఁగానే యాతనికిఁ దన యమాత్యుని పని యిచ్చెను

కర్ణాటద్రావిడ దేశములపై దాడి వెడలుటకుఁ గారణ మెద్దియని వెల్లడిచేయవలయునో యని యాలోచింపఁగా తండ్రి యైన శహాజి యొక్క జాగీ రంతయునాతని ద్వితీయపుత్రుఁడగు వెంకాజి యనుభ వించుచున్నాఁ డనియు జ్యేష్ఠపుత్రుఁడైన శివాజికి నేమియు నిచ్చుట లేదనియు నందులకు శివాజి తన సగముభాగము తమ్ముని యొద్దనుండి తీసికొనుటకుఁ దంజావూరుకుఁ బోవుచున్నాఁడను మిషపెట్టుకొని దాడికిఁ బయలుదేఱవచ్చు ననియు నిర్ణయించిరి

తాను దూరదేశమునకుఁ బోయినప్పుడు మొగలులు తన రాజ్యము మీఁదికి యుద్ధమునకు వచ్చెద రేమో యని తలఁచి శివాజి మొగలసేనాధి పతిని వశపఱచుకొని తాను ఢిల్లీశ్వరునికి సామంతుఁడుగా నుండుదుననియుఁ

కొంత కప్పము కట్టెద ననియు వర్తమాన మాతవిద్వారా ఔరంగజేబున కంపి మొగలులతోఁ గొంత స్నేహభావము కుదుర్చుకొనెను జింజిరాకు నధిపతి యైన సిద్దీవాఁడు తన కొంకణ ప్రాంతముకు బాధ కలుగచేయ కుండ నక్కడ నొక గొప్ప సైన్యముంచెను ఢిల్లీకిఁ బయన మయినప్పుడు చేసినటుల నిప్పుడును రాజ్యమంతయు ముఖ్యప్రధానియైన మోరోపంతు పింగళేగారి స్వాధీనము చేసెను

ఇట్లు స్వరాజ్య సంరక్షణమునకుఁ గావలసిన కట్టుదిట్టములన్నియు తేర్పఱచి ముప్పదివేల యశ్వసైనికులను, నేఁబదివేల కాల్బలములను దీసికొని దాడివెడలెను తాను వచ్చుచున్న సమాచారము గోలకొండ నవాబయిన తానీషాకుఁ దెల్పుటకై చారులఁబంపెను గోలకొండ రాజ్యము లోని ప్రజలకు నేమాత్రము బాధ కలుగఁజేయఁగూడ దనియు సైనికులకుఁ గావలసిన వస్తువులన్నియు డబ్బు పెట్టి కొనవలసిన దనియు నాజ్ఞాపించెను గోలకొండ సమీపమునకు రాఁగానె మాదన్నగారెదురుగా వచ్చి శివాజిని తీసికొనిపోయి నవాబుదర్శనము చేయించిరి నవాబునకును శివాజికిని మైత్రిగలిగి శివాజి నెలరోజుల వఱకును గోలకొండలోనే యుండెను, ఢిల్లీపతియు విజాపురు నవాబునుగూడి మనల నిద్దఱను నాశము చేయ యత్నించుచున్నారని యు, మనమిద్దఱముసఖ్యముతో నుండి స్వసంరక్షణము చేసికొనవలయు ననియు శివాజి నవాబునకుఁ జెప్పఁగా వారిద్దఱకు నిట్లు ఒడంబడికలు జరగెను ద్రావిడ కర్ణాటకదేశ యుద్ధమునకై శివాజి తన సొంతసైన్యమును నవాబుయొక్క ఫిరంగులను దీసికొని పోవలయును మొగలులు గోలుకొండమీఁదికిఁ గాని శివాజిరాజ్యము మీఁదికిఁగాని దండెత్తి వచ్చినయెడల వారిని నవాబు ఎదిరింపవలయును. క్రొత్తగా శివాజి సంపాదించు రాజ్యములో సగభాగము గోలకొండ నవాబునకు నియ్యవలయును వీలయినప్పుడు విజాపురము తురక దివానును తొలఁగించి అక్కన్నగారికి ఆ దివానిగిరి యిప్పింపవలయును ఇట్లొడంబడిక తేర్పఱచుకొని శివాజి కర్ణాట ద్రావిడదేశములపై దండు వెడలెను (౧౬౭౭ మార్చి)

గోలకొండ బయలుదేఱి కడప కర్నూల్ మొదలయిన ప్రదేశములలో నప్పనంబులు గొనుచు నివృత్తి సంగమక్షేత్రమున స్నానముచేసి తన సైన్యముల నన్నింటిని జింజిమార్గమున తిన్నతిన్నఁగా బోవుచుండుమని యాజ్ఞాపించి తాను కొలఁది సేవకుల వెంటఁదీసికొని శ్రీశైలమునకుఁబోయి మల్లిఖార్జుని సేవించెను ఆ రమ్యమైన పర్వతప్రదేశములను జూచి యచ్చటనే జన్మమంతయు నుండి తపస్సు చేసికొనవలయు నని శివాజికిఁ దలంపు గలిగెను అచ్చటి భవానీదేవికిఁ దనశిరఃకమలము సమర్పించి ముక్తిని జెందవలయు నని నిశ్చయించె నఁట। కాని, శరీరమందు దేవి ప్రవేశించి నీవీపని చేయవలదు నీవు చేయివలసిన కార్యము లనేకము లున్నవి. నీవు యుద్ధమునకు వెళ్ళుము అని యాజ్ఞాపించె నఁట। అతఁ డచ్చటినుండి బయలుదేఱి చెన్నపట్టణము మీఁదుగా జింజీకిఁబోయి యాదుర్గము సాధించి యచ్చట రాయజీనలగె అను నొక హవాలుదారుగా నేర్పఱచెను. తరువాత ఆ ప్రాంతములోని దుర్గములు గోటలు, రాజాలు మొదలయిన వన్నియు గెలిచి యచ్చటఁ దన సుబేదారునుంచె మహారాష్ట్రదేశము నందలి దుర్గములను గాపాడుటకుఁ జేసిన నియమముల నిచ్చటి దుర్గముల రక్షణార్థమై యేర్పఱచెను తనదేశములోని జమాబంధి పద్ధతుల ననుసరించియే క్రొత్త రాజ్యములోని భూమి యమరకము గుఱించి కట్టుదిట్టము లేర్పఱచెను

ద్రావిడదేశములోని తమ రాజ్యము మరాటావారి చేతిలోఁ బడుచున్నదని చూచి విజాపూరువారు గొప్పసైన్యమును శివాజిమీదికిఁ బంపిరి. శివాజి యాసైన్యమును వోడించి సైన్యాధిపతిని ననేక ధనధాన్య వస్తువాహనములతోఁ జెఱఁబట్టెను. శివాజి వెంటనున్న నరహరిబల్లాలుఁ డను నొక సేనాని వేలూరు పట్టణమును ముట్టడించి, సమీపమం దున్న రెండు గుట్టలమీఁదికి ఫిరంగుల నెక్కించి యచ్చటినుండి పట్టణము మీఁదికి నగ్నిగోళములఁ జల్లుచుఁ గొన్నిరోజులకుఁ బట్టణంబును సాధించెను

శివాజి తండ్రియగు శహాజీకి దాసీపుత్రుఁడగు సంతాజి రాఁగా నాతని గౌరవించి యాతనియందుఁ దనతండ్రి గుణంబు లనేకము లున్న

వని చూచి శివాజీ యాతని జింజీకి నధికారిగా నియమించెను తరువాత శివాజీ తన సాపత్న్యసోదరుఁడైన వెంకోజీకి నిట్లు వర్తమాన మంపెను. "మన తండ్రిగారు గతించి పదుమూఁడు సంవత్సరములు అయినవి పూర్వార్జిత మైన తంజావూరు మొదలయిన జాగీర్లను సగలు నా హెములను నీవె యనుభవించుచున్నావు. మా సగపాలు మాకియ్యవయితివి. ప్రస్తుతము మే మిటువైపులకు వచ్చియున్నాము గాన మా భాగముమాకియ్యవలసినది తిరువేదీయొద్ద వచ్చి మమ్మును గలిసికొన వలసినది "

శివాజీ తన రాజ్యములోని సగభాగము తీసికొనుటకు వచ్చినాఁడని వెంకాజీకిని నిదివఱకే తెలిసినందున నాతఁడు యుద్ధమునకు సిద్ధముగా నుండెను గాని యాతనికి సహాయముగా వచ్చెదమనిన పాళెగారులు కొందఱు శివాజీకి లోఁబడి నందున వెంకోజీ యన్నను జూడఁబోవలసిన వాఁడయ్యెను. వచ్చిన తనతమ్ముని శివాజీ గౌరవించి కొన్నిరోజులు తనయొద్ద నుంచుకొనెను వెంకోజీ పైకి నమ్రభావమును జూపినను భాగమిచ్చుటకు సమ్మతింపఁడయ్యె. తమ్ముని జెఱఁబెట్టి యర్థరాజ్యము తీసికొనవలయునని శివాజీ యోజించెను కాని తాను పిలువఁగా నమ్మి వచ్చినవానిని మోసపుచ్చఁగూడ దని తలఁపు అతనిని బోనిచ్చెను. పోయినపిదప నొకదూతను నాతనియొద్దికిఁ బంపి గృహకల్లోలము పెంచినందున లాభములేదు గాన ధర్మమును స్మరించి పితృధనము యొక్క యఱపాలు మాకిమ్ము ఈచిన్నిజాగీరు నారాజ్యములో నూఱవ వంతయినను లేదు అయినను పూర్వార్జితమునైన భూమిని బోఁగొట్టు కొనుట తెలివిమాలినతనము అవఁబడును" అని వార్త పంపెను కాని వెంకోజీ యందులకు సమ్మతింపఁడయ్యె త్రివేదీనుండి శివాజీ వేలూరు మీఁదుగా మహారాజగడము కర్ణాటకగడము అనుమార్గముల మీఁదెక్కి పోయి వానిని సాధించి కొలార్ బాలాపురము మొదలయిన ప్రాంతముల లోని పాళెగారులను వశపఱచుకొని ఆర్నీకి వెళ్లెను. వేదోభాస్కర్ అను

బ్రాహ్మణ సరదారుఁ దచ్చుటిదుర్గమునకు అధిపతిగా నుండెను. ఈతఁడు మిక్కిలి తెలివితేటలుగలవాఁడు. శివాజి తండ్రియగు శహాజినే యీ సర దారుఁ దచ్చుట విలుపఁబడియె ఆతఁడు శివాజికి శత్రువుగా నాతని వధికార మాతనికే యుంపఁబడియె ఆతని సిద్ధులకుమారులకు శివాజి తనయొద్ద నుద్యోగముల నిచ్చె ఇట్లు శివాజితనతండ్రియైన శహాజిచే సంపాదింపఁబడిన జాగీరులోని కొలార్ బసీపకోట, బెంగుళూరు, బాలా పురము సేర, మొదలయినప్రాంతములను గెలిచి విజాపూరువారి రాజ్య ములోనప్పనంబులగై కొనుచుఁ గరభారమియ్యని గ్రామములను గాల్పఁబే ల్పదొడంగె (౧౬౭౭ డిశంబరు)

శివాజీ యటుకర్ణాటదేశమునకు వెళ్ళినాఁడని చూచియిదియె సమయ మని యెంచి మొగలులను విజాపూరువారును గూడి గోలకొండ మీఁది దండువెడలిరి ముంది ట్లగునని దీర్ఘాలోచనఁజేసి గనుగొనినవాఁడగుటచే మాదన్నగారదివఱకే శత్రువులను నెదిరించుటకు సిద్ధముగా నుండిరి. అందుచే శత్రువులకు వస్తుసామగ్రిచేరకకుండఁ జేసి యెన్నియోబాధలు పెట్టి శత్రువులను బాఱఁగొట్టిరి.

విజాపుర సైన్యములోని కొందఱు సైనికులకు ముట్టవలసిన జీతము ముట్టనందున వాండ్రు అలిగి మొరోపంత్ పింగళేయొద్దకువచ్చి మరాటా వారిసైన్యములో జీతమున కుండిరి.

గోలకొండమీఁదికి మొగలులుదండెత్తివచ్చినా రన్న వృత్తాంతము విని శివాజి ద్రావిడదేశమునుండి బయలుదేఱ నిశ్చయించె క్రొత్తగా సంపాదించిన జింజిరాజ్య మంతయుఁదనకుమ్మఁడయిన సంతాజి (శహాజి దాసీపుత్రుఁడు) కిని రఘునాథ నారాయణునకిని నప్పగించి వానికి సహాయ ముగా గొప్ప సైన్యముతో హంబీరరావును బ్రాంత మంతయు శాంతి నొందువఱకు నిల్పి మిగిలిన సైన్యముతోఁ దాను స్వదేశమునకు రాఁ జొచ్చెను. బిల్లారిలో మఱియా ఈడేసాహిబ్ అను దేశముఖి శివాజితో

ఘోరముగాఁ బోరాడి యిరువదియేడు దినములవఱకును దుర్గములోనికి మరాటావారిని రానియ్యఁడయ్యెః తుదకు మరాటావారు దుర్గమును సాధించిరి. తరువాత కోపల్ బహదుర్ వెండా అను పట్టణముల గెలిచిరి. ఈ ప్రాంతముల కన్నిటికిని జనార్దనపంత్ అనువానిని నధిపునిగా నేర్పఱచి శివాజి తురగళ పట్టణములో విడిసియుండఁగా గర్ణాటక ద్రవిడదేశముల లోని తన సైన్యాధిపతులతోఁ దనదమ్ముఁడైన వెంకోజి యుద్ధముచేసి పరాజితుఁ డయ్యె ననినవార్త శివాజికిఁ దెలిపె. అప్పు డాతఁడు తన తమ్మున కిట్లు వార్తపంపెను. "మీరు మాకు పితృధనములోని పాలియ్య నందున మీ రాజ్యములోని కొంత భాగము మేము గెలువవలసివచ్చెను. మీరుమాసైనికులతోఁ బోరాడితిరి గనుక మా సైనికులును మీతోఁ బోరాడవలసిన వారైరి మీరు దుష్టులమాటలు విని సన్మార్గమును వదిలి దుర్మార్గమునఁ బోవుట మంచిదికాదు మీకును మాకును జరగిన యుద్ధములోఁ బడిన తురకలను గుఱించి నాకేమియుఁ జింతలేదు. కాని ప్రాతాపజీరాజా భీమాజీరాజా శివాజీపంత్ డబీర్ మొదలయిన మా శూర మరాటావీరులు పడినందులకు మేమెంతయుఁ జింతిల్లుచున్నాము ఇట్లు చేయక మీరు మేము కలసి మెలసియుండినసుభయులకు క్షేమమే. మేము చెప్పినటుల మీరు విని కర్ణాటకములోని రాజ్యమంతయు మాకిచ్చివేసిన యెడల మరల వింతరాజ్యము మీకు పన్హాళాయొద్ద నివ్వగలవారము మీ కిష్టమున్న యెడలఁ గుతుపుశాహి (గోలకొండ) రాజ్యములో మూడు లక్షల హోనుల రాజ్యమిప్పింపఁగలముః" ఈ వార్త యందిన తరువాత వెంకోజి తెలివితెచ్చుకొని తా నపరాధము చేసినను సమర్థుఁ డయ్యును దనయన్న తన్ను నన్యాయముచేయక కొంతరాజ్య మిచ్చెద నని యను చున్నందులకు సంతసించి, సంధిచేసికొనుట కిదియే మంచిసమయమని తలఁచి రఘునాధనారాయణుని ద్వారా తంజావూరును శహాజి జాగీరును దనస్వాధీనములోనే యుండునట్లును దాను బ్రతిసంవత్సరము శివాజికిఁజాగీ

## పదమూఁడవ ప్రకరణము

రులో వచ్చు నాదాయములో సగమిచ్చునట్లును శహాజీ సంపాదించి, రూపకమయిన యీ యాస్తియంతయు నుభయులు పంచుకొను నట్లును నొప్పుకొని శివాజీతో సంధిచేసికొనెను.

విజాపూరు సైన్యము శివాజీరాజ్యములోని భాగమైన పన్హాళాప్రాంతమునకుఁ జొచ్చి గ్రామములను గొల్లఁగొట్టెను. ఈవార్తను స్వదేశమునకుఁ దిరిగివచ్చుచున్న శివాజీకిఁ దెలియఁగా నాతఁడు సిరోశికాటకర్ అను నాతనికి సైన్యమిచ్చి శత్రువుల మీఁదికిఁ బంపెను. వాఁడు శత్రువుల నోడించి వారు దోఁచుకొని పోవుచున్న ధన మంతయుఁ దెచ్చి శివాజీకి సమర్పించెను. శివాజీ యాధనమెవ్వరిది యైనది గనుఁగొని యెవ్వరిధనము వారికి నిప్పించి తన న్యాయప్రియత్వమును వెల్లడి పఱిచెను.

బల్లారి ప్రాంతమునకు జనార్దనపంత్ అను వానిని నధికారిగా నేర్పఱచినట్టు వెనుక వ్రాసియున్నాము. ఆ జనార్దనపంతులు మీఁదికి విజాపురసరిదారు లిద్దఱు దండెత్తివచ్చుచున్నారని శివాజీకిఁ దెలిసినందున తన సేనలోఁ గొంతభాగము జనార్దనుని సాయమునకుఁ బంపెను. మిగిలిన సైన్యములతోఁ దాను బయలుదేఱిన పదునెనిమిదినెలలకుఁ దిరిగి రాయగడముఁ జేరెను. అటు జనార్దనపంతును హంబీరరావును గూడి విజాపూరు సరదారుల గీటడంచి వారిని జెఱఁబట్టిరి. మరాటావారికి నైదునూర్ల గుఱ్ఱంబులు నైదు ఏనుఁగులును దొఱకెను. తరువాత జనార్దనపంతు చుట్టుపట్టున నున్న పాళెగారుల నందఱను గెలిచి శివాజీ సామంతుల మని వారిచే నొప్పించెను. మరాటావారిని నెదిరించు శక్తిలేక విజాపూరువారూరకుండిరి

శివాజీ దక్షిణదిగ్విజయము చేసి రాఁగానే మాదన్నగారు రాయగడమునకుఁ జారులద్వారా వస్త్రభూషణ రత్నమాణిక్యాదులు కానుకలంపిరి.

తాను క్రొత్తగా సంపాదించురాజ్యములో సగపాలు గోలకొండ నవాబున కిచ్చెద నని శివాజి సంధిచేయు నప్పుడొప్పుకొనె నని చదువరు లకు జ్ఞాపక ముండవచ్చును. శివాజి కర్ణాటదేశములో సంపాదించిన క్రొత్తరాజ్యములోని యర్ధభాగము ఆ సంధి ననుసరించి గోలకొండనవాబు కిచ్చినటులఁ గానరాదు. ఇందులకుఁ గారణమేమో తెలియదు. మఱి యే విధముననో నవాబును మాదన్నగారిని సమాధానపఱిచి యుండును అట్లు సమాధానపఱుపనియెడల నవాబును మాదన్నగారును శివాజితో నాతని మరణమువఱకును సఖ్యముతో నుండుట సంభవింపదు. ఈ సంగతి యాలోచింపక యింగ్లీషు చరిత్రకారులు శివాజి నవాబును నన్యాయముగా మోసపుచ్చెనని వ్రాసియున్నారు కాని వారివ్రాఁత లెంత మాత్రము నమ్మఁదగినవి కావు.

# పదునాలుగవ ప్రకరణము

## అస్తమయము

ఔరంగజేబు విజాపురమువారితో మైత్రి చేసిచేసి తుదకు వారి రాజ్యమును నపహరింపవలయు ననిన దుర్బుద్ధి కలవాఁడై శత్రుభావమును వహించి దిలేర్ ఖానుఁడను సైన్యాధిపతిని విజాపురము మీఁదికిఁ బంపెను. విజాపురరాజ్యమునకు మంత్రియైన మసావుద్‌ఖానునకు ఈ వృత్తాంతము తెలిసినందున నేమియుఁ జేయుటకుఁ దోఁపక యాతఁడు శివాజియొద్దకు దూతను బంపి సహాయము వేఁడెను అందులకు శివాజీ ఇట్లు ప్రత్యుత్తర మంపెను. "మేము మొగలులతో ప్రత్యేకముగాఁ బోరాడిగాని లేక వారిరాజ్యములో గ్రామాదులను కొల్లకొట్టిగాని వారు మీతో యుద్ధముచేయుట మాని తిరిగి వచ్చునటులఁ జేసి మీకు సహాయము చేయుదుము మీరు భయపడవలదు"

వెంటనే శివాజీ పన్హాళా యొద్ద గొప్ప సైన్యమును గూర్చుకొని విజాపురమునకుఁ బయలుదేరెను. గాని కొంత దూరము పోయిన తరువాత మొగలుల ప్రచండసైన్యముతోఁ దన చిన్నసైన్యము నిలిచి పోరాడఁజాలదని తలఁచి దౌలతాబాద్ జాల్నా మొదలయిన గ్రామాదులను దోఁచుకొనఁ బోయిన మొగలులు విజాపూరు ముట్టడి విడిచి స్వరాజ్యరక్షణార్థమై వచ్చెద రని యెంచి శివాజి యటు తిరిగెను భీమానది దాఁటి గోదావరినదిపఱకు మొగలులరాజ్య మంతయుఁగొల్లగొట్టసాగెను ఈ వార్త మొగలుల సేనాధిపతి యగు దిలేరుఖానునకుఁ దెలిసినను వాఁడు విజాపూర్ ముట్టడి విడిచి రాఁడయ్యె. అందుపై శివాజి గోదావరినది దాఁటి జాల్నాకుఁబోయి యాపట్టణసమీపమందున్న ఔరంగబాద్‌లో బాదుషా కొమారుఁ డగు మొఅజిం ఉన్నప్పటికి భయము

లేక యీ పట్టణమును మూడు దినములవఱకును దోఁచుకొనెను. పట్టణములోని ధనము గల స్థలము లన్నియుఁ ద్రవ్వించి యపార సంపత్తిని బడసెను ఆ ధనమంతయుఁ దీసికొని పోవుచుండగఁ మొఅజిం పది వేల సైన్యమును మరాటావారిమీఁదికిఁ బంపెను సంగమనేర్ వద్ద నుభయ సైన్యములకు ఘోరయుద్ధంబు జరిగె సంతాజీ ఘోరపడె అను సేనాని తొందరపడి మొగలుల మీఁదికి నగాలమునసె పోయినందున పరాజితుఁడై వెనుకకు రావలసిన వాఁడాయెను తన సైన్యములు వెనుకకు వచ్చుట చూచి శివాజీ "యోపకుఁడి ఓడకుఁడీ" అని పలుకుచు తనయొద్దనున్న సైనికులను వెంటఁ దీసికొని వెనుక నుండి ముందువచ్చి మోఅజీం వచ్చుచున్న కనుమయొక్క ద్వారము నొద్ద గొప్ప సైన్యముతో వేచి యుండెను శత్రుసైన్య మెచ్చుటఁ జూచినను చిన్న చిన్న గుంపులు గుంపులు కూడి యధికముగాఁ జొచ్చెను, ఇఁక శత్రువుల చేతినుండి తప్పించుకొనుట యెటులనని శివాజీ విచారించుచుండఁగా నా పర్వత ప్రదేశములు బాగుగ నెఱింగిన యొక మార్గదర్శి మరాటా సైన్యమును మాఱు త్రోవం దీసికొనిపోయి శత్రువులకుఁ దెలియకుండ పటాయను దుర్గమునకుఁ జేర్చెను చేతఁ జిక్కిన పులి దప్పించుకొనిపోయెనుగదా యని హతాశులై మొగలులు ఔరంగబాదుకు మరలి పోయిరి. అంత శివాజీ మోరోపంతు పేషవాను బిలిపించి పటాసమీ మున నున్న యితర దుర్గములను సాధింపుమని చెప్పఁగా నాతఁడు పిరువదియాఱు క్రొత్తదుర్గములను సంపాదించెను.

శివాజీ పటా దుర్గముమీఁద నుండఁగా విజాపూర్ మంత్రియగు ముసాహిద్ ఖానుని యొద్దినుండి ఇట్లు వతన్ మానము వచ్చెను "మా పట్టణ మిఁకను దిలేరుఖానుఁడు ముట్టడించి యున్నాఁడు. పంతము వేసికొని ముట్టడి లేపఁడయ్యె ఇప్పుడు మీ రన్యవిచారము చేయక వచ్చి మమ్ముఁ గాపాడవలయును" ఈ వార్తయందినతోడనే శివాజీ విజాపురమునకు బయలుదేఱెను. కాని త్రోవలో నాతనికిఁ దనకుమారుఁడైన సంభాజి పాఱిపోయి మొగలుల సైన్యములోనికి వెళ్ళి దిలేర్ ఖానుని

నాశ్రయించి యున్నాఁడనిన దుఃఖవార్తన్ తెలిసినందున నాతఁడు సైన్య మిచ్చి హంబీరరావును విజారపుమునకు బంపి తాను పన్హాళాదుర్గమునకుఁ బోయెను

శివాజికి యిద్దఱుభార్యలవలన యిద్దఱు పుత్రులుపుట్టిరి. పెద్దభార్య యగు సయీబాయివలన సంభాజీ, చిన్నభార్యయగుసోయెరాబాయి వలన రాజారాము వీరిద్దఱు తాను స్థాపించిన మహారాష్ట్రరాజ్యమునుగాపాడి గోబ్రాహ్మణసంరక్షణమునేసి హిందూమతమును స్థాపింపవలయు నసిన యిచ్ఛగలవాఁడై శివాజి తనకుమారులకు సద్విద్యగఱప యత్నించెను. వ్రాఁతయుఁ జదువును, మల్లవిద్యయు నశ్వారోహణంబును, బాణ సంధానప్రకారంబులును శస్త్రయుద్ధంబును వారికి నేర్పెను ఉత్తమవృద్ధ సేవకులయొక్కయు, శ్రేష్ఠపండితులయొక్కయు సహవాసములో వారిని నుంచెను సజ్జనసహవాసమే చేయవలయును నీచులను దుష్టులను దుర్వ్య సనము గలవారిని నొద్దఁచేరనియ్యఁ గూడదు వాండ్రవలనఁ గులమును రాజ్యంబును నాశముఁ జెందునని బోధించుచు రావణ దుర్యోధనాది తుల కథలను గుమారులకుఁ జెప్పుచుండెను. వారికి వ్యవహారము తెలియవలయు నని వారినిఁ దనవెంటఁ బేరోలగమునకుఁ దీసికొనిపోవు చుండెను కాని ఈపరిశ్రమయంతయు పెద్దకుమారుఁడైన సంభాజియందు నిరర్థకం బయ్యె ఈ రాజపుత్రుఁడు పుట్టినప్పటినుండియు క్రూరుఁడు మూర్ఖుఁడును నయియుండె. ఈతఁడు రెండుసంవత్సరములవయస్సుగల వాఁడై యున్నప్పుడీతనితల్లి ౧౬౫౯ లో మృతి జెందినందునఁ జిన్న నాఁటినుండియు నౌకరియాజ్ఞలో నుండక తనకుఁదండ్రినిగూడ నతిక్ర మింపఁ జొచ్చె ఒకనాఁడు రాజభవనమందు పేరంటమునకు ననేకస్త్రీలు రాఁగా సంభాజీ యొక బ్రాహ్మణవనితను బలాత్కారముగా స్పర్శించెను. బ్రాహ్మణులను దేవతలవలెను, పరస్త్రీని తల్లివలెను జూచునట్టి శివాజికి ఈ వార్త తెలియఁగా నాతడు మిక్కిలి కోపగించి "పూర్వజన్మమున నేమి పాపము చేసినందుననో యిట్టిపుత్రుఁడు గలిగెను. పుత్రుఁడైననేమి కఠినముగా శిక్షించెద"నని పలికెను

తండ్రి తన్నుఁ గఠినముగా శిక్షించు ననియెంచి సంభాజి - యందఱు సిపాయిలను వెంటఁ దీసికొని మొగలుల సైన్యాధిపతియైన దిలేరుఖానుని యొద్దకు వెడలిపోయెను. తమశత్రువైన శివాజియొక్క కుమారుఁడు తండ్రితోఁ బోరాడి తనయొద్దకు వచ్చినందులకు దిలేరుఖాన్ సంతసించి సంభాజిని గౌరవించి యాతనికి గొప్పవేతన మేర్పఱచి తనయొద్ద నుంచుకొనెను. సంభాజిని మరాటావారికి రాజుగా నేర్పఱచి మరాటా వారిలో వారికి నంతఃకలహములు కలుగునటులఁ జేసి శివాజి నోడింపవలయు నని యా దిలేర్‌ఖాను తలఁచి సంభాజికి మరాటావారి రాజని పేరుఁబెట్టి కొంతసైన్యమిచ్చి సంభాజిని మరాటావారిదుర్గమగు భూపాలగడము గెల్చుటకుఁబంపి యీ వార్త ఔరంగజేబునకుఁ దెలిపెను. సంభాజి భూపాలగడమును ముట్టడించి యుద్ధము చేయసాగెను పోరాటకువచ్చిన సంభాజి తమరాజునకుఁ బెద్దకొడుకై నందున నాతనితోఁ బోరాడియాతని నొప్పించిన శివాజికి నేమి కోపము వచ్చునోయని తలఁచి దుర్గముమీఁది వారు దుర్గమును విడిచిపెళ్ళిరి రెండవదినము సంభాజి దుర్గముమీఁదికి నెక్కి యక్కడ నున్న కొలఁదిజనంబులఁబట్టి కొందఱికాళ్ళును గొందఱి చేతులను నఱికించెను ఇట్లు దుర్గము స్వాధీన మైన తరువాతఁగూడఁదన క్రూరత్వమునుజూపి సంభాజి దిలేరుఖానుని యొద్దకుఁ బోయెను అటు శివాజి పన్హాళాగడము చేరి యొకదూతను దన పుత్రునియొద్దకుఁబంపి యిట్లు చెప్పించెను. నేను జన్మమంతయుఁ గష్టపడి సంపాదించిన రాజ్యమంతయు మీ కొఱకుఁ గాక మఱి యెవరికొఱకు? మాకు దిన దినము వార్ధక్యము వచ్చు చున్నది. ఈ రాజ్య మంతయుఁ బాలించు భారము మీఁది. అటులఁ జేయక శత్రువులలోఁ గలసి మనరాజ్యము శత్రువుల కియ్యవచ్చునా? మొగలులను విడిచివచ్చినయెడల మీ ఖర్చు నిమిత్తము మీ రడిగిన తాలూకా యియ్యగలము."

అటు విజాపురమువారికి సహాయముచేయుటకు హంబీరరావు వెళ్లుచుండఁగా నాతనిని మొగలసరదారుఁ డగు రణమస్తఖాన్ తొమ్మిదివేల గుఱ్ఱపురౌతులతో నెదిరించెను మరాటా వారిచేఁ బరాభూతులై మొగ

లున నలుదిక్కులకుఁ బాఱిరి అంత హంబీరరావు దిలేర్‌ఖానుని సైన్యమునకు నెప్పటికంటెయు వస్తుసామగ్రి చేరకుండఁ జేసెను. అందుచే మొగలాయి శిబిరములో రూపాయికి నరసేరు ధాన్య మైనను దొరకకపోయెను. గుఱ్ఱములు ఏనుగులు మేఁతలేక చావఁజొచ్చెను. అయినను దిలేర్‌ఖానుఁడు ముట్టడిలేవఁడయ్యె. తుదకు ధాన్యపుగింజ యొకటియు లేనితెలిసి దిలేర్‌ఖానుఁడు ముట్టడిలేచి దేశము దోఁచుకొనుటకుఁ గర్ణాటకమునకు వెళ్లెను. కాని కర్ణాటకములో శివాజి యుంచివచ్చిన జనార్దన్‌పంతు దిలేర్‌ఖానుని పరాభవింపఁగా నాతఁడు తన నివాసస్థలమునకుఁ బోవలసినవాఁడాయెను (౧౬౭౯)

మరాఠావారికి దక్షిణమున నెక్కుడుఁజూపిన నక్కడ జయము కలిగినటుల నుత్తరమునను గలిగెను ఖాందేశములో మోరోపంతు పేష్వా అనేకదుర్గములను సాధించెను

తండ్రిచేఁ బంపఁబడిన చారుఁడు చెప్పిన మాటవలన బుద్ధితెచ్చుకొని సంభాజి మొగలాయి శిబిరమునుండి గుప్తముగా వెడలి తండ్రి యొద్దకు వచ్చెను వచ్చిన కుమారునకు శివాజి యెన్నియో బుద్ధులుచెప్పి యాతని నెక్కడికిఁ బోనియ్యకుండ పన్హాళాదుర్గముపై భద్రముగా నుంచి తాను రాయగడమునకు వెళ్లెను (౧౬౭౯)

మొగలులు బిజాపురము ముట్టడించినప్పుడు శివాజి చేసిన సహాయ్యమునకై మసాఊద్‌ఖాను శివాజి కోసల ప్రాంతమును బళ్లారి ప్రాంతమును ఇచ్చివేసెను మఱియు ద్రవిడదేశములోని తంజావూరు ప్రాంతమునకును శివాజి సంపాదించిన జాగీరునకును స్వామిత్వము శివాజికి నిచ్చెను శివాజీని బిజాపురమువారికిని సంధియు గొప్పసఖ్యము జరిగి శివాజి బిజాపురమునకు వెళ్లి నప్పుడు మసావుద్‌ఖాను స్వయముగా నెదురువచ్చి మెంతయు గౌరవించెను (౧౬౮౦)

తంజావూరు ప్రాంతముయొక్క స్వామిత్వము శివాజికిఁ గలిగినందున నాతని తమ్ముఁడగు తంజావూరురాజగు వెంకోజీ శివాజికి

తరువాత మా రాజ్య మెవ్వరు రక్షింపఁగలరు? పెద్దకుమారుఁడు దుష్టుఁడు, రెండవకుమారుఁడు చిన్నవాఁడు. మేము పోయినతరువాత విజాపురము జింజి మొదలయిన నవాబులు తల లెత్తగలరు. ఔరంగజేబు దక్షిణము నందలి రాజ్యము లన్నియు గెలుచుటకు యత్నించును. అయినను ముందు జరుగఁబోవునంతకు ఇప్పుడు చింతించిన నేమి ఫలము? ఇన్నిరోజులు రక్షించినభవాని యికముందు రక్షింపఁగలదు. మీ రందఱు నేకభావముతో నుండి స్వరాజ్యమును స్వధర్మమును రక్షించుఁడి. శ్రీభవాని మీకు జయము గలుగఁజేయును" ఇట్లు చెప్పి పరాక్రమతేజో రాశియగు శివభూపాలుఁడు ఆ నామము అయిన ఏప్రిల్ [illegible] తేదీని రెండు జాములకు అస్తమించెను.

పృథ్వీతలమందు జన్మించి ప్రతిభాపరాక్రమశాలు లని పేరొంది కీర్తిశేషులయిన మహాపురుషులలో శివాజి యొక్కఁడని చెప్పుటకు సందేహము లేదు. అత్యంత హీనదశయందుండిన మావళీలను మరాటావారికి శౌర్యధైర్యంబులు పుట్టించి వారి సాహాయ్యంబున మహారాష్ట్రరాజ్యంబను క్రొత్తరాజ్యంబు నిర్మించె. ఇటు విజాపుర గోలకొండ నవాబులను అటు ఢిల్లీశ్వరుండైన ఔరంగజేబును (దయ్యంబులవలె) నదపఱ కున్న హిందూరాజ్యంబులనే మ్రింగవలయు నని యత్నించుచుండ వారిని ముసరి నడుమనే క్రొత్తరాజ్యంబు నిర్మించె. తన సైన్యంబు లోడిపోవఁగాఁ జూచి తాను స్వయముగా ముందువచ్చి వారెల్ల వారికి ధైర్య మిచ్చి అపజయమును జయముగా మార్చె. తన బలంబును నెదుటిబలంబును జూచి తగురీతిగా మెలఁగుటయందు ధీనిధి యనిపించుకొనియె. ఎంత గొప్పయాపద వచ్చినను సధైర్యవదక దానిని మించినయుక్తిని విచారించితప్పించుకొనియె. దేశము నడుపుటయందును వ్యూహము పన్నుటయందును శత్రువులను మోసపుచ్చుటయందును జయము ప్రాప్తించినప్పుడు శత్రువులను దఱుముటయందును పరాభవము కలిగినప్పుడు తన సైన్యమున కధికనష్టము లేకుండఁ దొలఁగించి తీసికొనిపోవుటయందును సమానప్రజ్ఞ కలవాఁడని ఖ్యాతివహించె. అట్టి శివాజి యద్వితీయశూరరత్నం బనుటకు సందియంబు లేదు

శివాజియొక్క మరణవార్త వినఁగానే యాతని జన్మ శత్రువైన ఔరంగజేబు విలపించెనఁట. "శివాజి గొప్పసేనానాయకుఁ డనుటకు సందేహములేదు. మేము దక్షిణములో రాజ్యములన్నియు ముంచుచుండఁగా నాతం డొక్కఁడుమాత్ర మసామాన్యసాహసంబుఁ జూపి క్రొత్తరాజ్యంబును స్థాపించెను నేఁటికిఁ బందొమ్మిది సంవత్సరముల నుండి మాసైన్యము లాతనితోఁ బోరాడుచుండినను నాతనిరాజ్యము దినదిన మభివృద్ధియే యగుచున్నది."

అలెగ్జాండరు, సీజరు, నెపోలియన్ మొదలైన సేనానాయకుల కంటె శివాజి యధికుఁడని చెప్పుటకు సందేహములేదు. అలెగ్జాండరు మొదలయినవారు శివాజికంటె నధికసైన్యములను నడపిరి అధికప్రదేశములను జయించిరి. కాని వారంద్రసేనానాయకత్వము వహించుటకు దేశములను జయించుటకుఁ గావలసిన సాధనము లన్నియు సిద్ధముగా నమర్చియుండెను శివాజియో క్రొత్తగా సన్నిసాధనములను సమకూర్చుకొని యుద్ధమునకుఁ బయలుదేఱెను కూటికి గుడ్డకు లేనిమావళి లాతని సైనికులు, మహారాష్ట్రుల స్వాతంత్ర్య మడిపెఱకు నేఁడో వందల సంవత్సరముల క్రిందట నడుగంటి తురకలసేవ చేయుటకొఱకే తమ్మీశ్వరుఁడు సృజియించె నని వారనుకొనుచుండిరి శివాజియొక్క సొంతతంత్రయు నాతనికి ననుకూలుఁడు కాఁడయ్యె? ఇట్లు పరిస్థితి యంతయుఁ బ్రతికూలముగా నున్నను దనధైర్యసాహస ప్రతిభచే నూతన మరాటరాష్ట్రంబును సృజియించిన శివాజి నసమానసేనాని యనుటకు సందియంబులేదు.

స్వదేశాభిమానంబును స్వమతాభిమానంబును పరస్త్రీలయెడ మాతృభావము మొదలయిన యుత్కృష్ట సద్గుణంబులు శివాజియందు వాసము చేయుచుండెను.

ఇకఁ బరదేశస్థులైన చరిత్రకారులు శివాజియందున్న నవిన దుర్గుణములను గుఱించి కొలఁదిగా వ్రాసి ముగించెదము. మోసము, మూర్ఖ

ద్వైరికవిశ్వాసము నను రెండుదోషములు ముఖ్యముగా శివాజియం దారోపింపఁబడును. మోసముచేయుట దోష మని చెప్పుటకు సందేహములేదు. కాని మోసగాండ్రను మోసపుచ్చుట దోషమైనది దోషము కానిది యిద మిత్థమని నీతిశాస్త్రజ్ఞులు నిర్ణయించి యుండలేదు. ఇది యొకప్పుడైనను నిర్ణయింపఁబడు నని చెప్పుటకు వీలులేదు. ఏలయన నిట్టిచర్చ యెప్పుడు వచ్చినప్పటికిఁ గొందఱొకయభిప్రాయంబును సమర్థించుటయు మఱి కొందఱు తద్విరుద్ధాభిప్రాయంబు సమర్థించుటయుఁ దటస్థించును. ఊరు దోఁచుకొనుటకుఁ బోవుచున్న దొంగలగుంపుతో నసత్యమాడి తప్పు త్రోవఁ జూపి వారిని రక్షకభటులకు నప్పగించుట నీతియో యవినీతియో యెవరు గట్టిగాఁ జెప్పఁగలరు? జనక్షేమమే ముఖ్యముగాఁ దలఁచువారు దీనిని నీతియనియే చెప్పుదురు. జనక్షయకరం బైనను రూఢిసత్యంబె పరమం బని యెంచువారిది యనీతి యని వాదింతురు. రాక్షసాధ్యక్షుండును వదాన్యదాతయు నగు బలిచక్రవర్తి యిట్లు చెప్పెను.—

"క. మేరువు తలక్రిం దైనను,
బారావారంబులింకఁ బాఱిన లోలో,
ధారుణి రజమై పోయినఁ
దారాద్యము బద్ధమైనఁ దప్పక యిత్తున్"

నీతివిశారదుండును రాజకార్యకుశలుండును నైన కృష్ణుఁ డిట్లనియె "

"ఆ. ప్రాణహాని వచ్చుపట్టున సర్వధ,
నాపహారవేళ యందు నడపు
సత్య మనృతమం డ్రసత్యంబు సూనృత,
మని పరిగ్రహింతు రార్యజనులు "

హిందూదేశములోని యింగ్లీషురాజ్యమునకుఁ గూటస్థుఁడనిచెప్పఁదగు క్లైవు దొరగా రిట్లు వ్రాసియున్నారు —

"ఇట్టి సత్యంబులను లక్ష్యపెట్టని దుర్మార్గులతో వ్యవహరించునప్పుడు కుయుక్తియు మాత్రము ఇట్టి సత్యములచేత మనలను బంధించుకొని

మన బ్రాహ్మసామాజికులకు విచిత్రముగనుండును. బ్రాహ్మసామాజికు లవాఙ్మానసగోచరుండగు సృష్టియొక్క యాదికారణంబునందు దయాదాక్షిణ్యము మొదలయిన మానవగుణంబు లారోపించి తమచేతుల కింపైన వాద్యంబులు మందిరములో వాయించుచు నాటకములోని సూత్రధారునివలె గానముచేసి ప్రార్థనచేయుట యస్వాభావిక మనియు విగ్రహారాధనము వంటి పెద్దవిగ్రహారాధన మనియు స్పెన్సరీయ (Herbert Spencer) అజ్ఞేయ వాదులు (Agnostics) చెప్పుదురు. ఇట్లొండొరుల మతము లొకరికి నసమ్మతంబు లగుట స్వాభావికంబు. ఇంతమాత్రముచే నొకరినొకరు నిందింపఁగూడదు. మైనస్మ్రను బూజచేయువారిలో సజ్జనులు లేరా? ఇంతయేల? నాస్తికులలోను సజ్జనులు లేరా? బ్రాడ్లావంటి మహాత్ముండు లుండు గదా! కాన నందఱకును మతద్వేషాభావంబు (Religious tolerance) ఉండవలయును. పర మతవిశ్వాసములను గుఱించి శివాజీని దూషించుటకు మనకు నధికారము లేదు.

సమాప్తము